# ఆంధ్రగ్రంథమాల పుస్తకములపట్టిక

---

ఆంధ్రవిజ్ఞానసర్వస్వము (౭ సంపుటములు) సంపు. 1 కి రు. 10-0-0

శ్రీ మహాఋషినిఘంటిత యోగశాస్త్రము—కా. సూర్య
నారాయణయోగిని ... 5-0-0

భగవద్గీత (సంస్కృ.)—బె. రామారావుగారి వ్యాఖ్యాన
ముతో 1, 2, 3 సంపు॥లు మాత్రమేయున్నవి. సంపు. 1 కి ... 1-8-0

శతకకవులచరిత్ర—వం. సుబ్బారావుగారు ... 1-8-0

పారిభాషికపదకోశము (ఇంగ్లీషులోని శాస్త్రీయపద
ములు తెలుగుపదముల నిఘంటువు) ... 1-4-0

ఆంధ్రవాఙ్మయసూచిక (ముద్రితాముద్రితగ్రంథములపట్టిక) 1-0-0

శ్యామసుందరము—ఒం. సత్యనాథముగారు ... 1-0-0

జీవనప్రభాతము (న.)—కె. యన్. వెంకటరమణిగారు ... 1.0-0

భీష్ముడు (నాటకము)—పా. పిచ్చిరెడ్డిగారు ... 1-0 0

అవిమారకము (నాటకము)—మానపల్లి రామకృష్ణకవిగారు 0-10-0

కృషీవలవిజయము ... 0-8-0

వివాహతత్వము—బం. మల్లయ్యశాస్త్రిగారు ... 0-8 0

నిరుక్తభారతము—మం. వెంకటశర్మగారు ... 0-8-0

శ్రీరామవిజయము (నాటకము) ... 0-8-0

ఆరోగ్యసాధనము— గాంధీమహాత్ముడు ... 0-8 0

గీతాబోధ— ... 0-4-0

ప్రార్థనగీతావళి ... 0-4-0

హాలికోద్ధారము—(ప్ర) శేషాద్రిశర్మగారు ... రు. 0-4-0

మానవస్వత్వములు—థామస్ పెయిన్ ... 0-4-0

హిందీతెలుగు బాలశిక్ష—పం. ఆ. శాస్త్రిగారు ... 0-6-0

,, మొదటివాచకం ... 0 6-0

---

**మేనేజరు, ఆంధ్రగ్రంథమాల,**

7, తంబుశెట్టి వీధి  జి. టి., మద్రాసు,



# విషయానుక్రమణిక

## అక్టోబరు, 1945

## చిత్రములు



అద్వయానందము

చిత్రకారుడు । శ్రీ యేడిది సీతారామమూర్తి.





| సంపుటము | అక్టోబరు, 1945 | సంచిక |
|---|---|---|
| 22 | పార్థివ ఆశ్వయుజము | 10 |


# నమోవాకము

= శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మ =

తన తను వఖిలభూతనికాయకాయమై స్పర్శసర్వమ్ము విస్పష్టపఱుప
తన కన్నుగవ సర్వదర్శియై లోకమందలి మంచిచెడ్డల తఱచిచూడ
తన వీనుదోయి ద్విధాబద్ధజనుల కృతాకృత వేదన మ్మాలకింప
తన నాస నరుల చిత్తము దూఱి దుర్గుణ సుగుణపుంజములు మూచూచి తెలుప
తనదు నాలుక నిఖిలభూతముల సేమ - మిల నిలుప శుభాపాది వాక్కులనె బలుక
తానుగా నుండి సర్వాత్ముడైనయట్టి - యా మహాత్మున కేను ప్రణామ మిడుదు.

జయజయ భారతీయమనసా పరిపూజిత ధర్మపాలకా!
జయజయ దేశమాతృపదసద్మ సమర్పిత సర్వజీవనా!
జయజయ జానకీరమణ చారు పదార్చిత చిత్తపంకజా!
జయజయ గాంధిదేవ! భవసాగరవత్ పరదాస్యమోచనా!



# గాంధిజీ





= శ్రీ కుమారరాఘవశాస్త్రి =

ఆయన సత్యవాది, మహిమాన్వితు, డుజ్జ్వలభారతీశతే
జోయుతమూర్తి, శాంతిరసశోభితు, డూర్జితసత్త్వుడున్, అహిం
సాయతివర్యు, డార్యజనసంస్తవనీయుడు, గాంధిజీ స్వదే
శీయుల దాస్యశృంఖలలు చెచ్చెర ద్రెంచెడి మాట సత్యమే.

ఏ నలుసంత సిగ్గభినయించుట లేక-అనంతమైన వి
జ్ఞాన, మనాదిసిద్ధమగు సభ్యత, సంస్కృతి గల్గు భారత
క్షోణికి చేయి వాయి ఒకచోప్పున గట్టిన కూటనీతి తం
త్రానుగ దుష్ప్రవర్తకుల కాయన ధిక్కృతియే కదా సదా.

ఈ యమృతైకమూర్తిని జయించెడి 'ఆటము బాంబు' లేదు; దీ
ర్ఘాయురుపేతు డీతడు, స్వరాజ్యరమాతరుణీసుహాసరే
ఖాయతచంద్రికాధవళకాంతి పరీవృతమాతృదేశసు
శ్రీ యదియెల్ల మా కితని చేచలువై లభియింపగావలెన్.



ఇతడే భారతమోక్షదాయకుడు, ప్రహ్వీభూతదేవాంశసం
భృతదివ్యాకృతి, లక్షలాదిప్రజ కేకైకాత్మ, ప్రాచీనభా
రతవిజ్ఞానసరస్వతీనిలయు, డార్యావర్తభానూదయ
స్థితికిన్ తూరుపుకొండ, వర్ధిలవలెన్ తేజస్వి వేయబ్దముల్.

# పురాణములు



= శ్రీ తెన్నేటి విశ్వనాథం

పూర్వకాలమునకు సంబంధించినది; పూర్వము జరిగినది; పూర్వమందు జరుపబడ్డది; తీసికొనిపోబడినది; జరిగినది; పాతబడి క్షీణదశకుకూడ వచ్చిన విషయము—ఇన్ని భావాలు పురాణము అనే శబ్దముయొక్క ఉత్పత్తిలో ఉన్నవి. పాణినినాటికే 'పురాణం' చాలా పాతకాలంనాటిది అయిందని "పురాణ ప్రోక్తేషు బ్రాహ్మణకల్పేషు; పూర్వకాలైక సర్వజరత్పురాణ నవకేవలాః సమానాధికరణేన; పురాభవమితి పురాటుచ్" అని వివిధంగా ఆయన చెప్పిన వ్యుత్పత్తినిబట్టి తెలుస్తుంది. పురాణం అనే శబ్దము వినేసరికి పూర్వకాలపు కథలు, అవి గల గ్రంథములు అని సహజంగా స్ఫురిస్తుంది.

వైదిక గ్రంథాలు చూచినట్లయితే పురాణములు చాలా పురాతనమైనట్లు కనిపిస్తుంది.

## పురాణముయొక్క ప్రసంగం

అథర్వవేదము, శతపథ బ్రాహ్మణము, బృహదారణ్యక, ఛాందోగ్య ఉపనిషత్తులు, తైత్తిరీయారణ్యకము, మహాభాష్యము, ఆశ్వలాయన గృహ్యసూత్రములు, ఆపస్తంబసూత్రములు, మనుసంహిత, రామాయణము, మహాభారతము మొదలగు పూర్వగ్రంథములందు 'పురాణము' విషయమయి ప్రసంగము ఉన్నది.

అథర్వవేదం ౧౧(౭)౨౪—

ఋచః సామాని ఛందాంసి పురాణ్యాజుషాసహ
ఉచ్ఛిష్టా జజ్ఞిరే సర్వే దివి దేవా దివి శ్రితాః.

తథా స బృహతీం దిశ మనువ్యచలత్, త మితిహాసశ్చ పురాణంచ, గాథాశ్చ నారాశంసీశ్చ అనువ్యచలన్. (౧౧) ఇతిహాసస్యచవై, పురాణస్యచ గాథానాంచ నారాశంసీనాంచ ప్రియం ధామ భవతి య ఏవం వేద. (అథర్వ కా. ౧౫ అను ౧ ప్ర ౬ మం ౧౨).

అంటే యజ్ఞముయొక్క ఉచ్ఛిష్టముద్వారా ఈశ్వరునిచేత యజుర్వేదముతోపాటు ఋక్కు, సామములు, ఛందస్సులు, పురాణమున్ను ప్రకటమయినవి. వేదాలు ముందు వెళుతూంటే పురాణాలు మొదలయినవి వాటిని అనుసరించివెళ్లాయి. ఇతిహాసాలు, పురాణాలు, గాథలు నరులయొక్క చరిత్రలకు పవిత్రమైన వసతిగృహాలవంటివి :

"ఏవమిమే సర్వే వేదా నిర్మితా స్సకల్పాః సరహస్యాః సబ్రాహ్మణాః సోపనిషత్కాః సేతిహాసాః సాన్వయాఖ్యాతాః సపురాణాః సస్వరాః..."
(గోపథబ్రాహ్మణము ౨-౧)

వేదాలతోపాటే పురాణాలు వచ్చాయి.

"ఏవంవా అరే అస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేదః సామవేదోథర్వాంగిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషదః" ...౨ (౪) ౧౧.

ఈ మహాభూతంయొక్క నిశ్వాసనుండి ఋగ్వేదాదులు, పురాణము మొదలయినవి ఉత్పన్నములయినాయని వున్నది.

ఛాందోగ్యంలో తాను చదివినవాటినిగురించి నారదుడు—

"సహోవాచ ఋగ్వేదం భగవో ధ్యేమి; యజుర్వేదం సామవేద మథర్వణం చతుర్థ మితిహాసపురాణం పంచమం వేదానాం వేదమితి"(౭-౧) అని చెప్పేడు.

పురాణం పంచమ వేదం అనికూడా భావం.

శతపథ బ్రాహ్మణంలో పురాణంయొక్క అధ్యయనం ఉన్నది.

"ఏవం విద్వాన్ వాకోవాక్య మితిహాసః పురాణమి త్యహరహః స్వాధ్యాయ మధీతే త ఏన స్తృప్తా తర్పయన్తి సర్వైః కర్మైః సర్వైః భోగైః" ౧౧ (౬) ౭ (౯)

## వైదిక కాలం

కాబట్టి పురాణము సనాతనమైనది. అయితే వైదికకాలానికితర్వాత వ్యాసులవారు ఉండేవారు; వారు పురాణాలు వ్రాశారు అని ప్రసిద్ధి. మీద చెప్పిన పురాణాలు, వ్యాసులవారు వ్రాసిన పురాణాలు ఒకటేనా, భిన్నమైనవా?

దేవాసురుల యుద్ధానికి ఇతిహాసం అని పేరు. "అసద్వా ఇద మగ్రఆసీత్" ఇత్యాది. జగత్తుయొక్క ఆరంభావస్థతరువాత సృష్టిక్రమముయొక్క వివరణకు పురాణం అని సాయనాచార్యుడు ఐతరేయబ్రాహ్మణానికి భాష్యంలో వ్రాశాడు.

ఊర్వశియొక్క కథ మొదలైన బ్రాహ్మణాలలో వాక్యాలు ఇతిహాసమనిన్ని, "అసద్వా..." అనేవి పురాణమనిన్ని శంకరాచార్యులుకూడ బృహదారణ్యక భాష్యంలో వ్రాశారు.

వైదికయుగంలో సృష్టిప్రక్రియావివరణ మూలకమైన పురాణం ఉండేదన్నమాట స్పష్టము.

## ప్రమాణం

వాత్స్యాయనుడు "మంత్రాల యొక్క యు, బ్రాహ్మణాలయొక్కయు(ప్రవక్తలు) ఇతిహాసపురాణాలనుకూడ సంస్థాపనచేశారు. యజ్ఞాలకు మంత్రాలు బ్రాహ్మణాలు ఏలాగునో, లోకవృత్తికి ఇతిహాస పురాణాలున్ను, లోకవ్యవహారానికి ధర్మశాస్త్రాలున్ను అలాగునే ప్రమాణాలు" అని సూచించాడు.(న్యాయ సూత్ర ;౦, ౪ (౧) ౬౭)

సృష్టి మొదలగువాటి కథనము పురాణము యొక్క ముఖ్యలక్షణమని తేలుతూంది.

## లక్షణము : వస్తువ

విష్ణుపురాణం, బ్రహ్మాండపురాణం మొదలయిన వాట్లో—

"సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశానుచరితంచైవ పురాణం పంచలక్షణమ్"

సర్గ మంటే సృష్టితత్వము. ప్రతిసర్గ మంటే లయము. వంశం అంటే దేవతల తాలూకు, పితరుల తాలూకు వంశావళి. మన్వంతరములు అంటే ఏయే మనువు ఎంతకాలం అధికారమువహించాడు, వహిస్తాడు, ఆసమయంలో జరిగిన విషయాలున్ను, సూర్యచంద్రవంశాల రాజులు, వారి జీవితాలున్ను. రామాయణం బాలకాండలో సుమంతుడు (సూతుడు) దశరథునితో—

"ఏత చ్ఛ్రుత్వా రహః సూతో
రాజాన మిద మబ్రవీత్
శ్రూయతాం య త్పురావృ-
పురాణేషు మయా శ్రుతమ్."

అని అన్నాడు

మహాభారతం ఆదిపర్వములో—

పురాణేహి కథా దివ్యా ఆదివంశాశ్చ ధీమతాం
కథ్యంతే యే పురాస్మాభిః శ్రుతపూర్వాః
పితు స్తవ."

శౌనకుడు అనగా, ఉగ్రశ్రవుడు—

"ఇమం వంశామహం పూర్వం
భార్గవం మహామునే
నిగదామి యథాయుక్తం
పురాణాశ్రయ సంయుతం" ౫ (౬-౭)

ఆదిపర్వంలోనే, నీ పుత్రుడిలాగే, పురు, కురు మొదలయినవారు వేలకొద్ది రాజులు విపులమయిన భోగాలను విడిచిపెట్టి వెళ్లేరు. వారి గుణాలు, కర్మలు "కథ్యతే లోకే పురాణే కవిసత్తమైః" అని ౧ (౨౪)

శ్లోకములలో వ్రాసినదానినిబట్టి మహాభారతకాలం నాటికే భిన్నలక్షణాలతో, అనేకమంది కవిసత్తములు వ్రాసిన పురాణములు ఉన్నట్లు స్పష్టమవుతుంది.

మనుస్మృతిలో "స్వాధ్యాయం శ్రావయే త్పిత్రే ధర్మశాస్త్రాణి, ఆఖ్యానాని, ఇతిహాసాంశ్చ పురాణాని అఖిలానిచ" ౩ (౨౩) అని ఉన్నది.

ఆశ్వలాయన గృహ్యసూత్రాల్లో "ఆయుష్మతాం కథాః కీర్తయన్తో మాంగల్యా నీతిహాస పురాణానీ త్యాఖ్యాపయామానాః" ౪ (౬) అని మంగళప్రదమైన కథలు పురాణాల్లో ఉన్నాయని ఉన్నది.

కాబట్టి ఇప్పటికి తేలిన విషయం : ఏ విధంగా ఈశ్వరానుగ్రహంచేత వేదాలు ఋషుల హృదయములో ఆవిర్భావమయినవో, అదేవిధముగా పురాణములును ఋషి హృదయాల్లో ఆవిర్భవించినవి.

### విస్తరము

పురాణములు ఎన్ని అనేది మహాభారతం మను, మహాభాష్య, వాల్మీకి, ఆశ్వలాయనసూత్రములు మొదలయినవి చూచితే తేటపడుతుంది.

రేవామహాత్మ్యంలో-

"పురాణ మేక మేవాసీ దస్మిన్ కల్పాంతరే నృప
త్రివర్గసాధనం పుణ్యం శతకోటిప్రవిస్తరమ్.
స్మృత్వా జగాద చ మునీ న్ప్రతి దేవ శ్చతుర్ముఖః
ప్రవృత్తిః సర్వశాస్త్రాణాం పురాణస్యాభవ త్తతః
కాలేన గ్రహణం దృష్ట్వా పురాణస్య తతో నృప
వ్యాసరూపం విభుం కృత్వా సంహరే త్సయుగే యుగే
చతుర్లక్షప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా
త దష్టాదశధా కృత్వా భూర్లోకేస్మి న్ప్రభాష తే
అద్యాపి దేవలోకే త చ్ఛతకోటిప్రవిస్తరం
తదర్థోత్ర చతుర్లక్షః సంక్షేపేణ నివేశితః
పురాణాని దశాష్టౌచ సాంప్రతం తదిహోచ్యతే"
౧ (౨౩) ౩౦

మొదటిలో శతకోటివిస్తరమైన పురాణం ఉండేదనిన్ని, రానురాను చదువుకొందుకు వీలుగా ఉండాలనని ద్వాపరయుగంలో వ్యాసుడు దీనినే నాలుగు లక్షలగ్రంథముక్రింద సంక్షేపపరిచి ౧౮ పురాణములుగా చేశాడనీ దీనివల్ల తెలుస్తుంది.

రేవాఖండంలోనున్నదే పద్మపురాణంలో సృష్టి ఖండంలోను ౧-వ అధ్యాయంలో చెప్పబడింది. కాబట్టి వ్యాసుడే ౧౮ పురాణాలకు కర్త, వక్త.

### వ్యాసుని కర్తృత్వము

అయితే ఒకడే కవి వ్రాసినట్లయితే, పురాణాలలో భేదాలున్నాయిగదా వాటివిషయమయి ఏమి చెబుతారు అని విమర్శన ఉంది. విష్ణు, భాగవత, బ్రహ్మవైవర్త పురాణాల్లో శైలికూడ వేరువేరుకవుల వ్రాతలాగు వున్నదనికూడ అంటారు.

మత్స్యపురాణం ౫౩ అధ్యాయంలో—

"పురాణ మేక మేవాసీ త్తదా కల్పాంతరే౽నఘ
త్రివర్గ సాధనం పుణ్యం శతకోటిప్రవిస్తరం
నిర్దగ్ధేషుచ లోకేషు వాజిరూపేణవై మయా
అంగాని చతురో వేదాః పురాణం న్యాయవిస్తరం
మీమాంసా ధర్మశాస్త్రంచ పరిగృహ్య మయా కృతం
మత్స్యరూపేణచ పునః కల్పాదా వుదకార్ణవే
అశేష మేత త్కథిత ముదకాంతర్గ తేనచ
శ్రుత్వా జగాదచ మునీ న్ప్రతిదేవా న్చతుర్ముఖః

* * *

"బ్రహ్మణాభిహితంపూర్వం యావన్మాత్రం మరీచయే
బ్రాహ్మం త్రిదశసాహస్రం పురాణం పరికీర్త్యతే
వారాహకల్పవృత్తాంత మధికృత్య పరాశరః
యత్ప్రాహ ధర్మానిఖిలాన్ తద్యుక్తం వైష్ణవం విదుః
శ్వేతకల్పప్రసంగేన ధర్మాన్ వాయురిహాబ్రవీత్ [తం
యత్ర తద్వాయవీయంస్యా ద్రుద్రమాహాత్మ్యసంయు
యత్రాహ నారదో ధర్మాన్ బృహత్ కల్పాశ్రయాణిచ
పంచవింశత్సహస్రాణి నారదీయం తదుచ్యతే
మార్కండేయేన కథితం తత్సర్వం విస్తరేణతు
పురాణం నవసాహస్రం మార్కండేయ మిహోచ్యతే
వసిష్ఠాయాగ్నినా ప్రోక్త మాగ్నేయం తత్ప్రచక్షతే"

దీని భావం—మొదటిలో ఒకటే పురాణం ఉండేది. అది శతకోటిశ్లోకవిస్తారమైనది. లోకములు ఒకప్పుడు దగ్ధమైనప్పుడు బ్రహ్మ 'వాజిరూపంతో నాలుగు వేదాలను, వాటిఅంగాలను న్యాయమీమాంస ధర్మశాస్త్రాలను గ్రహించి కల్పాదిని తిరుగ మత్స్య రూపముతో జలమందు అంతర్గతమయి అన్నిటిని చెప్పాడు.

మరీచితో బ్రహ్మ చెప్పినట్లు బ్రహ్మపురాణం ౧౩,౦౦౦ శ్లోకములు గలది; వరాహకల్పము యొక్క వృత్తాంతము పరాశరుడు సంగ్రహించి చెప్పినది విష్ణుపురాణము. శ్వేతకల్పవృత్తాంతము రుద్రమాహాత్మ్యము వాయుపురాణంక్రింద వాయువు చెప్పేడు. బృహత్కల్పములో నానాధర్మాలు నారదుడు చెప్పినది నారదపురాణం; ౨౫౦౦౦ శ్లోకములు గలది. మార్కండేయుడు చెప్పినది ౯౦౦౦ శ్లోకములు గలది మార్కండేయపురాణము. అగ్నిదేవుడు వసిష్ఠునకు చెప్పినది అగ్నిపురాణం. ఈలాగుననే, అఘోరకల్ప(మందు) వృత్తాంతము ఆదిత్యునికి బ్రహ్మ చెప్పినది భవిష్యపురాణం. రథంతరకల్పవృత్తాంతము సావర్ణుడు చెప్పినది బ్రహ్మవైవర్తపురాణము. మహేశ్వరుడు లింగపురాణము చెప్పేడు.

బ్రహ్మాండపురాణంలోకూడ,

"పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతం
అనంతరంచ వక్త్రేభ్యో వేదా స్తస్య వినిర్గతాః"

వేదాలకన్న కూడ పురాణం ముందు ప్రచారంలో ఉన్నట్టు దీని సూచన. మొదట బ్రహ్మవల్ల మునులు విని, ప్రత్యేకకల్పాలలో వేరువేరు దేవతలు, మునులు వేరువేరుగ ఆయా పురాణసంహితలను నిర్మించినట్లు దీనివల్ల మనకు బోధపడుతూంది.

## భేదాలు : కారణం

ఆయా ఋషులు ఆయాకల్పములలో రచించిన పురాణాలనే వ్యాసుడు సంక్షేపముచేసి, ఆ ఋషులు వ్రాసిన అంశములనుమాత్రము ఆలాగుననే, అనగా వారు వ్రాసినట్లుగనే ఉంచివేశాడు. అయితే సంక్షేపముచేస్తున్నప్పుడు వృత్తాంతాలు, ప్రసంగాలు కలియడానికి తన స్వంతరచన మధ్యమధ్య చేసియుంటాడు అని ఊహించవచ్చును. పురాణముల్లో పేరుభేదంగాని, సంఖ్యభేదంగాని ఉన్నట్లయితే, ఆయాపురాణాలు వేరువేరుకల్పాల్లో ఉత్పన్నమైనట్లు ఊహించాలి.

క్వచిత్ క్వచిత్ పురాణేషు విరోధో యది లభ్యతే,
కల్పభేదాదిభిః తత్ర వ్యవస్థా సద్భి రిష్యతే.

అని ఉన్నది. మత్స్యపు. ౫౩ (౫౮)లో ఈ లోకహితార్థము పరమఋషిచేత సంక్షేపము చేయబడ్డది అని వ్రాసిఉన్నది. కాబట్టి వ్యాసుడు ఏవిధంగా వక్త, కర్త అయ్యేడో స్పష్టమయింది. ఎందుకు శైలీభేదాలున్నాయోగూడా తేలింది.

విష్ణుపురాణంలో (౩: ౬: ౧౬-౨౧)—

ఆఖ్యాయనైరుపాఖ్యానైః గాథాభిః కల్పశుద్ధిభిః
పురాణసంహితాం చక్రే పురాణార్థవిశారదః
ప్రఖ్యాతో వ్యాసశిష్యోభూ త్సూతో వై రోమహర్షణః
పురాణసంహితాం తస్మై దదౌ వ్యాసో మహామునిః

* * *

ఆద్యం సర్వపురాణానాం పురాణం బ్రహ్మముచ్యతే
అష్టాదశపురాణాని పురాణజ్ఞాః ప్రచక్షతే.

ఆఖ్యాన ఉపాఖ్యాన గాథ కల్పశుద్ధితోపాటు పురాణసంహిత వ్రాశాడు. వ్యాసునికి లోమహర్షణుడు అనే శిష్యుడుండేవాడు; ఆతనికి ఈసంహితను వ్యాసుడు ఇచ్చాడు. లోమహర్షునికి ఆరుగురు శిష్యులుండేవారు. సుమతి, అగ్నివర్చ, మిత్రాయు, శాంసపాయన, అకృతవర్ణ, సావర్ణ అని. ఇందులో కాశ్యపవంశీయుడైన అకృతవర్ణుడు, సావర్ణి, శాంసపాయనుడు అనే ముగ్గురు మూలసంహితను అవలంబించి ఒక్కొక్కరు ఒక్కొక్క సంహిత తిరిగివ్రాశారు. ఈ నాలుగుసంహితలయొక్క సారము విష్ణుపురాణము అని దీని భావము.

బ్రహ్మాండపురాణంలోకూడ ఈ నాలుగుసంహితల ప్రసంగము ఉన్నది. కొంతమంది బ్రాహ్మ

పురాణ మీపదవి అలంకరిస్తున్నదని అంటారు అని శ్రీధరస్వామి వ్రాశాడు.

స్వయంగా తెలిసిన విషయం వ్రాస్తే ఆఖ్యానం; ఇతరులవల్ల విన్నదాన్ని వ్రాస్తే అది ఉపాఖ్యానం; పితృవిషయములున్ను, పరలోకవిషయములున్ను, కుల కర్మలగురించి వ్రాసిన వాటిని గాథలనిన్ని, శ్రాద్ధ కథాదినిర్ణయాలనుగురించి వ్రాసినదాన్ని కల్పశుద్ధిఅనిన్ని అంటారు.

పురాణాలు ప్రచారంకాకముందు ఒక్క ఋగ్వేదంమాత్రం ఉండేది. ఆవేదాన్నే వ్యాసుడు నాలుగు భాగాలుగా విభాగించేడు. ఆవిధంగానే పురాణాలను కూడ విభాగంచేశాడు. అందుచేతనే విష్ణుపురాణం ఆరంభంలో ౧౮ పురాణాల పేర్లు ఉన్నాయి.

బ్రహ్మ, పద్మ, విష్ణు, శైవ, భాగవత, నారదీయ, మార్కండేయ, అగ్ని, భవిష్య, బ్రహ్మవైవర్త, లింగ, వారాహ, స్కంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ.

వీటి అన్నిటిలో సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితములున్నూ చెప్పబడేఉన్నాయి.

లేకుంటే బృహద్విష్ణుపురాణం అనే పేరుతో సకలపురాణసంహిత ఒకటి అయి ఉండిఉండాలి; అందులోనుండి ప్రస్తుతవిష్ణుపురాణం విడతీయబడి ఉండాలి.

బ్రహ్మ మొదలు చెప్పినప్పుడు ఒకటే పురాణ మనిన్ని, దానిని ౧౮ భాగములుగా వ్యాసుడు సంక్షేపం చేశాడనిన్ని, తరువాత సూతుడూ ఆయనగారిశిష్యులూ దానిని విభాగంజేసి అక్కడక్కడ సంస్కారం కూడ చేశారనీ ఒక ఊహకూడ ఉన్నది.

సృష్టిప్రక్రియకు సంబంధించిన విషయాలు కొంచెము హెచ్చుతగ్గుగా విష్ణు, మత్స్య, బ్రహ్మాండ, పద్మ మొదలైన పురాణములన్నిటిలో ఒక్కమోస్తరుగానే ఒకే మోస్తరుశ్లోకములలో, సాదృశ్యమయిన భాషలో ఉన్నవి. దీనికి కారణం ఒక సంహితను విడతీయుటే అని ఊహించాలి. ఉపాసకాభేదముచేత ౧౦ పురాణములక్రింద ప్రథమంలో ఉన్న ఒక్క ఆదిసంహితయే తరువాతవిభాగింపబడినదని స్పష్టమగుచున్నది.

అయితే విష్ణుపురాణంలో ఉన్న సృష్టిక్రమ వర్ణనక్రమం అన్ని పురాణాల్లోనూ లేదు. దీనికి కారణం—పురాణాలు కొన్ని ఒకయుగంలోను, కొన్ని మరియొకయుగంలోను ఋషులవల్ల చెప్పబడ్డాయి అని ఇదివరకే అనుకున్నాముకదా; అదే కారణం.

ఒకపురాణంలో మరొకపురాణం పేరు కనిపిస్తుందని చెప్పేంగదా.

"శ్రుణుష్వావహితో భూత్వా కథామేతాం పురాతనీం
ప్రోక్త మాదిపురాణేచ బ్రహ్మణా వ్యక్తరూపిణా"
(వామన పురాణం 3)

వామనపురాణంలో బ్రహ్మచెప్పిన ఆదిపురాణంలోవిషయమే సంగ్రహింపబడినది.

వరాహపురాణంలో—

"రవిం పప్రచ్ఛ ధర్మాత్మా పురాణం సూర్యభాషితం
భవిష్యపురాణమితి ఖ్యాతం కృత్వా పునర్నవం."
౧౭౭ (౫౯)

సూర్యుడు చెప్పినది భవిష్యపురాణము.

మత్స్యపురాణం ౫౩ అధ్యాయంలో పద్ధెనిమిది పురాణాలతాలూకు విషయవివరణ ఉన్నది. అంటే: లోమహర్షుని కాలంనాటికే పద్ధెనిమిది పురాణాలూ వేరయినట్లు కనిపిస్తుంది. ఆలాగే అతను చదువుకొనిఉంటాడు. శిష్యులు చదివి వారిలోవారు కాని, వ్యాసునితోకాని ఆసమయంలో మాట్లాడుకున్నదికూడ పురాణాల్లోకలిపి వేశారు. ఇంతేకాకుండ, నైమిశారణ్యంలో ఋషులతో సంభాషణలుకూడ చేర్చివ్రాశారు. సూతుని ద్వారా పురాణాలు ప్రచురణలోనికి వచ్చినట్లు తెలియడానికి కాబోలును ఈ విధంగా సంగతులు అన్నీ కలిపివేయబడ్డాయి.

## ౩౦

### = శ్రీ వింజమూరి శివరామరావు =

ఇప్పుడా - కల్వ కనుమూయ, నిప్పుడా - త్వ
దీయ సందర్శనమ్ము ప్రాప్తించె నాకు?
ఇంత గాలివాన - మెరుంగ నెపుడు; అడరి
పోతి రేయి నేమైపోతివో యటంచు.

నీలిమొయిళ్ల దొంతరల నీడల నీ మెయిజాడ లెంచి, శం
పాలతికాలసద్రుచి భవన్నయనాంతరకాంతి గాంచి, న
న్నేలుకొనంగ వత్తు వనియేసుమి నమ్మితి; మోసపోతి; చాల్
చాలిక కట్టిపెట్టుము మృషావచనమ్ములు మాయవేషముల్.

పరకాంతావరనయనాం
తరకజ్జల నీలరేఖ తావకమధురా
ధరమందు నిల్చియున్నది;
ఎరిగితి నీరాచకార్యమేమో - సరిలే!

ఇది యా వ్రేతల పల్లె కాదు; వినుమోయీ ద్వారకావాస! నీ
యెదలో మమ్ముల వెర్రిగొల్ల లనుకోనేరాదు; నీయాట సా
గదు మాదగ్గర నింక; ఎందులకు నీ కైమోడ్పు లీ యేడ్పులున్?
విదితమ్మైనది నీ మనోగతము తన్వీమానపాటచ్చరా!

ఎఱుగవా - సమర్పణమయ్యె నెపుడొ వలపు
విడిలు నా లేత బ్రతుకు నీయడుగుదోయి;
కిపుడు పేదరాలి, నోసంగ నేది కలదు?
ఇట నిలువనేల? దయచేయు మెచటికేని...

# ఋతుసంహారము

**శ్రీ భాస్కర్ల సూర్యనారాయణమూర్తి**

కవిత్వాన్ని అనేకులు అనేకవిధాలుగా నిర్వచించారు. కొంతమంది ఉక్తివైచిత్రి కవిత్వమన్నారు. కవిత్వాన్ని ఉక్తివైచిత్రిగా చూస్తే విచిత్రంగా చెప్పిన కావ్యాలు చాలా తక్కువ కనపిస్తాయి మనకు. అన్ని కావ్యగుణాలకంటే ఉక్తి వైచిత్రితో కావ్యరచన చేయడం చాలా కష్టం. అందుకనే కాసుల పురుషోత్తంగారి ఆంధ్రనాయకశతకం వంటి శతకం మరొకటి రాలేదు. ఆయన కున్న ఉక్తి వైచిత్రి అనితరసాధ్యంగా కనుపిస్తుంది. దానికి మరీ ఆ వ్యాజనిందాలంకారం తోడ్పడింది.

ఈ వైచిత్రి రెండువిధాలుగా ఉంటుంది. ఒకటి శాబ్దికమైనది; రెండవది భావసంబంధి. శాబ్దికమైన వైచిత్రిని సాధించడం రెండవదానికన్న సులభం. ఆంధ్రనాయకశతకం చదివినతరువాత మళ్లీ అంత ఉక్తి వైచిత్రికోసం వెదికితే కనబడ్డ కావ్యం ఋతుసంహారమే. ఈ కావ్యంలో తెలుగునాటి ఆరుఋతువులనూ వర్ణించడమైనది.

శరత్కాలం వర్ణిస్తూ—

"బురదత్రొక్కఁడు కాపుబుడుతఁడు మహిషంబు
పై స్వారిపోవును బాలయముఁడు
చింకిజుత్తునకుఁ గైసేయు నంత్రింతలు
పసిమాలకన్నియ పట్టమహిషి
చీడనూఁగగు మినపకాడకాయలను మూఁ
జూడదు దూడ నాజూకుకాన
అంతంత మూన్నెల లరకకట్టని గిత్త
యాండించు నంది దాయాదిగాఁడు"

అనెను. ఇందులో ఉన్న ఉక్తివైచిత్రి మహిషముపై స్వారిపోవు కాపుబుడుతణ్ణి బాలయముడనడం; కొజపువ్వులు చెవిలోన పెట్టుకొన్న పసిమాలకన్నెను పట్టమహిషనడం; నూగుపట్టిన మినపకాడకాయలను తినని దూడను నాజూకుకాన అనడం; అరకకట్టని గిత్తను నందిదాయాదిగా చెప్పడం చమత్కారాలు. ఒక సామాన్యమైన ధర్మాన్ని సామ్యము చేత ఉత్తమమైనదానినిగా చూపించడం వీటిలో సాధించడమైనది.

'నెలివడి బురదలో గిలగిలలాడు మ
త్స్యములచే బకతపశ్చర్య సడలె'
'పాతరలం దుంచఁబడిన విఘ్నేశ్వరు
కోసనా చెఱుకులు గుద్దలించె'

'వెనకిపోవు మొగిళ్ల నదలించి పరవఁవో
లించె దిగ్గజాల బాలేందురేఖ.'

లాన్ని వరిసూ

"వ్యాజమ్ము కనిపెట్టె పరిరంభరుచికినై
మూడు నిద్దురలలో ముద్దరాలు."

అనెను. ఇది లోకాద్భుతమైన ఉక్తివైచిత్రి. కౌగిలించుకొనేందుకు శిశిరము వ్యాజమవుట చమత్కారము. ముగ్ధకాన వ్యాజము లేకుండ కౌగలించుకొనే ధైర్యం లేకపోవడం యీ వాక్యాన్ని మరీ రసవంతంగా చేస్తోంది. ఇవి భావసంబంధమైన ఉక్తి వైచిత్రికి మచ్చుముక్కలు. ఇలా ఉక్తివైచిత్రి చూస్తే యీ గ్రంథమంతా ఉదాహరణగా చూపవచ్చు.

వర్షాకాలాన్ని వర్ణిస్తూ చెప్పిన యీ దిగువ పద్యంలో మేఘసమూహాలు నాలుగుప్రక్కలనుంచీ క్రమ్ముకువచ్చిన వన్న భావం చెప్పబడింది.

"అంతఃప్రగర్జన్మహాంభోధరమ్ములు
 నశనిపాతోగ్రఘోరాంబుదములు
మత్తసామజవదుద్వృత్త జీమూతముల్
 నీలనమ్రస్నిగ్ధ నీరదములు
శంపాప్రగాఢ భాస్వత్పయోధరములు
 ప్రౌఢధారావమద్వారిదములు
వాయు హతప్రధావద్వారివాహముల్
 వృష్టిమన్నికట కృపీటదములు
ప్రాతరవరుద్ధబాల సూర్యాతపములు
సాయమవరుద్ధ సూర్య తేజః క్షితములు
ఆది శుచిక్లప్తతాపాపనోదనములు
ముసరుకొనివచ్చి మానేల ముట్టడించె."

పై ఏడుపాదాలు బరువైన సంస్కృతసమాసాలు వేసి చివరిపాదంలో తేలికైన తెనుగుమాటలు వేసి సాధించిన దేమిటి? సామాన్యంగా ఆకసము బాగుగా మబ్బుపట్టినప్పుడు 'అమ్మ బాబో వానకురుస్తుం'దంటాం. ఈ భయం తెలుగుజీవితంలో సామాన్యమైంది. దీనిని పై పద్యములోని రీతిభేదమువలన కవి సాధించెను. బరువైన సంస్కృతసమాసాలతో దట్టమైన మేఘాలను వర్ణించి మానేల ముట్టడించె ననుటలో బలవంతుడైన శత్రువు దండెత్తివచ్చినట్లు స్ఫూర్తి. కారుమబ్బులు ఆకస్మికంగా చీకటిని కలుగజేస్తాయి. అందువలని భయాన్ని చమత్కారంగా శత్రువులు ముట్టడించినప్పుడు కలిగే భయంవంటిదని కవి స్ఫురింపజేశాడు. ఇదంతా శాబ్దికమైన ఉక్తివైచిత్రి. ఇందు శయ్యాభేదముచేత అర్థమును సాధించడమైనది.

ఈకావ్యంలోని ఉపమానాలు మరీ నూతనత్వం వెడలగ్రక్కుతున్నాయి. ఏకవియొక్క భావనా పటిమనైనా అతడు వాడిన ఉపమానాలను బట్టి నిర్ణయించవచ్చును. ఈయన ఉపమానాల్లో సంపూర్ణత, నవ్యత, తెలుగుసామాన్యజీవితానికి సన్నిహితత్వము కనబడతాయి. వసంతకాలంలో కోయిల భార్యాప్రవాసివోలె ప్రలపించినదట. ఎండి పగిలిన నేల బ్రతికిచెడినవాని గుండియవలె నున్నదట. హేమంతకాలపు మంచుబిందువు మధువువలె పూవులో మసలెను. నాలీని పటముపై బడ్డ బిందువు తులసి మ్రుగ్గులో నున్న దీపారాధనవలె మెరసినది. గుమ్మడి పూవులో నున్న మంచుబింగువు తట్టలో కూర్చుండబెట్టిన పెండ్లికూతురువలె కులికినదని చెప్పటలో యీయన కుపమానములను సమకూర్చుటయం దున్న నిరంకుశాధికారము కనపడుచున్నది.

ఈకవికి పల్లెటూరిజీవిత మన్న అభిమానము మెండు. ఈకావ్యంలో గ్రామజీవనానికి సంబంధించిన సామాన్యవిషయాలు అనేకచోట్ల రసవంతంగా చిత్రించబడ్డాయి.

"నిలచి నీలిగి చెవులూచి తల విదర్చిఁ
బొలములోఁ గట్టివేసిన ముసలియెద్దు"

పాడియావు యీనగా పంటకాపు, వాని పెండ్లాముచేసిన సుఖజాగరము, శిశిరకాలమున ములగచెట్టునకు కంబళిపుర్వు బలసి కూరాకులు నాకివోవుట, చన్నులు పగిలిన పాడిబఱ్ఱె పాలుతీయబోగా తన్నుట వంటి సామాన్యమైన రైతులు, రాపులుకూడ యీకవికి కావ్యవస్తువులైనవి.

"క్రొత్తనూర్చిన వడ్లకు సరికి సరి రేగు
 పండ్లమ్మవచ్చె లంబాడిపడుచు
వినిపించె వీథిలోనన గంగిరెడ్ల దా
 సరి సీత పెండిలి సలుపు కేక
బువ్వచిక్కము కొడవలిఁ బూని బయలు
 దేఱె వరికోఁతకొఱకుఁ బాలేరుచాన
ఒక విచిత్రమ్మ యగు శోభ నొలుకఁబోసె
వడి శరద్వేళ మాగాని పల్లెటూరు."

ఈపద్యం గ్రామజీవనం ఆయనకిచ్చే ఆవేశాన్ని చూపిస్తుంది

మహాకవుల లక్షణాల్లో మరియొకటి లోకధర్మాలను పరిశీలించిచూడడం. సామాన్యమైన విషయాలనే, రోజూ మనం చూచే వాటినే కవి నిశితంగా చూస్తాడు. ఆచూడడంలో మన దృష్టికి అందని, మన మనస్సుకు తట్టని చిన్నవిషయాలుకూడా వాని దృష్టిని తప్పించుకోలేవు. అలా చూచినవాడే ఉత్తమమైన కవి. 'Poetry is the mirror of Nature' అన్న వాక్యం నిజముకావలెనంటే కవి పరిశీలనాశీలి కావలెను. ఆంధ్రసారస్వతములో యీ శక్తి కలవాడు కృష్ణరాయలు. రాయలు బహువ్యాపకమైన సింహాసనమునందున్నను వరిపొలాలు, వానపాములు, వంటయిళ్లు సహితము ఆయనకవితాదృష్టిని తప్పించుకొనలేకపోయినవి. అది సర్వవస్తువులయందు కవితావస్తువును చూడగల శక్తి. ఆ మహాశక్తి రాయల తరువాత సత్యనారాయణగారిదే!

'వెల్లికచ్చికబూది జల్లించి గండు చీ
మలు పాయ మల్లెపాదులను జల్లి'
'గొంతుక్రిందటి యుండ గుసగుస లాడఁగా
నఱవాఁ దెఱచి తృషయైన కాకి
పందిట లేచుచుఁ బండుకొంచును నాల్క
చాచి రొప్పుచుఁ జొంగ జార్చు కుక్క'
'...ముండ్లయికాళ్లలను గ్రుచ్చుకొని నిక్క
చిఱునూదులగు నెండుగరికతలలు'

యివన్నీకూడా యీ కవి పరిశీలనాదృష్టిని తప్పించుకొనలేకపోయినవి

ఈ కవి తెలుగువాడు. తెలుగువారి ఆచారాలు, తెలుగుపిల్లల ఆటలు, తెలుగుసామెతలు, తెలుగుజీవితం యీయన ఏ కావ్యాన్నంచీ తొలగిపోవు. ఋతుసంహారంలో యీయన తెలుగుతనం ప్రతిపద్యంలోనూ వ్యక్తమవుతుంది. వర్షాకాలంలో యీ కావ్యంలోని పిల్లలాడుకునే ఆటలు చమత్కారంగా ఉన్నాయి. తెలుగుమాగాని పల్లెటూళ్లలో పిల్లలు చూడితేలువీపు షైడిప్ప తెరచి అందున్న తేలుపిల్లలను లెక్కపెట్టుదురు. వీరు ప్రకృత్యర్థనిర్ణాయకులు. తుంగకాడచీల్చి యీనుటకు సిద్ధముగా నున్న గేదె ఏదూడపెట్టునో జోస్యముచెప్పెదరు. వానకాలువలలో కాగితపు పడవలను వేయు నావికులును, ఎండవానల కలయికలో కుక్కల నక్కల పెండ్లి చేయు సుకేళినిధులును తెలుగుల ప్రతియింట నుండు పిల్లలే. ఈ తెలుగుబాలకులు 'వానలోకాలనుండి వచ్చి నడయాడుచున్న దేవతలవోలె ప్రకాశించిరి.' పిల్లలను దైవసమానులుగా చూడడం తెలుగువారి నైజం. వానలో తడిసిన బాలకులను వానలోకాలనుండి దిగివచ్చిన దేవతలనడం అందంగా ఉంది. వానలోకాల నూహించిన యీ కవిభావనా శక్తి అపారము.

వెన్నకొట్టినఁ గ్రిప్పె ఱాలుకొట్టినట్లు మేఘుడు హేళి కడ్డువచ్చెను. ముందు వచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు వరికి కలుపు ఎక్కువయ్యెను. మొరగిన కుక్క కరవ దన్నట్లు గర్జించిన మేఘము వర్షించుట లేదు. రోజు మంచిదైనచో పగలే గొంగిలించ మన్నట్లు కాలిబాటలలోకూడ గడ్డి మొలచినది. జనవ్యావహారికములో నున్న యీసామెతలను వర్ష ఋతుధర్మాన్ని చెప్పుటకు ఉపయోగించిన యీ కవిప్రతిభ ' త మైనది.

సిన్నపాలెకాపుపెండ్లి ఊరేగింపు, దానితో వచ్చు వారి అలంకారములు, ఆ ఆనందముతో ఒడ్డు విరిగిన పీఠి శిశిరఋతువునకే తెలుగుతన మాపాదించినవి.

ఈ చిన్నికావ్యములో ధ్వని నిండి తొలుకాడుచున్నది.

గ్రీష్మమును వర్ణించుచు—

"కోకిల మధువొల్కఁ గూసి యేమగుఁ దేనె
సేకరించెడు భృంగమే కడింది
రెండుజాముల యెండ మండి యేమగుఁ జల్ల
పాటున గొంతార్చు వడయె గడుసు
అల తొలిజాతిపండుల నేమియగు సము
ద్ధతి నంటుమామిళ్లె ధర పలికెడు
చలువ చేనూలువస్త్రము లెంతకగు వట్టి
యనదచీరలకె యత్యాదరంబు

గ్రీష్మ మరుదెంచి తన ప్రతాపోష్మ మరలి
కలిమియధికార మప్పు తేఁగలుగువారిఁ
గ్రొత్తరుచులకు మఱగించుకొంచు నేలు
బడిని సాగించెఁ బెఱజగ ముడుకఁ బెట్టి"

అనెను. ఈపద్యములో వ్యంగ్యము నిండి నిబిడీకృతమైయున్నది. సత్కవికావ్యగానమువలన కన్న ధనాధికారి ప్రయోజకు డగుచున్నాడని మొదటిపాదములో కవిభావన. ఒక్కసారి తీవ్రముగా కోపము తెచ్చుకొని వెంటనే మరచిపోవువానికంటె తడిగుడ్డతో గొంతుకోయువాడే కార్యసాధకుడని తెంపిన సాధను నందు స్ఫూర్తి. పుష్కలసాలకన్న క్రొత్తక్రొత్త జాతులకే ప్రాముఖ్య మనియు, పరికినాటి దేశవ్యామోహముతుండు ఉపయోగకరమును చేసియాలే నిలువలేక పోవుచున్నదనియు కవిబాధ. పరరాజు తనది కాని దేశములోని ప్రజలను స్వాభిమానముల బాధించి పరిపాలన సాగించుననని చెప్పుటలో కవిదేశాభిమానము విశదము. ఇందు మన దేశస్థితి చక్కగా ధ్వనింపజేసినాడు.

ఇట్టి మహాకావ్యలక్షణమును యింత సొగసుగా, మన సంఘము, దేశములోని పరిస్థితులను ఎత్తిచూపుటకు ఉపయోగించిన కవి మహాకవి కాకుండు టెట్లు!

ఏదైనా ఒక విషయము మనకు అర్థమయినదన్న, ఆవిషయమును, దాని గుణమును భిన్నముగా చూడగల శక్తి వచ్చినదన్నమాట. ఒక పుష్పము బాగుగా నున్నదన్నచో ఏ యితర పుష్పమునందైనను ఆసౌకుమార్యముచూడగల శక్తి యున్నదన్నమాట. కాళిదాసుని శాకుంతలము బాగున్నదన్నచో తన్మహానాటక లక్షణములు ఏ ఇతర నాటకమునందున్నను మెచ్చుకొనగల శక్తి యున్నదన్నమాట. ఆ లక్షణములు గల యితరనాటకములలో బాగును చూడలేనివాడు కాళిదాసుని శాకుంతలము మెచ్చియు మెచ్చనివా డగుచున్నాడు.

'అందమునుచోట సర్వమ్ము నందమేయగు'నను కవికులగురువుమాట తీసికొన్నచో, యీ వాక్యార్థము పూర్ణముగా తెలిసినచో ఏ యితరవస్తువునందైనను అందము చూడగల శక్తి యున్నట్లే. గడ్డముచివర వేసిన తెగగడ్డకు సుందరని బాలమెుగము కోలబారెను. ఎండలకు చిక్కి సన్నమైన బాల పొడుగుబారెను. చలువకొరకు కండ్లకద్దుకొనిన పచ్చకర్పూరమువలన కోసచూపులు కలిగెను. పై వాక్యమున కిచ్చిన యీ ఉదాహరణలవలన యీ కవి ఆ వాక్యము నెంత గాఢముగా అర్థముచేసికొనెనో స్పష్టము.

ప్రతిపదరసోచితమైన యీయనకవిత్వము నకు మరొక ఉదాహరణము:

శిశిర ఋతువులో తెలుగువనితలను వర్ణించుచు, 'స్మరమహోస్త్రయాగాగ్ని సమిద్ధమైన భీతహారిణాక్షులకు చలి బెదరిపోయె' ననెను.

ఇందు యజ్ఞేంధనములైన హరిణాక్షులకు చలి బెదరిపోయె ననుటయే చమత్కారము. వారు భీతహారిణాక్షులట. లోకమున సామాన్యముగా భయమన్నది పరస్పరాశ్రయము. మనము శత్రువును చూచి భయపడుచుందుము. శత్రువు మనను చూచి భయపడును. భీతహారిణాక్షులకు చలి బెదరిపోవుట రమ్యాతిరమ్యముగా నున్నది.

ఇన్ని ఉదాత్తమైన కవితాలక్షణములు గల యీ మహాకవి కొన్నిచోట్ల సామాన్యకవులు చేసెడి అలంకారములు చేయును.

"దీప్తి మాధుర్యావధి శిరస్సుధాంశుభా
స్వన్మనోహరవిలాసమ్ము లగుచు
క్లిష్టబంధ విచిత్రకేళీ ప్రశస్తి ర
హః కళాపూర్ణోదయమ్ము లగుచు
కృష్ణపదాగ్రభక్తి సుగృహీతాముక్త
మాల్యదాచ్ఛ ప్రౌఢమధువు లగుచు
అనితరలభ్య వర్ణోత్తశయ్యా హేతు
వై పాండురంగమహత్తు లగుచుఁ
దీయఁదనములు మెఱుఁగులుఁ దెచ్చుకొన్న
ప్రియలు ప్రియులుం గూడి మనుచరిత్ర లగుచుఁ
దెలుఁగు రసికలోకముల కందిచ్చె నసువు
లత్తుకొని మల్లెపూల్ క్రొత్తక్రొత్తరుచులు"

ఇట్టి సామాన్యమైన శ్లేషమీద యీ కవికి అపేక్ష ఎందుకో తెలియదు. ఇంత రసవంతమై, ఉదాత్తమైన కావ్యమునందు సామాన్యశబ్దాలంకార ములనుగూడ చొనిపినాడు.

ఈ చిన్నిగ్రంథము మన భాషాసరస్వతి కొక అమూల్యాలంకారము. వెనుకటి కొక కవి యీయనను గూర్చి చెప్పుచు 'పట్టినదెల్ల బంగారుచేయగలవా' డన్నాడు. దీనిని బంగారముకాదు - మాణిక్యము చేసినాడు. ఈ మాణిక్యము తెలుగులోకమున కెన్నాళ్లు రసజ్ఞతయుండునో అందాక తెలుగుసరస్వతికిరీటమున ప్రకాశించును.



# వీ వతి

## = శ్రీ బొడ్డు బాపిరాజు =

(హొయిసలేంద్రుల యశస్తంభమునకు మణికిరీటమెత్తిన బేలూరు చెన్నకేశవాలయ మాంధ్రకర్ణాట స్థపతిశేఖరుల కళాస్రవంతులకు పవిత్ర సంగమస్థలము. కోటితరగల పొంగిన యా మహాశిల్పసముద్రమున ఆధార శిలాశిల్పము లమృతద్వీపములు. అందును 'వీణావతి' లలితలావణ్యరేఖాప్రౌఢాకృతి. నా యీ కృతి కధికృతి.)

ఇటులే యెన్ని శతాబ్దముల్ గడచె తన్వీ! నీవు మందాకినీ
నటదూర్మిస్వనమోహనమ్మయిన వీణాదండమున్ బూని; చె
క్కిట లేయెండ చెమర్చె, నద్దుకొనజోకే కేశవస్వామి కే
మటు విన్పింతువు; —రాధికాప్రణయమిథ్యాకోప సందేశముల్.

భవతీ! యుష్మదతీంద్రి యాద్భుత సుఖప్రస్తావి వీణానము
ద్భవసంగీత రసప్రలుబ్ధులు సుపర్వశ్రేణు లేకాగ్రతా
నవబోధస్థితిలో శిలాప్రతిమ లైనారేమొ, కాదేని యీ
పవనాంకూరములందు నెచ్చటి వపూర్వ స్వర్గ సౌగంధ్యముల్.

సకలకళాజగద్విభవ శారదవో, వికసద్వసంత చం
పకసుకుమార వేన్నృపకుమారికవో, స్థిరశిల్పయోగ సా
ధకుని హృదంతరామృతవిధానమునం దుదయించినట్టి మే
నకవొ మరీవు నాకను లొనర్చిన పున్నెపు ప్రోవు వందునే.

ఏ లలితస్వరమ్ము నినదించిన దాచిరుమోవి, సోగకై
ద్రాలినచూడ్కి నేసొగసు పండిన, దామృదులాంగుళీక సం
చాలనమందు నేమధురభావము తోచిన దప్పు డాకళా
శాలిహృదబ్జమం దదియె శాశ్వతముద్ర వహించు నిప్పుడున్.

స్పందింపన్ కవితావిపంచిక చిరస్వప్నప్రపంచమ్ము, లా
క్రందింపన్ పరపుష్టజీవితము, కర్ణాటాంధ్ర కన్యామణీ
సౌందర్యమ్ములు మేళవించిన భవత్సాన్నిధ్యమం దెవ్వ డా
నందోన్మాదవిషాదభావనలలోనై యశ్రువుల్ రాల్పడో.

నీకు శిలాప్రవాసినికి నిద్దర దెల్పి యనంతయౌవన
శ్రీకమనీయమూర్తిగ రచించిన శిల్పిమహేంద్రు డిప్పు డే
లోకము లేలుచుండెనొ యెరుంగముకాని, తదీయకీర్తి గా
థాకృతు లాలకింతు మనుతాపభరమ్మున నీదు వల్లకిన్.

భవదనఘ గానవిద్యా ప్రభావితమ్ము,— ఈ పవిత్రకళాక్షేత్ర మిచట నిలిచి
నా యపశ్రుతి కలుషమైనట్టి బ్రదుకు—నుజ్జ్వలంబయ్యె నీ యరుణోదయమున.

# ఆ చిన్నది లైఫ్‌బాయ్ అభ్యాసము నేర్చుకున్నది!



ఆ చిన్నది తన జీవితమునకు కావలసిన విషయములను క్రమముగా
నేర్చుకొని యిప్పుడు తన తల్లికి సహాయకారిగావున్నది. ప్రతి గృహ
మందు ఆరోగ్యమునకు, సౌఖ్యమునకు, ప్రతిబంధకమగు "మురికివలని అపా
యము" నుండి కాపాడుటకు లైఫ్ బాయి సబ్బును ప్రతి
దినము వాడుట నేర్పటం మూలంగా తల్లి కూడా తన
కుమార్తెకు యిదివరలో గొప్ప సహాయమొనర్చింది.

**లైఫ్‌బాయ్ మంచి సబ్బుల్లోకి ఉత్తమమైనది**
**ఇది మంచి అలవాటు**

LEVER BROTHERS (INDIA) LIMITED




# —అందువల్ల పొదుపుకాగలదు

పొదుపుచేసే ప్రతి పనివల్ల డబ్బు ఆదాఅవుతుంది,—మిగులుతుంది మీకే. వారాలపాటు, నెలలపాటు ఈ విధంగా పొదుపుచేసుకుంటే చిన్నచిన్న మొత్తాలన్నీ కలిసి ఎంత పెద్దమొత్తం అవుతుందనుకున్నారు! ఈ రోజులలో పొదుపుగా వుండడం మీ విధికృత్యంకూడా. ఎందుకంటారా, సప్లయిలపై చెప్పలేనంత వొత్తిడి కలుగుతూవుంది; బీదలకు ఎన్నో అవసరాలు వున్నాయి. పొదుపుగావుండే సద్గుణ సంపన్నులయితే, దేశానికి సహాయపడగలరు; ఆర్థికంగా మీరు బాగుపడనూగలరు.



## మితవ్యయంతో కొరతను జయించు



చినిగిపోయిన తువ్వాళ్ళు, దుప్పట్లు, టేబిల్ క్లాత్‌లు మరికొంతకాలం ఉపయోగపడేటట్టు చేసుకోండి.



(పైజామాలను), పంట్లాములను, పంచెలను, రుట్టుకొని, కొత్తవాటినికొనడం తప్పించుకోండి



నాన్నబట్టలు, అమ్మబట్టలు పాతపడినవివుంటే వాటిని చింపి, పిల్లలకుకుట్టించండి. అప్పుడవి బాగానే కనిపిస్తాయి.



పాత చెప్పులను బాగు చేయించుకొండి గాని, పారవెయ్యవద్దు.



కొత్తగొడుగు కొనవద్దు, పాతదానిని బాగుచేయించండి.



పాత ట్రంకు పెట్టెలను, సూట్‌కేసులను హోల్డాలులను బాగు చేయించండి. కొత్తవి ఖరీదు ఎక్కువ, దొరకవు.

# సాధ్యమైనంతవరకు ఏదీకొనవద్దు

A.A.A—3.

ఇండియా ప్రభుత్వపు సమాచారం, బ్రాడ్‌కాస్టింగు శాఖవారి ప్రకటన

# ఏవఁడు కవి? ఏది కావ్యము?



= శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి =

కవిశబ్దము మిక్కిలి సనాతన మైనది. మంత్రద్రష్టలు, లేక మంత్రకృత్తు లనెడి యర్థమును దెల్పు ఋషి సూరి ధీర కవి శబ్దములు సమానార్థకములై వేదములఁ గనవచ్చును. ఇందు కవిశబ్దముమాత్రమే లౌకిక భాషలో కావ్యకర్త యను నర్థమున వాడుకలోనికి వచ్చినది గాని, దీనికి ఋషిశబ్దార్థమును పూర్వులు సమన్వయించకపోలేదు. భట్టతౌతుఁ డను మహాలాక్షణికుఁడు తన కావ్యకౌతుకములో నీశబ్దముల యర్థము నిట్లు నిర్వచించి యున్నాఁడు. అతని కృతి లభింపకపోయినా, ఈ శ్లోకములుమాత్ర మర్వాచీనుల వాక్కులం బడి జీవించి యున్నవి:

"నానృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్,
విచిత్రభావ ధర్మాంశ తత్త్వప్రఖ్యా చ దర్శనమ్;
స తత్త్వదర్శనా దేవ శాస్త్రేషు పఠితః కవిః"

"దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః"

"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా,
తదనుప్రాణనా జీవద్వర్ణనా నిపుణః కవిః"

అతీంద్రియ మైన ధర్మతత్త్వమును జ్ఞాననేత్రమునఁ జూచి, చూచిన ట్లుచ్చరించినవాఁడు ఋషియైన కవి యని మంత్రద్రష్టృపర మైన మొదటిభాగమున కర్థము. అసాధారణమును, సహృదయ హృదయాహ్లాదకారియు నైన విచిత్ర విషయమును కనిపెట్టి దానిని ప్రతిభావిశేషమున జీవ ముట్టిపడునట్లు వర్ణించు నేర్పుకాఁడు కవి యని లౌకిక కవిపర మైన రెండవ భాగమున కర్థము. ఇందు కుదాహరణము వాల్మీకి మహర్షి. అతని దర్శనము స్వచ్ఛమును, నిత్యము నైనను, శ్రీరామచరితవర్ణనము పుట్టువఱకును లోకమునఁ గవిత్వ ముదయింపలే దనుచు నతఁ డిట్లు పలికి యున్నాఁడు:

"తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యే ఒప్యాదికవే ర్మునేః
నోదితా కవితా లోకే యావ జ్జాతా న వర్ణనా"

దీనినిబట్టి రుచికర మైన విచిత్ర విషయము కనిపెట్టుటయు, దానిని సహృదయరంజకముగా వర్ణించుటయు లౌకికకవిలక్షణ మని విదిత మగుచున్నది.

ఈ లక్షణమే పూర్తిగా పట్టవలెనంటే వాల్మీకి తరువాత వ్యాసుఁడు లెక్కకు వచ్చును. మఱి భాసకాళిదాసాదుల మాట యేమిటి? లక్షణము చెప్పినట్టి వర్ణనము వారిదైనా, దర్శనము వారిది కాదు కావున వా రర్ధకవు లనఁదగుదురు గాని పూర్తికవులు కాఁజాలరనవలసివచ్చుచున్నది.—బాగున్నది. అయితే, ప్రాచీనపండితసంప్రదాయసమ్మతము లైన కవిలక్షణములలో నిది యొకటి కావచ్చును గాని, యిదే పరమప్రమాణ మనవచ్చునా? దీనినిబట్టి దీనికిఁ బాహ్యు లైన భాసకాళిదాసాదులే యర్ధకవు లైతే దీనికిఁ బరు లైన వారిమాట యేమి? అనువాదకు లైన తెలుఁగువారి గతి యేమి? ఈ వ్యాసము మొదటికే మోసము వచ్చును గదా!—అట్లుకాదు. ఇతరుల దర్శనమందలి ప్రధాన కథాంశమును గ్రహించినా, సాధారణమానవులకు గోచరింపని విచిత్రవిషయములను దర్శించి వాటితో సర్వాంగసౌష్ఠవముగా దానిని పెంచి పోషించు ప్రతిభ యున్నచో నతఁడు కవియే యన్న భావ మీలక్షణములో నిమిడియున్నది. 'కవిత్వబీజం ప్రతిభానమ్' ఇత్యాదిగా వామనరాజశేఖరాదులు నీభావమునే వెల్ల

డించియున్నారు. ప్రతిమానాటకమునందును, శాకుంతలములోను గనవచ్చువిషయ మంతయు రామాయణ భారతసంహితలలోనిదేనా! వారందు చూపిన చిత్ర విచిత్రమనోహరనూతనవిషయము వారి దర్శనము కాదా? అది యెల్ల ప్రతిభాకార్య మనుట స్పష్టము కదా! కావుననే "భాసో భాసయతే జగత్" "కవయః కాళిదాసాద్యాః" ఇత్యాదిస్తుతులకు వారు పాత్రులైరి. ఉత్తరరామచరిత్రలో ముప్పాతికమువ్వీసము భవభూతి దర్శనము కాదా? అందుచే వారు పూర్తికవులే యగుదు రనుట నిశ్చయము. కాని, ఆ నాఁడు కవిపద మెంతో గిరాకీ గాని, "పోకకు పుట్టెఁ" డన్నట్లు కారు చౌక కాదు. అది యెంతో దుర్లభవస్తువని, యిపుడు మనము మహాకవు లనుకొనుచున్న యా మహనీయులే భావించియున్నారు. ఇందుకు కాళిదా సెంతో జంకుచు నేమన్నాఁడో చూడుఁడు:

"మందః కవియశః ప్రార్థీ
గమిష్యా మ్యుపహాస్యతామ్."

అబ్బా! అంతటి కవిత్వకళామూర్తి కెంతటి సంకోచము! ఇది యహంకారనిరాసావచన మన్న ననవచ్చును గాని, చదివినంతనే తోఁచెడి యర్థమా! కవియన్న కీర్తి నపేక్షించుట నవ్వులపా లగుట యఁట! కవిపదము దుర్లభాతిదుర్లభ మనుట కింతకంటె వేఱే సాక్ష్య మేల? ఇదే యంత దుస్సాధ మైతే మహాకవి పదము మాట? ఆ విషయము నిరూపింప మనము సమర్థులము కాము. ఆనందవర్ధనాచార్యుఁ డేమన్నాఁడో చూడడమే మన పని:

"అస్మి న్నతివిచిత్రకవిపరంపరావాహిని సంసారే కాళిదాసప్రభృతయో ద్విత్రాః పంచషావా మహాకవయ ఇతి గణ్యంతే."

అతివిచిత్ర మైన యీ కవిపరంపరారూపసంసారములో కాళిదాసాదు లిద్దఱు ముగ్గురు, లేకపోతే అయిదాఱుగురు మహాకవులుగా గణింపఁబడుచున్నారని నిర్దాక్షిణ్యముగా చెప్పినాఁడు. మన లెక్కను బట్టి చూచినా, ధ్వన్యాలోకములోని యితరకవుల శ్లోకములనుబట్టి చూచినా, యితనినాఁటికి గణనకు వచ్చిన కవులు సుమారు వందమంది యుందురు. అయితే నేమి? ఏప్రతిభావిశేషము పాఠకులయు, శ్రోతలయు హృదయము నానందమయము గావించునో, అట్టి ప్రతిభ గల మహాకవులు వారిలో నాలుగురి కంటె నెక్కువ లే రని యొక్కమాట చెప్పి విడిచి పెట్టినాఁడు. ఆయైదాఱుగు రయినా, తమంతఁ దాము మహాకవుల మని యనుకొన్నవారు కారు; నలుగురిని చేరఁదీసి యనిపించుకొన్నవారు కారు. లోకములో వారి కున్న ప్రఖ్యాతినిబట్టి యితఁడు గణించినవారే. సెబా సానందవర్ధనా! గొప్ప ధైర్యశాలివి. మహాకవిబిరుదమునకే నీ వింతయాగ్రహము చూపినావు, దీనిని తలదన్నే నేఁటి బిరుదులు నీనాఁ డున్నచో నీనిర్ణయ మెట్లుండునో! ఏ మయితే నేమిలే! ఆకాలము గనుక నీమాట చెల్లినది. నీవిపుడు మా దేశములో నుదయించి యింతమా టందువా, నీపని యే మగునో!

అర్వాచీన సంస్కృత కవులలో కొందఱు దుర్గర్వదురహంకారముల నేవేవో బిరుదులు తగుల్చుకొని విజృంభించినమాట నిజమేకాని, వారైనా చెప్పడానికి వీలులేనంతగా మితిమీఱినవారు కారు, పాపము! వారి కావ్యము లైనా బయటికి రాలేదు. ఇఁక నట్టివారి గొడవ యెందుకు?

ఇంతదనుక సంస్కృతమందలి కవిలక్షణ మెట్టిదో, కవులు, మహాకవులు ననఁదగినవా రెట్టివారో కొంచెము తెలిసికొన్నాము. ఇట్లే తెలుఁగు నఁగూడ కొంతవఱకు చూతము.

నన్నయార్యుఁడు మొదలుగా పోతనార్యునివఱకు మహనీయు లెందఱో యున్నారు. వారందఱు ననువాదకులే యైనను, అలోకసామాన్యమైన ప్రతిభచే విచిత్రవిషయము లెన్నో చూపినవారు గావున దర్శనవర్ణనములు రెంటను వారు కవులై దేశీయులకు మృదుమధురభావ ప్రసాదించి కవిత్వభిక్ష పెట్టినవారై వంద్యు లగుచున్నారు. అవకాశ మున్నను వారు తమ

పోషకప్రభువులవల్ల బిరుదులు గైకొన్నవారు కారు. అట్టివారికి బిరుదు లెందుకు? వారి పేరే బిరుదు. శ్రీనాథుఁ డొకఁడు తప్పనిసరి యగుటచే గౌడడిండిమభట్టుకంచుఢక్క పగులఁగొట్టించి, దేశమంతట వెలసినాఁడు కాని, యతఁడైనా, తన కవిత్వశక్తికి మెచ్చి చంద్రశేఖరు క్రియాశక్తిరాయలు నిండుపండితకవిసభలో నిచ్చిన కవిసార్వభౌమబిరుదము పరిగ్రహించి యొక చాటుపద్యములో నొకమాఱు స్మరించినాఁడే కాని దానిని బుజాన వేసికొని యూరేగలేదు. అరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురి కన్నాఁడు గాని పోవునపుడు కూడా పట్టుకొనిపోవుట కుద్యమించలేదు. అల్లసానిపెద్దనార్యుని యాంధ్రకవితాపితామహబిరుదము నట్టిదే.

కాని, ఇక్కడ నొకమాట—పూర్వసంస్కృతకవులవలె పూర్వాంధ్రకవు లందఱును నిర్మత్సరులు, నిరహంకారులు కారు. వీరి కర్వాచీనసంస్కృతకవుల గుణములు కొన్ని యబ్బినవి. ఇఁక నర్వాచీనాంధ్రకవు లందుమా, వా రర్వాచీనసంస్కృతకవులను మంచివా రనిపించినవా రైరి. ఈ పోలికలు గుణములందే కాని, కవితాశక్తిని కాదు. మన ప్రస్తుతవిషయ మదే కదా ! కాని,

"అంతా కవులము కామా ?
అంతంతగ కందపద్దె మల్లఁగలేమా ?"

అన్నట్లున్న యీ రోజులలో- వేమనశతకసుమతిశతకకర్తలు మహాకవు లనఁబడుచున్న యీకాలములో- కవితాశక్తిపరీక్ష కాకదంతపరీక్షయే యైనా, మనవారు చెప్పిన కవిలక్షణ మెట్టిదో యొకింతచూచుట కేమి ? కవిలక్షణము నిర్వచించినవారిలో నత్యంతమర్వాచీనుఁ డయ్యు, నాద్యుఁ డనఁదగినవాఁడు పింగళిసూరనార్యుఁడు. ఇతఁడు కళాపూర్ణోదయములో కలభాషిణిమాటలుగా—

"పాసఁగ ముత్తెపుసరుల్ పోహాళించినలీల—"
"చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను-

అను రెండుపద్యములలో నిట్టి కవిత్వము చెప్పినవాఁడు 'సుకవి'యన్న సిద్ధాంతము నెలకొల్పినాఁడు. అందఱికి నాహా పుట్టించెడి యద్భుత, మపూర్వము నైన కథాసన్నివేశముతో కళాపూర్ణోదయము నిర్మించిన యితఁడే దీనికి లక్ష్య మగునో కాఁడో యని యొకానొక రన్నట్లు మనము సంశయించినచో నిఁక నితని కవిలక్షణము సార్థకము గావించు కావ్యకర్త యేఁడీ?

ఏది కంటఁబడినంతనే చదువ నుత్సాహము పుట్టించునో, ఏది చదివి యొక్కమా ఱాలోచించినంతనే హృదయము నానందపరవశము గావించునో, ఏది మఱిమఱి చదువబుద్ధిపుట్టించునో, ఏది విన్నంతనే మనస్సు నాకర్షించునో మధుమయఫణితి నున్న యట్టి సరసకావ్యము సారస్వతమున శాశ్వతము. అట్టిదానిని నిర్మించినవాఁడు కవి. అంతే కాని, పదిమందిని పోగుచేసి తన కావ్యమును తానే నుతించుకొనుచు పాడి వినిపించి యెన్నాళ్లు బళీయనిపించుకోఁగలఁడు? అదెన్నాళ్లు నిలుచును?

కాలకర్మవశమున నాలువందలయేళ్లు ణఁగియున్న యుత్తరహరివంశ మిపు డుత్తమకావ్యముగా పొగడ్త కెక్కుటకు నాచనసోముని యత్న మేమున్నది? దాదాపు మూఁడువందల యేండ్లు మూలఁబడియున్న కళాపూర్ణోదయ మిపుడు సకలజనవంద్య మగుటకు సూరనార్యుని యత్న మేమి? నిజముగా వారు కవులు, అవి హృదయంగమము లైన కావ్యములు: అంతే కారణము. మూఁడువేల సంవత్సరముల క్రిందట నుదయించిన రామాయణ భారతములు నేఁడు పుట్టిన ట్లున్నవి. ప్రపంచ మున్నంతవఱకును భాసకాళిదాస భవభూత్యాదుల కృతులు నిలిచియుండవా? కారణము ? వారు చెప్పఁదగిన కవులు, అవి చెప్పఁదగిన కావ్యములు. కవిత్రయమువారి భారతము కలకాలము నిలుచును గాని, దానితో నిలుచు మఱియొక పురాణ మేది? అట్లు తన కావ్యముతో శాశ్వతముగ జీవించువాఁడు గాక మఱియొకఁడు కవి యగునా?

కావ్యమందు గుణమున్నదా, అది పుట్టినంతనే రాణించలేదని విచారింప నక్కఱలేదు. భవభూతి చెప్పినట్లది రాణించుట కనంతమైన కాల మున్నది. సంస్కృతమున నుదయించిన కావ్యము లెన్ని వేలో! అందు నిలిచిన వెన్ని, వాటిలోఁగూడ నేఁటికిని పాఠకుల నాకర్షించుచున్న వెన్ని యొక్కమాఱు పరిశీలించినచో, కవికావ్యతత్త్వము కంటఁబడును. అట్లే కడచిన తొమ్మిదివందల సంవత్సరములలోని తెలుఁగు కావ్యముల స్థితిగతులను వివేకించినచో, కవి యెవఁడో, కావ్య మేదో గోచరించును.

కవి సరియైన యధికారి యైనఁ గాని కావ్యము చిరస్థాయి కాదు. అధికారి కానివాని రచన మదురు మీఁది చికిలింత. అది తత్కాలమం దొక్కమాఱు పామరజనరంజక మైతే కావచ్చును గాని, ఒక్క మట్టె మధ్యాహ్నముతో దాని యేపు సరి. ఉభయ భాషలలోని పెక్కు గ్రంథములు చదువుట, ఉభయ కవిమిత్రు లగు పెద్దలతోడి సహవాసము, లోకజ్ఞత, గుణదోష విమర్శకత, సౌశీల్యముతోడి రసికత మొదలగు సుగుణములు కలవాఁడు కావ్యరచన కధికారి. తన్నుఁ దా మఱచి కావ్యములో నైక్య మందినవాఁడే కవి. నిష్కామబుద్ధితోడి యాత్మధ్యాన మెట్టిదో నిరహంకారముతోడి కవితోపాసన మట్టిది. అధికారము కొఱఁతవడినా, అహమిక విజృంభించినా, అట్టివాని కావ్యము పుబ్బలో పుట్టి మఖలో మాడినదే. అట్టి దాని కిదే లక్షణము:

"కోవిదగ్రంథపరిచితి గుండుసున్న
వస్తుపాత్ర రసజ్ఞత బండిసున్న
నిరతమూహాంకృతిస్థితి నిండుసున్న
యైన కవికర్మ హళ్లికి హళ్లి సుమ్మ!"

కావున బుద్ధిశాలియగువాఁ డధికార మార్జించి, యహంకారదూరుఁడై, వాగ్దేవతను తన్మయుఁడై యుపాసించి కవికీర్తి గాంచుఁగాక.



# మిత్రుని మృతి

## = శ్రీ 'సహజానంద' =

"ప్రార్ణమి!

యౌవనమునకు మదిర!

వయసు తెటులు తొలగించి, తుపానుల రేగ గొట్టును.

ఆరాత్రి సముద్రమం దెంత కోలాహలము!

అలలలలో ఎంత రొద!

ప్రాణమం దెంతటి మధురఘోష!

ఏమి యా జ్వాలానృత్యము !

యౌవనము చిగిర్చిన చోట ఎన్ని కోకిలలు విసుగులేక గొంతుక కోసుకొనునది!

ఎంత ప్రచండశక్తి—ఈయౌవనము!

దీని విజృంభణముందు జనులు పాదధూళి!

దీని తృష్ణముందు సింహాసనములు పిల్లికూనలు!

దీని పరవశములో అద్వితీయమైన దేదీప్య సౌందర్యము పంజరములో చిలక!

ఆకాశమందు చూడుము—మబ్బులు మాత్సర్యము క్రమ్మి నలుపెక్కను. దీపము లారి, చీకటి వ్యాపించును. తుళ్లిపడి, తుపానులు లేచి, సృష్టి యొక్క తూకటివేళ్ల పెకలింపబడైన చూచును. మృత్యువు చీకటిగుహలందు గర్జించు గర్జనలకు రోదసి అదటి నేలపై పడునా అని తోచును.

తరువాత......శాంతి!

కాని...

ఎంత వినాశనము?

ఎంత ప్రాణనష్టము!

ఎన్ని ఓడలు సముద్రపుఒడిలో ఒదిగిపోయినవి!

ఎన్ని భవంతులు ఎంత మందికి గోరీలైనవి!

అనాథప్రకృతియం దెంతటి పౌరుషము ప్రచ్ఛన్నమై యున్నదో!

రాతిని గీటుము!......శతాబ్దముల రక్తతృష్ణతో అగ్నిజిహ్వను చాపును—

వీటితో పోల్చుము—యౌవనమును!

ఎంత పిపాస!

ఎంత ఉద్వేగము!

కన్నులం దెంతటి కామన!

వెలుతురు చొరరాని కీకారణ్యము-యౌవనము.

అహో!

మన్మథుని నృత్యశాల!

వసంతుని ఉద్యానవనము!

ఈదవానలాన్ని చవిచూడని ప్రాణి ఎవరు?

కాని యౌవనమునకు అనాది, అజేయశత్రువు మృత్యువు!

ఈరెండిటి ఘోరసంగ్రామమే మానవచరిత్ర!

మృత్యువుకు ముదుసలు లన్న మరిపి!"

మిత్రుడు తన ఆవేశాన్ని ఆపాడు. తీవ్రమై, తీక్షణమైన వ్యాధి దాపరించినపుడు జీవుని అంతరాత్మ మేలుకొని, తన ఆకృతిని విమర్శించుకొనును. దేహము యొక్క శక్తి సన్నగిలునపుడు, మత్తు వదలి మనసు విచారణమగ్నమవును. ఈజీవి ఏమి? దీని గతి ఏమి?- ఈ కఠోరప్రశ్నల కాళచ్ఛాయలు రోగికన్నుల నావరించును. మిత్రుని ముఖంలో ఈ కొత్త ఆందోళన

నన్ను చాల కంగారుపఱచినది. ఆతురతతో చెప్పాను: "ఈ ఆలోచన మంచిది కాదు." అని.

"ఆలోచన! మంచిమాట చెప్పావు? ఈ ఆలోచనవెనుక ఎట్టి ప్రచండదవానల మున్నదో నీకు తెలియదు. మృత్యువు నీ..."

వినలేక, గట్టిగా అన్నాను:

"నీకు మతిపోతోంది. ఈ వెఱ్ఱి ఊహాలతో. మనస్సు మార్చుకో".

"అవును. మృత్యువు నీ గడపవద్ద గంటమోగించినప్పుడైనా నీ అంతర్యము నీవు తెలుసుకోవద్దూ? అదిగో...అప్పుడే నాపై మృత్యువునీడలు కమ్ముతున్నయ్...ఓ ...(భార్య నుద్దేశించి) దుఃఖించి, ప్రయోజనం లేదు. శతాబ్దాలుగా సృష్టి అనుభవిస్తున్న ఈ శాపభరం ఇవ్వాళ నువ్వూ, నేనూ తప్పించు

అతని భార్య అతనికంటె ఎక్కువ బాధపడుతోంది. ఆమెహృదయంలో ఎంత చిచ్చు రగులుతోందో నే చెప్పలేను.

చంటిపిల్ల ఉయ్యాలలో నిద్రపోతోంది.

మఱల మిత్రుడారంభించెను:

"నీకు తెలియును నాప్రకృతి. రెండురోజులకితం కృష్ణానదిఒడ్డుకు వెళ్లాను. సూర్యుడింకా చీకట్లో మునిగిపోలేదు. దూరాన శివాలయంలో ఎవడో శంఖం పూరించాడు. ఎవ్వరో నలుగురు వచ్చి చితిని పేరుస్తున్నారు. కాసేపటికి ఒక పాడె... జనం...

ఇందులో విశేషము లేదు. కాని?

ఆ చితి!

చీకటిపడుచున్నది.

కాని శవమును పీడ రా ఆడవాండ్రు!

ఏమిది?

ఇది విచిత్రముకాదా?

ఘోరమైన రుద్రభూమిలో ఈ దృశ్య మెవ్వరైన చూచిరా?

విగతమైన జీవము. బొమికెల పటము. ఆ చెల్లెళ్లు, ఆ తల్లి, ఆ తండ్రి...సజీవమైన తమ బిడ్డను నదిలోనికి విసరుచున్నట్టు; ఏమి ఆ రోదనము!

మృత్యువం దెంతటి సంక్షోభ!

శూన్యమం దెంత భ్రాంతి!

ఆకృతియం దెంత మక్కువ!

పురాణములందుకూడ ఈశ్మశానదృశ్యము కానరాదు.

నా కాళ్లు వణకినవి!

చితి నిప్పంటుకొన్నది!

నెత్తురు చిమ్మినట్లు!

దగ్గఱకు పోయి తెలిసికొంటిని. ఈ వ్యూరువారు కారనియు, కార్యార్థమై వచ్చిన తమ కొడుకు హఠాత్తుగా గుండె ఆగి, ఇక్కడ మరణించెననియు."

మిత్రుడు నాకేసి చూశాడు. అతని చూపుయొక్క తీక్షణతముందు నేను మూగనైతిని.

"అవును. ఇందులో విశేష మేమున్నది? ఈ సంఘటనలో ఏమి విచిత్రమున్నది?

అదే! మృత్యువుయొక్క నీడలోగాని మనిషి నిజాన్ని తెలుసుకోలేడు.

చూడు! ఆ తల్లి తండ్రులకు ఒకే ఒక కొడుకు అతడు. పాతికేళ్లు వచ్చి, పరీక్షలు ప్యాసయి, చేతికి అక్కఱకువస్తాడుగదా అని అనుకొనే సమయంలో, మృత్యువాతపడ్డాడు. నలుగురు చెల్లెళ్లు! 'శిలలు ద్రవించేట్టు ఏడ్చారు! ఏమైనది అతని కథ! ఎవడనుకున్నాడు ఇలా జరుగుతుందని! ఆ తల్లి గుండె దేహంలో గుప్పెడు బూడిదై, గిలగిల తన్నుకుంటోంది! తండ్రి! కట్టుకట్టిన గాయం! ఆ ఇల్లు!

ఇక ఆలోచించు మనుష్యుని ఐశ్వర్యము, అభివృద్ధి! మృత్యువును ముఖాముఖీగా కలుసుకోటానికి ధైర్యం లేకపోతే, చాటునైనా దాని కాటు తినక

తప్పదు. మన ఈ వ్యర్థకాలయాపన, కాలక్షేపం—మనవెనుక మృత్యువును పెట్టుకునే!

కాని అతడు పెళ్లిచేసుకోలేదట...అందఱకు ఆ అదృష్టం ఉంటుందా?"

మిత్రుడు సొమ్మసిలి కళ్లు మూశాడు. వంటిపై చెయ్యివేశాను. చల్లగా ఉంది. దీపపు వెలుతురులో ఆమెకుంకుమ నెత్తురుదివ్వెవలె కనబడుతోంది. నాకు శక్తి నశించింది. ఈఘటనలో ప్రళయగంట మోగినట్లున్నది. చూస్తూవుండగా చెఱువుమెట్లపై నుండి జారి పిల్లవాడు నీళ్లలో మునిగి పోవుచున్నట్లు!

నాకేమీ తోచలేదు. వైద్యులకు ప్రాణమన్న-అవయవముల ఆటుపోటని!

మిత్రుని ముఖం భయంకరంగా ఉంది.

ఇంటిలో పెద్దవాళ్లులేరు.

మర్నాడు...

జ్వరం...తగ్గలేదు. వైద్యుడింటిలో కంగారు మాటలు చెప్పిపోయెను. నే వెళ్లేప్పటికి చంటిపిల్ల కాళ్లువిరిగిన స్వరంతో ఆడుకుంటోంది! ఆ చంటి ముఖాన పట్టరాని సంతోషము! మిత్రుని ముఖంలో అగ్నిహోమం!

"నే చెప్పలేదూ! మృత్యువు గంట మోగించిందని. నీ, నా మైత్రి కిక ముగింపిది. ఈ నాలుగేళ్ల మన స్నేహంలో పూర్ణసంతోషాన్ని అనుభవించాను. నువ్వెవడవు? నేనెవడిని? నీ కీసంబంధ మేమిటి? ఇది మన మనోజీవితము. నీ కాశ్చర్యం వేయవచ్చు—నావైఖరి చూసి! కాని నాకు పిఱికలేదు. మృత్యువుకు నే ఏడ్పులతో, పెడబొబ్బలతో స్వాగతం చేయ దలచుకోలేదు...కాని..."

మిత్రుని కళ్లలో నీళ్లూరినయ్.

ఇది దారుణపరీక్ష!

"ఈ ఇల్లు....నేను....నాభార్య...పిల్ల....నువ్వున్నావు—ఇలాంటి సౌఖ్యము ఎంతమంది కున్నదని. కాని ఈనాడు..."

మిత్రుని స్వరం గాద్గదికమైంది.

కాని ఈనాడు?

ఇది దారుణ ప్రశ్న!

ఈప్రశ్నబాణం నామనస్సును గాయపఱచింది.

"ఈ జీవితమున కర్థమేమి? ఈ తల్లి బిడ్డల గతి యేమి? ఇది అని, అది అని చెప్పు మార్గులు పెక్కుమంది. ఈ దాంపత్య మేమి? కొలదికాలపు సాంగత్య వినాశనంలో ఇంత దారుణబాధ ఏమి? నాకు తెలుసు...నాభార్య వేదన మరణవేదనకన్న హెచ్చు! నీవంటివి—"నీ జీవితము ధన్యమైన"దని. కాని ప్రాణుల మధ్య ఈ బంధనముల రహస్య మేమి? ఎడబాటులో ఇట్టి కఠోరసంక్షోభ ఏల?...నా ఈ అభాగ్య జీవితంతో ఎంత దారుణ విషాదగాథ వ్రాసిపోతున్నాను-నావెనుక!"

నేను మాటలాడు స్థయిర్యము తప్పినది.మృత్యు ప్రేరితమైన మిత్రుని ఈ ఝంఝూమారుతము ముందు నేను గడ్డిపోచను.

నాలుగవరోజు సూర్యునితోపాటు మిత్రుడు అస్తమించాడు! ఆ వినిర్మలముఖంలో జీవితపు తుది తేజస్సు ఉద్దీప్తమై ఉంది. సుపరిచితమైన ఆ ముఖంలో కాలం ఒక్కసారి గిఱ్ఱునతిరిగినట్లుతోచింది.

కాలం!

మనుష్యుని కన్నీటి కావేరి!

శరచ్చంద్రఛటోపాధ్యాయ ఇలా వ్రాశారు: "పోతూ పోతూ పాంథుడు వండుకొన్న కుండలను పగలకొట్టిపోతాడు" అని. ఇది అందఱు పాంథుల విషయంలోనూ వర్తిస్తుంది!

అహరహస్సు; అనుక్షణం; ప్రతిచోట; ప్రతి కార్యకలాపంలో అదృశ్యంగా దృశ్యమయ్యే నా మిత్రుడు 'సోక్రటీస్'ని జ్ఞప్తికి తెస్తాడు!

ఉత్తేజితమైన ఓ జిజ్ఞాసువా! నీ ఆత్మకు అమర శాంతి.

నీ వలన స్వర్గమున కెంత శోభ!!

# "మేగ్నా కార్టా!"

□

= శ్రీ బాలగంగాధర తిలక్ =

మేం మనుష్యులం
మేం మహాస్నులం
గుండెలోపలి గుండె కదలించి
తీగలోపలి తీగ సవరించి
పాటపాటకి లేచు కెరటంలాగ
మాటమాటకి మ్రోగు కిన్నరలాగ
మేం ఆడుతాం
మేం పాడుతాం.

మేం ఉపాసకులం
మేం పిపాసువులం
భూమిఅంచుల వెలుగుతెర కట్టి
తారకల గతి కొక్క శ్రుతిపెట్టి
పాటపాటకి వెండిదారంలాగ
మాటమాటకి మండు దూరంలాగ
మేం సాగుతాం
మేం రేగుతాం.

మేం నవీనులం
మేం భావకులం
పాతలోకంగుండెలో శతఘ్ని పగిలించి
భావికాలం చంద్రకాంతపుశిలల కరగించి
పాటపాటకి పోకు స్వర్గంలాగ
మాటమాటకి దూకు సింహంలాగ
మేం నిలుస్తాం
మేం పిలుస్తాం.

మేం మనుష్యులం
మేం మహాస్నులం
మాకు దాస్యం లేదు
మాకు శాస్త్రం లేదు
మాకు లోకం ఒక గీటురాయి
మాకు కరుణ చిగురుతురాయి.

* * *

మేం పరపీడన సహించం
మేం దివ్యత్వం నటించం
గాలిగుర్రపు జూలు విదలించి
పూలవర్షం భువిని కురిపించి
పాటపాటకి పొంగు మున్నీరులా
మాటమాటకి జారు కన్నీరులా
మేం ఆడుతాం
మేం పాడుతాం.



## — రాయలనాటి చిత్రకళా ప్రశస్తి —

### లేపాక్షి దేవాలయము లోకప్పులోనున్న కొన్ని వర్ణచిత్రములు

(Courtesy : Archæological Survey of India.)



1. దేవర్షి భక్తగణపరివృతుడైన శ్రీ హరిహరనాథుడు







3. కాలభైరవస్వామి. 4. తనబిడ్డ రాకుమారుని రథచక్రముల క్రిందబడి నలిగిపోగా

# చూళిక

## శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి

చూళికఅంటే యేమిటో కొంచెం వ్యాఖ్యానించవలసిన ప్రసక్తి కలిగి వ్యాఖ్యానిస్తూన్నాను. యెందుకు ప్రసక్తి కలిగిందో వివరించడం ప్రస్తుతం కాదు. యెవరో (జిజ్ఞాసా తాత్పర్యంతోనే అనుకోవాలి) ప్రశ్నిస్తారు. వారికిమాత్రమే చెపితే అంతే-ఆయొక్కరికి తెలియడమే కాని అంతకంటే అధికసంఖ్యాకులకు తెలియదు. పత్రికాముఖాన్ని ప్రకటిస్తే పదిమందికీ తెలుస్తుందని వ్యాసరూపంగా ప్రకటిస్తూన్నాను. ఆయీపదము నాటకసంప్రదాయజ్ఞులకు సులభంగా తెలిసేదే.

విష్కంభం, ప్రవేశకం, అంకాస్యం ఆయీ పదాలకు చూళిక సహోదరి. వాట్లవల్ల నాటకానికి జరిగే ప్రయోజనం యేలాటిదో (వృత్త వర్తిష్యమాణ కథాసూచనన్నమాట) దీనివల్లకూడా అలాటిప్రయోజనమే కలుగుతుంది. ఆయీ చూళిక సర్వమూ పండితరాయల కవిత్వంలాగ అన్యాపదేశంగా వుంటుంది. తెలుఁగులో స్వతంత్రించి రచించిన నాటకాలే లేవు. యేకొంచెమో వున్నప్పటికీ అవి "రంగాలూ మోర్మెసులూ"గా వుంటాయి గాని ప్రాచీనసంప్రదాయంగా వుండవు. అందుచేత పూర్వసంప్రదాయాన్ని అంతో యింతో అనుసరిస్తూ వ్రాసిన మాపాండవవిజయంలోనుంచే దీనికి వుదాహరణం చూపవలసి వచ్చింది. తుట్టతుది అంకంలో కాఁబోలు (పుస్తకం దగ్గిఱ లేదు. అందుచే పాఠభేదంకూడా రావచ్చు. ప్రధానాంశం చూచుకోఁగోరుతాను) ఆయీ పద్యం వుంటుంది—

"ఆఱనిలోఁతు నీటికొల
నక్కడఁ బూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి
రేకులు తొంబదితొమ్మి దిప్పుడా
నీరజమందుఁ దా మిగులు
నే? యొకరేకటు లయ్యెనే నలం
కారముఁ బోనె! యాకొలను
గాని సరోజము గాని భూమికిన్."

ఆయీ పద్యం యావత్తూ చూళికకు వుదాహరణం. చూళికకు లక్షణం తెరలో నున్న పాత్రలచే కథాసూచన(అన్యాపదేశంగా)చేయుట. ఆయీ వాక్యం సంజయునిది. అప్పటికి దుర్యోధనుఁ డొక్కఁడు వినాగా ధృతరాష్ట్రపుత్త్రు లందఱూన్నూ వీరస్వర్గాన్ని అలంకరించారు.

"పలపలని మూఁకలోఁ గాల్
నిలువక గుఱ్ఱుగుమ్మ డిగ్గి నీకొడుకు గదా
కలితభుజుఁ డౌచు నొక్కఁడు
తొలఁగి చనియె నేమి సెప్పుదుం గురునాథా."

అట్టిస్థితిలో వుంది కౌరవపక్షం. అప్పుడు పైవిధంగా విలపించాఁడు పాపం సంజయుఁడు. దీనికి వ్యాఖ్యానం అవసరం లేదు. ఇది తి. వెం. కవుల కవిత్వం. ఆబాలగోపాలమూ అక్షరాస్యులందఱికీ తెలిసేదే. అయినా దీనిలో కొందఱు విద్వాంసులూ, కవులూ యేవో శంకలూ, సమాధానాలూ ముచ్చటించుకొంటూ వుండఁగా విన్నానని శ్రీయుతులు పిరాట్ల సత్యనారాయణగారు చెపుతూ "అయ్యా! యీ పద్యంలో 'ఆఱని' అనే విశేషణం యెందుకండీ" అని ప్రశ్నించేటప్పటికి నాకు ఆశ్చర్యం కలిగింది. యెందుచేతంటారా? ఈ సత్యనారాయణగారి తెలుఁగుసాహిత్యం అల్లాటప్పా సాహిత్యం కాదు. ఈయనకు భారతభాగవతరామాయణాదులలో వుండే ముఖ్యఘట్టాలే కాదు, మనువసుచరిత్రలలో ఘట్టాలే కాదు అన్నీ

కంఠోపాఠం. మా పద్యాలేకాదు, వచనాలుకూడా యీయన తూ-చా తప్పకుండా వొప్పచెపుతారు. యిందులో అత్యుక్తి లేదు. కవిత్రయకృతభారతం అలా వుండఁగా, జంగంకథగా యెవరో మహాకవి వ్రాసిన భారతం (విరాటపర్వం మాత్రమే) యీయన ముఖతః నేను విన్నాను. యీయనధారణాశక్తికి నేను ఆశ్చర్యపడ్డాను. యీయనకు యిప్పుడు జంగంకథగా పాడే బొబ్బిలికథ గాక వేఱొక జంగంకథగా పాడే బొబ్బిలికథ కంఠతః వచ్చును. నేను విన్నాను. కొన్ని విశేషాంశాలు ఆయీ కథలో గోచరించాయి. యే మాత్రం రసంగా వున్న కవిత్వమేనా సరే యీయనకు నోటికి వచ్చి తీరుతుంది. "యత్ర యత్ర రసవత్త్వమ్" అని వ్యాప్తి కూర్చడానికి యీయన పనికి వస్తారు. పూర్వగ్రంథాలలో చాలా భాగం యీలాటి రసజ్ఞుల మూలంగానే నిల్చివున్నా యనుకోవచ్చును.

"...లోకులరసనలె
ఆ కులుగా నందునట్టియవి వో కవితల్"

"..నీరసపుఁగావ్యశవముల
దూరమునన పరిహరింపుదురు నీతిజ్ఞుల్" (కవికర్ణ)

అన్న సంకుసాల మహాకవి వ్యర్థవచస్కుఁడు కాఁడు. తత్తథాస్తామ్.

ఆయీ సత్యనారాయణగారు యింతటి నీరసపుశంక చేస్తే ఆశ్చర్యం నాకే కాదు-యెవరికేనా కలిగి తీరవలసిందే. తర్వాత నేను "అయ్యా! యీ 'ఆఱని' విశేషణం వ్యర్థంగా ప్రాసకోసం పడ్డది కాదు. యిక్కడ యీ కొలనుపదంవల్ల గ్రహించతగ్గది కౌరవవంశం. ఆయీ వంశం ధృతరాష్ట్రపుత్త్రులతో అంతరించక పాండవులద్వారా చిరకాలం నిల్చివుండడాన్ని సూచిస్తూ ఆ విశేషణం వాడఁబడింది. (సంభవవ్యభిచారాభ్యాం స్యా ద్విశేషణ మర్థవత్)" అని నా హృదయాన్ని వ్యాకరించాను. అప్పుడు ఆయన యీశంక స్వకపోలకల్పితం కాదనిన్నీ, తనకన్న విశేషజ్ఞులు చేస్తూవుండఁగా విని మిమ్మల్ని అడిగినాననిన్నీ చెప్పినారు. అలాగైతే మన జీవితకాలంలో మన అభిప్రాయాన్ని వెల్లడించడం యుక్తంగా వుంటుందని యీ కొస్తా వ్రాశాను. "జీవతః కవేః ప్రష్టవ్యమ్."

ఆయీ చూళికాపద్యంవంటి పద్యం ఆ పాండవవిజయంలోనే కాదు—మా భారతనాటకాలలోనే లేదేమో? ఆయీ పద్యమే వ్యర్థపదఘాయిష్ఠ మయే యెడల యిఁక అందులో ఆఁగే పద్యమే వుండదు. అయినా కవికి వున్న అధికారం యెంతవఱకంటారు? యేదో తోఁచింది వ్రాసేటంతవఱకే. ("రసారసవిచారము మాయది కాదు" చూ) తక్కిన యావత్తు బాధ్యతా రసజ్ఞులో కానిదే. అందుచేతనే "సహృదయాః ప్రమాణమ్" అంటారు వ్రాసి వ్రాసి కావ్యవ్యాఖ్యాతలు; సహృదయ శబ్దానికి సామాన్యంగా అయే అర్థం హృదయం కలవారు అని మాత్రమే. కొస్త శాస్త్రసాహిత్యం కలవారికి అయే అర్థం "ప్రశస్తమైన (నిర్దుష్టమైన) హృదయం కలవారు" అనేది. ('భూమనిందాప్రశంసాసు' చూ) అలాగే కాకపోతే లోకంలో హృదయం వుండడం సమస్తప్రాణిసామాన్యం కదా? శాస్త్రజ్ఞత లేనివారికి "నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ, పంచ స్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే" అన్న శ్లోకం సరిగా సమన్వయిస్తుందా! తత్తథాస్తామ్.

"ఊరుమతీ కన్యా" వగయిరా ప్రయోగాలన్నీ యిట్టివే.

లోకంలో పాండిత్యం వున్నచోట సర్వత్రా సహృదయత్వం వుండదు. సహృదయత్వ పాండిత్యాలు భిన్నాధికరణాలు కావనిన్నీ, సహృదయులే పండితులు, పండితులే సహృదయులు అనీ లేని సామానాధికరణ్యాన్ని చెపుతారు గాని అది నాకు రుచింపదు. పక్షపాతాదిదోషరహితమైన హృదయం కలవారై, మంచి సాహిత్యం, అనఁగా "అబ్రవీత్పురాణ"వ్యాకర్తలకుండే సాహిత్యంవంటిది కాని నిశితమైన సాహిత్యం యెవరికి వుంటుందో అట్టివారి యీలోకంలోనే కాదు స్వ గౌరవింపఁబడుతుంది. అంతో యింతో శబ్దశాస్త్ర

ప్రవేశం వుంటేనేకాని వ్యాఖ్యకు అధికారం వుండదు. మచ్చు చూపుతాను.

"న మానినీ సంసహతేఽన్యసంగమమ్" - యిది భట్టికావ్యంలోది. స్త్రీ (తన భర్తకన్నమాట) అన్య సంగమమ్=అన్యపురుషసాంగత్యమును సహించదు అని శాస్త్రసాహిత్యం లేనివారు వ్యాకరిస్తారు. యథాశ్రుతంలో అన్యస్త్రీసాంగత్యమును సహించదు అని అర్థం రావాలి. శాస్త్రసహాయం లేనిదే యేలా వస్తుంది అభిమతార్థం? శాస్త్రం సమగ్రంగా చదివినవారికికూడా "సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః." అన్న వార్తికం సమయానికి జ్ఞప్తికి రావాలి. అప్పుడు అభిమతార్థసిద్ధి కలుగుతుంది. అందుకేకదా ఒక విద్వన్మహాకవి "జనిత్వా కింను స్యాత్కిమపి యది శాస్త్రం నవిజితమ్" అన్నాఁడు. అభియుక్తోక్తి వొకటి యీలాగు వినఁబడుతూ వుంది! "మహాభాష్యంవా పాఠయేత్ మహారాజ్యంవా పాలయేత్" మహారాజ్య పరిపాలన వాపక్షంగా మనపెద్ద లంగీకరించారు. దీనివల్ల మన పూర్వులకు శాస్త్రాధ్యయనమందు యెంతటి అభిమానం వుండేదో వ్యక్తమవుతుంది.

యేదో సహృదయశబ్దాన్ని వ్యాకరిస్తూ ప్రసక్తంగా మఱోపుంతలోకి దిగినట్లుంది. ఆయీసహృదయులమీఁద యెక్కువగా ఆధారపడేది కవిత్వమేకాని యితరం (శాస్త్రం) కాదు. శాస్త్రం వారివారి పాండిత్యాన్నిబట్టి పూర్వపక్షసిద్ధాంతాలు చేసికోవడానికి అవకాశం వుంటుంది. కవిత్వమో? రసవంతమా కాదా అనేవిషయం కేవలమూ సహృదయాధీనం, కొంచెం మచ్చుచూపి చర్చిస్తాను. యెఱ్ఱాప్రగడ—

"ఈలోకము యగుఁ గొందఱ
కాలోకము కొందఱకు నిహంబును బరమున్
మేలగుఁ గొందఱ కధిపా!
యేలోకము లేదునూవెఁ యిలఁ గొందఱకున్"

అంటూ వొక పద్యం రచించాఁడు. యీపద్యం చదువుతున్నప్పుడల్లా నాకు వొళ్లు పులకరిస్తుంది. యిది సంస్కృతభారతంలో వున్నదాన్ని బట్టే రచించాఁడో, లేక స్వకపోలకల్పితంగానే రచించాఁడో! నేనెప్పుడూ పరీక్షించి చూడలేదు. యెందుకు నీకు వొళ్లు పులకరిస్తుందో చెప్పమంటే నేను చెప్పలేను. చెప్పలేక వూరుకోను. వూరుకోక యేంచేస్తానంటే? పైమీఁది బట్ట మెడకు చుట్టుకొని ఆలా ప్రశ్నించే మహనీయులకాళ్లకు "ఉరసా మనసా—ప్రణామోఽష్టాంగ ఉచ్యతే"చేస్తాను. ఆయీ విషయంలో అంతకంటె కర్తవ్యాంలేదు. ముమ్మాటికీ లేదు. యేమన్నాఁడు? దశరూపకంలో "తస్మై నమ స్స్వాదుపరాఙ్ముఖాయ"అనలేదా? నే నుదాహరించిన భారత పద్యంలో యేవిధమైన వ్యంగ్యం గాని, శబ్దాలంకారం గాని, అర్థాలంకారంగాని లేనట్టే నాకు తట్టుతుంది. అయితే యీజగత్తు నాతోటే వుందా యేమిటి? యేదో వ్యంగ్యం దీనిలోకూడా వుందనేవారు బయలుదేరితేనో. అందుకేకదా 'నాకు తట్టుతుంది' అనవలసి వచ్చింది! యీలాటిచోటకూడా వ్యంగ్యాలు తీసి పెద్దపెద్దవుత్తరాలు వ్రాసి సమాధానాలు కోరేవారున్నా బయలుదేరి కోలాహలం చేస్తున్నారు. తేభ్యో మహద్భ్యోనమః. వారి సాహసం వర్ణనీయం.

ఆయీ విషయం-అనఁగా పైభారతపద్యంలో వ్యంగ్యమేదేనా వుందా లేదా అనే విషయం తేల్చవలసివస్తే యెవరికి అధికారం వుంది? 'సహృదయాః ప్రమాణమ్' అనడంకన్న గత్యంతరం లేదు. లేని వ్యంగ్యం వుందనడం యెందుకు ప్రసక్తమవుతుంది అని ప్రశ్నిస్తారేమో? వున్న కుళ్లంతా అక్కడే వుంది. సహృదయమాత్రగోచరమైన యీవిషయంలో యెవరేలాటిపిశివాదం చేసినా చలామణీ అవుతుంది కదా? "కాదన్నవాఁడు కరణం." ప్రమాణములలో నొకప్రమాణం ఆప్తవాక్యం. కాని

"ఆప్తవాక్యంబు విశ్వాస్య మంటివేని
ఆప్తుఁ డెవ్వఁడో? తెలియంగ నలవి యగునె?"
(దేవీ భా. ౪ స్కం)

"ఆప్తస్తు యథార్థవక్తా"
అట్టి యథార్థవక్తలు లోకంలో వుంటారా అని

సంశయించి యీ భారం మనుష్యులమీఁద పెట్టక "వేదాః ప్రమాణమ్" అని, అంతమాత్రంతో సంశయ నివృత్తి కాకపోవడంచేతనే కదా వేదాలకు అపౌరుషేయత్వాన్ని కల్పించవలసి వచ్చింది. యిదంతా దేని మీఁద వచ్చింది? "సహృదయాః ప్రమాణమ్" అనేదాని మీఁద. అక్షరాస్యు లందఱూ సహృదయులు కారు. నిష్కళంకహృదయులైన విద్వాంసులే సహృదయ శబ్దవాచ్యులు. అయితే లోఁగడ చూపిన భారత పద్యం "పక్కా వృక్ష స్తిష్ఠత్యగ్రే" అన్నట్టు (అయ్యవార్ల గారి నట్టిల్లులాగు) వుంది. దీనిలో వ్యంగ్యార్థాన్ని తీయడం కష్టసాధ్యం కాదా? అంటే వినండి.— అబద్ధానికి అర్థమేమిటి? సహృదయైకగమ్యం కదా యీ "అస్తినా స్తినిచికిత్స". అందుచేత ఆత్మవంచనకు వెఱవకపోతే యిష్టం వచ్చినట్లల్లా వాదింపవచ్చు. (సుఖ మస్తీతి వక్తవ్యం. అథాతో బ్రహ్మజిజ్ఞాసా. నీయమ్మ జిజ్ఞాసా. సా... సా... సా...) కొందఱు "అందులో యేదోవుంది కాఁబోలును. లేకపోతే ఆయన అలా అంటాఁగా" అనుకొనేవారున్నూ వుంటారు. అందుచేతనే "కో వేత్తి కవితాతత్త్వ మీశ్వరో వేత్తివా నవా" అనవలసి వచ్చింది. ఆ యీ విషయం వాదంవల్ల తేలదు. ఈ లోకంలోనే తేలదనికూడా చెప్పడం సాహసం కాదు. కొన్ని వ్యంగ్యాలు గ్రంథకర్తకు అభిప్రేతములు కాకుండా స్ఫురించేవిన్నీ వుంటాయి. మచ్చు చూపుతాను—

"సోమయాజుల మార్గంబు సొంపు గనక
పిన్న పెద్దల మర్యాద పేరుకొనక
భట్టరీతిని వాపోవునట్టి కట్టి
కాకవులు కాకవులు నొక్కకడుపువారె."
(శ్రవణా)

యిందులో శబ్దశక్తిమూలకమైన ధ్వనివల్ల తిక్కన, పినవీరభద్రుఁడు (పిల్లలమఱ్ఱి), పెద్దన్న వీరు స్ఫురిస్తున్నారు. ఆ పద్ధతిని భట్టుపదమువల్ల వసుచరిత్ర కర్త కాఁడని నేను యెంతగా ప్రమాణం చేసి చెప్పినా ప్రయోజనం లేదు. నిజానికి నాకు భట్టుమూర్తికి ఆదెబ్బ తగలడం స్వప్నేపి యిష్టం లేదు. ఆ పదం వేయని పద్ధతిని ఆ పద్యం సరసంగా పూర్తి కాదు. పోనీ, పద్యమే మానుకోరాదా—యీ పూజ్యపూజావ్యతిక్రమం యెందు కంటే: మా ముత్తాతగారు (పెద్దవీరభద్రుఁడై పేరు చెందినవాఁడు పిన్నముత్తాత నర్సన్నగారు) కాకవులను గూర్చి వ్రాస్తూ "కాకవులు, ఘూకవులు (గుడ్లగూబలు) నొక్క గూటివారే" అన్నారు. ఆ పద్యంమాదిరిపద్యం చెప్పాలని చిన్ననాటినుంచీ నాకు కుతూహలం. అసలే మానితే ఆ వుబలాటం తీరడం యెట్లా? అందుకోసం యీ పాపానికి వొప్పుకోవలసి వచ్చింది. నాకు పెద్దన్నగారి మనుచరిత్రమీఁదకంటె భట్టుగారి వసుచరిత్రమీఁదనే (యిప్పుడు కాదు, ఆ వయస్సులో. యిటీవల మాఱింది అభిప్రాయం) పక్షం జాస్తి. అట్టి స్థితిలో ఆత్మాభిప్రాయవిరుద్ధంగా అలా యెందుకు వ్రాస్తా నంటాను.

చెప్పొచ్చేదేమంటే? స్ఫుటంగా దుర్వాసన గాని, సువాసనగాని కొడుతూవున్నప్పుడు అన్యథా అపలపిస్తే (అది నిజమైనా సరే) దాఁగదు. "నహి కస్తూరికామోద శ్శపథేన నివర్తతే"

యేదో చాలా దూరం వచ్చాం. వ్యంగ్యానికేనా తోవా తెన్నూ వుండాలి. అంతే కాని గుడ్డెద్దు జొన్నచేను మాదిరి వీలు పడదు. "అస్తమేతి గభస్తిమాన్" ఆయీవాక్యం వాళ్లవాళ్లమనస్సుకు, వృత్తికి, శీలానికి అనుగుణంగా యెన్నో సందర్భాలను స్ఫురించేటట్టు చేసిందంటే అది సహృదయు లామోదిస్తారు గాని "మహదైశ్వర్యాభివృద్ధిరస్తు. అష్టపుత్ర బహుధనమస్తు. దీర్ఘాయుష్యమస్తు"అని ఆశీర్వదిస్తే "యీ ఆశీర్వచనంలో యిదివఱకు ఆయీ సంపత్తులు లేవు కనక యివి క్రొత్తగా కలగాలని ఆశీర్వదించినట్లయింది" అని వ్యంగ్యం తీసే బుద్ధిమంతు లున్నారని నే నెఱుఁగను. కాని యిటీవల అట్టివారున్నట్లు గోచరించింది. యిది కాలం చేసిన సాయం. "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృ

భవతు. ప్రకృతమనుసరామః. సహృదయులను సుఖింపచేసేదీ, వ్యంగ్యాన్ని సుఖించేదీ యెంతో చెమో ప్రసక్తానుప్రసక్తంగా ముచ్చటించినట్లయింది విశేషణం అంటే యేమిటో, దాన్ని కవిత్వంలో యేవిధంగా వ్యాఖ్యాతలు పాటించాలో, శాస్త్రంలో యేవిధంగా పాటించాలో కొంచెం వివరిస్తే "తుఱినిలోతు నీటి కొలను" అనే పద్యంలో వున్న "తుఱిని" అనే విశేషణం యెందుకు అనే ప్రశ్నకు సమాధానం యిచ్చినట్లవుతుంది. వ్యాకరణసూత్రాలలో వుండే తు - చ వగయిరాలకుకూడా సార్థక్యం చెప్పితీరాలి. తార్కికుల అనుగమాలకుకూడా డిట్టో. మీమాంసశాస్త్రంలో తౌతాతికమతం అంటూ వొకమతమే బయలుదేటినట్టు ఆశాస్త్రజ్ఞులవల్ల విన్నాను. ఆమతం 'తు'అనే అవ్యయానికి ఒకానొక బుద్ధిమంతుడైన చక్కని సమన్వయం కనపఱచి చూపేటప్పటికి గురువుగారు సంతోషించి ఆశిష్యుణ్ణి 'తుతాత' అని సంబోధిస్తూ వచ్చారనీన్నీ, పిమ్మట అతఁడు యేర్పఱచిన సిద్ధాంతాన్ని తౌతాతికమతంఅని వ్యవహరించడం కలిగిందనీన్నీ గురువులద్వారాగా వినడం. శాస్త్రంలో సమన్వయించినంత నిక్కచ్చిగా విశేషణాలకు సార్థక్యం చెప్పవలసిందని నిర్బంధిస్తే చెప్పనూలేఁడు; చెప్పవలసినదిన్నీ లేదు. "పుష్కాణాం పరిపీడనం నసహతే శాస్త్రేషు ఖిన్నాత్మనామ్." అన్నారు కాళిదాసుగారు. శ్రీనాథుఁడు "విద్వాంసుల్ రాజమహేంద్రపట్టణ యినఙ్ ధర్మాసనంబుండి ప్రధ్వంసాభావము ప్రాగభావమనుచుఙ్ దర్కింతురు" అని గేలిచేశాఁడు. యెవరో వొకమహాకవి "వయం వకుళమంజరీ గళదరీణ మాధ్వీఝురీ ధురీణ శుభగీతిభిః ఘటితిభిః ప్రమోదామహే" అన్నాఁడు. వాసవదత్తలో "సత్కవికావ్యబంధఇవ అనవబద్ధ తుహినః." అంటూ గ్రీష్మఋతువును వర్ణిస్తూ తు + హి + న ఇత్యాది పాదపూరణమాత్ర ప్రయోజకములు సత్కవుల కవిత్వాలలో దొరలవని సూచించాఁడు. అది శ్లేషలో వాడిన వాక్యం. దానిని అంత నిక్కచ్చిగా పాటించడం యుక్తిసహం కాదు.

"శాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామజఘనాయ దిగంబరాయ
శార్దూల దివ్యనఖభూషణ భూషితాయ
నందాత్మజాయ నవనీతముషే నమస్తే"

ఆయీ శ్లోకంలో శార్దూలపదానికీ, నఖపదానికీ మధ్య "దివ్య" అనేది పాదపూరణానికేనా, లేక ఆవశ్యకమా ? అంటే ఛందోవాఙ్మయంలో ఆమాత్రం సహ్య మనేదే సరసమైన జవాబు. పెద్దపులిగోళ్లల్లో కొన్ని చెడ్డవిన్నీ వుంటాయి కనుక తన్నివృత్త్యర్థం అనిన్నీ చెప్పేవా రుంటారు. కాని వారు చేదస్తులలోనివారు—అతిసాహసులు.

"స్వాధీనో రసనాంచలః పరిచితాః
శబ్దాఃకియంతఃక్వచిత్
క్షోణీంద్రోనినియామకః పరిషద
శ్శాంతాస్స్వతంత్రంజగత్,
తద్యూయంకవయోవయం వయమితి
ప్రస్తావనాహుంకృతి
స్వచ్ఛందంప్రతిసద్మగర్జత వయం
మౌనవ్రతాలంబినః"

'శార్దూలనఖభూషణ' అంటే నఖపదం మంచిదానికీ, చెడ్డదానికీకూడా సామాన్యంగా వాచకమైనా భూషణానికి వుపయోగించుకొనేది, అందులో శ్రీ కృష్ణమూర్తివంటివానికి వుపయోగించుకొనేది చెడ్డదేల కావలెను కనుక విశేషణం అంతగా ఆవశ్యకం కాదు. యింకా దీనిలో చేస్తే పిచ్చిశంకలు కొన్ని చేయవచ్చు. రసజ్ఞులు చేయరు. శుష్కపండితులు చేస్తారు. తేభ్యో మహద్భ్యో నమః.

"సంభవవ్యభిచారాభ్యాం స్యా ద్విశేషణ మర్థవత్"—ఆ యీ శ్లోకార్థం వాల్మీకికి తెలియదా ? తెలిస్తే "తంతు దేశం నపశ్యామి యత్ర భ్రాతా సహోదరః" అంటాఁడే ? రాముఁడూ, లక్ష్మణుఁడూ ఏకోదరులేనా? కవితాసమన్వయం వేఱు; శాస్త్రసమన్వయం వేఱు. యింతతో దీన్ని ఆఁపుతాను.

మా పాండవవిజయంలోని 'ఆఱనిలోఁతు' విశేషణం శాస్త్రాలలో విశేషణాలమాదిరిగా సమన్వయించినా బీరువోదు. యెంత లోఁతైన కొలనైనా యే ద్వాదశవర్షక్షామమో తటస్థిస్తే ఆఱి (యెండి) పోవచ్చును. ఇది అప్పుడుకూడా యెండదన్నమాట. ఆ యీ పద్యం చూళికకు వుదాహరణం అని లోఁగడనే వ్రాశాను. మఱికొన్ని సందర్భాలు జిజ్ఞాసువుల కుపకరిస్తాయని వ్రాశాను గాని లేకపోతే యింత వ్రాయనవసరం లేదు. యావత్తూ అన్యాపదేశం. యీ నీరజం కుశేశయమ్. 'సహస్రపత్రం కమలం శతపత్రం కుశేశయం'. దుర్యోధనాదులు నూర్గురూ నూఱురేకులు. అప్పటికి దుర్యోధనుఁడే మిగులు. తక్కినది 'సున్నకు సున్న హళ్లికి హళ్లి.' ఇంతతో అఁపుతాను. 'నచ శంకా నచో'






సబ్బు వాడుటలో క్లుప్తం:
నురుగుతీసి రుద్దుకో—అంతేగాని
సబ్బుతో శరీరంపై ఆరగతియ్యకు.
సబ్బు పెట్టెను పొడిగా వుంచుము.

## అతిమృదువైనది!

దీని లావణ్యమైన నురుగు చర్మమునకు చాలా మెత్తదనం యిస్తుంది. పరిశుభ్రంగా చేసి. పిల్కువలె చర్మాన్ని తయారుచేస్తుంది-చర్మం మోటుగా. పాలిపోయినటు చెయ్యదు.

# మైసూరు శాండల్ సోప్

మైసూరు
ప్రభుత్వం
సరుకు

MSK-13

# వారికివ్వబడే ఆహారమంతయు ఎక్కువ పుష్టికరముగా చెయ్యండి!






మీ పిల్లల ఆహార విషయమై ఆలోచించునప్పుడు అది మిక్కిలి బలము నిచ్చునట్లుచేయుట ఎంత అవసరమో గమనించండి. సామాన్యంగా పిల్లలు ఎంత తింటూ వున్నప్పటికి నీరసంగా వుసూరు మంటూ వుండుట సంభవించు చుండుటచేత, ఆహార పదార్థములు బలము నిచ్చుటలో అనేక విధములుగా వున్నవనే విషయంకూడా జ్ఞాపక ముంచుకోవాలి. ప్రతి ఆహారము కూడా విటమిన్లతోనిండిన డాల్డాతో వండిన యెడల మిక్కిలి పుష్టికరముగా వుండు నన్న విషయంకూడా గమనించ వలసియున్నది. బలము నిచ్చుటలో శ్రేష్టమైనటు వంటిన్ని, ప్రకృతి సిద్ధమై నటువంటిన్ని ఆహార పదార్థములు కలిగి యుండుటచే, ఆహారమును డాల్డాతోవండిన యెడల పిల్లలు నీరసంగాను, బలహీనముగాను వుంటారనే భయమక్కరలేదు. డాల్డా ఆహారమును మంచి రుచికరముగా చేయును — శాకములతో కూడినది.

ప్రతి గృహిణి ఏ ఆహారపదార్థములు శక్తి నిచ్చునవో తెలిసి కొనవలెను. డాల్డా పాకశాస్త్రమను పుస్తకము (ఇంగ్లీషులో అచ్చు వేయబడినది.) 150 ఇండియన్ వివిధ తినుబండారములు తయారుచేయు పద్ధతులతో కూడినది. మిక్కిలి వుపయోగకరమైన విషయములు గలవు. 4 అణాల బిళ్లలు Dept. E110 P.O. Box 353, Bombay, పంపుడు.

**విటమిన్లతోనిండిన డాల్డా బలమునకు.**

HVM. 36-23-40 Tl.

THE HINDUSTAN VANASPATI MANUFACTURING CO., LTD.

# సంగీత సాహిత్యాలు: అక్షరరమ్యత

— శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

సంగీతానికీ, సాహిత్యానికీ స్నేహ మెంత ప్రాచీనమో స్పర్ధగూడా అంతే ప్రాచీనం. ఈ రెండూ మొదటినుంచీ ఒకటి కొకటి ఎంతో సహాయంగానే సంసారం చేస్తూవుండినా, ఒకదాన్ని మరొకటి అడగదొక్కవలెననే పోటీ ఎప్పుడూ మరచినట్లు కానరాదు. దీని ఫలంగా రెండూ తెగ బలిసి స్వాతంత్ర్యానికై ప్రబలమైన ప్రణయకలహం చేసినవి. పరిణామమేమంటే, రెండూ ప్రాయం ముదిరిన అన్నదమ్ములవలె ఆస్తిని పంచుకొని వేరువేరుగా వ్యవహారం జరుపుతూవున్నవి. అప్పుడప్పుడు యథోచితంగా పరస్పరం ఉపకరించవచ్చును. కలసి మెలసి సుఖించనూ వచ్చును. అంతేకాని నిజానికి దానిల్లూ దీనిల్లూ వేరు. సాహిత్యం లేని సంగీతమే, సంగీతం లేని సాహిత్యమే ఇప్పటికి మన కెక్కువ లభిస్తూవున్న[ది]. కావ్యాలు చదివేటప్పుడు అపస్వర సుస్వర చింతగానీ, పాటపాడేటప్పుడు సుశబ్దాపశబ్ద వివక్షగానీ అంతగా ఉండనవసరం లేదని మనమిప్పుడు నేర్చుకుంటున్నాము.

## స్వాతంత్ర్యం వదలితే బదుకే లేదు

ఐతే ఈ రెండూ పుట్టిననాటినుంచీ కూడా పెరిగినవి. కనుక స్వాతంత్ర్యాన్ని పూర్తిగా వదలి బదకడం కష్టం. ఎందుకంటే — చిన్నప్పటినుంచీ భాషను మెట్టుమెట్టుగా మనమందరమూ నేర్చుకుంటూ వున్నాము. కనక సాహిత్యం మనలను సహజంగా, స్వతంత్రంగా, త్వరగా ఆకర్షిస్తుంది. కాని నాదలయ విద్యను అట్లు నేర్పే పద్ధతి మనలో లేదు. కాబట్టి దాని రుచీ, రహస్యమూ చెవిమట్టాన్ని దాటి మనస్సు దాకా దిగవలెనంటే ఏ కొందరో కాని అందరికీ అది సాధ్యం కాదు. కాబట్టే భాషాసాహాయ్యం లేని నాదలయకళారచనలను — అంటే రాగాలాపన, తానం, స్వరకల్పన మొదలైనవాటిని — మనలో సంస్కారపూతులైన గొప్పవారే అర్థంచేసుకొని అనుభవించలేకున్నారు. భాషాదృష్టితోనే సంగీతకళను విమర్శించే మట్టాన్ని దాటినవారు మన దేశంలో ఇప్పుడు చాలమంది లేరు. కాబట్టే, సాహిత్యపు యాజమాన్యం సంగీత సంసారంలో ఇంకా చెల్లవలసే వుంది. చెల్లుతూనే వుంది.

## హద్దులుమీరితే ప్రమాదం పెద్దదవుతుంది

యాజమాన్యమిస్తే చాలు, యజమానుని యిష్టానిష్టాలన్నీ మనమూ నెత్తిన వేసుకోవలసి వస్తుంది. భాషసహాయాన్ని సంగీతం కోరిన వెంటనే వ్యాకరణం, అలంకారాలు, గుణదోషాలు, రసాలూ ఇత్యాది సాహిత్యనియమాలన్నీ సంగీతరచనలోకూడా ప్రవేశించి నిలుస్తుంది. సంగీత గంధం లేని సాహిత్యపండితులందరూ సంగీత విమర్శకు లౌతారు. త్యాగయ్యగారి 'దాశరథే దయాశరథే' అనే కీర్తన విని ఒక గొప్ప సంస్కృత పండితుడు 'ఇదేమయ్యా త్యాగయ్యకు థధల భేదమే తెలిసినట్లు లేదే' అని ఆక్షేపించినాడు. తెలుగు వ్యాకరణాన్ని కంఠపాఠం చేసిన అరవ సంగీత విద్వాంసు డొకడు త్యాగయ్యగారి కృతుల్లో సాధ్యమైన చోట్లలో అంతా వ్యావహారి

* ఆలిండియా రేడియో మద్రాసుకేంద్రమువారి అనుమతితో.

కంగా వున్న పదవాక్యస్వరూపాలను తిద్దివేసినాడు. ఇంక భాషను సరిగా నేర్వని కీర్తనకర్తలు ఈ లాక్షణికుల తృప్తికై పడే పాట్లు చూస్తే అయ్యో పాపమనిపిస్తుంది. పూచి శ్రీనివాసయ్యంగారు 'సద్భక్తిని గల్గజేసి సంతసించి బ్రోవుమయ్యా' అని చక్కని వర్ణమెట్టులో కృతి యెత్తినారు. ఐతే, అనుపల్లవిలో ప్రాసానికి ఇంకొక ద్భకారం సంపాదించడం కష్టమైందాయనకు. మరి ప్రాసాన్ని వదలే ధైర్యమూ లేదు. గనక తమిళ సంప్రదాయంలో ద్భ, త్ప, రెంటికీ రాతలో భేదం లేదు కాబట్టి 'తత్పూర్వము దైత్యేశుని విదళించిన సంతానరామ' అని అతికించి ప్రాసం వచ్చిందనిపించి కృతకృత్యుడైనా డాయన. త్యాగయ్య, దీక్షితులు మొదలైన మహామహులుకూడా ఇటువంటి కష్టాలకు అప్పుడప్పుడు చిక్కి నలిగి సంగీతాన్ని కొంత నలిచినారనే చెప్పవలసివుంది. సాహిత్యంలో వారెంత సమర్థులై వుండినా వారి సంగీతంలో వున్నంత వర్చస్సూ, ప్రతిభా దానిలో కానరాదు. కనక సాహిత్య నియమాలూ, సంకేతాలూ వారిని కొంతైనా కష్టపెట్టక వదలలేదు. కాబట్టి, నాదాభిమానం కల రచయితలు భాషాభిమానాన్ని చాలా హద్దులో వుంచుకోకపోతే మూలద్రవ్యానికే లోపం వచ్చే సంభవం కద్దు. అట్లు హద్దులో ఉంచగలిగిన భాష, సాహిత్యం సంగీతానికి ఎన్నో విధాల సహాయం చేయగలదు. అందులో ముఖ్యమైన ఒక విషయాన్ని మాత్రం గురించి ఇప్పుడు నాల్గుమాటలు మనవి చేస్తాను.

## నన్నయ్యగారి నాణెమైన ఉపదేశం

అదేదంటే, నన్నయ్యగారు సాహిత్యంలో మనకుపదేశించిన అక్షర రమ్యత. సంగీతంలో దీని విలువ అపారం. సంగీతం - అంటే నోటిపాట - అచ్చుల మూలాన బతికే కళ. హల్లులకు స్వతంత్రంగా- అనగా వెనకో ముందో అచ్చులేకపోతే - శబ్దాన్ని వ్యక్తం చేసే సామర్థ్యమే లేదు. ఇక నాదం మాట చెప్పనక్కర్లేదు. మరిన్నీ హల్లుల శబ్దం ఖండంగా వుంటుంది. అఖండనాదాన్ని వ్యక్తపరిచే శక్తి అచ్చులకే వుంది. కనక నాదదృష్టికి హల్లులు ప్రతిబంధక సామగ్రి. అట్లే అచ్చులకున్నూ స్వతంత్రంగా పదాలుగా, వాక్యాలుగా కూడుకొని అర్థాన్నీ, భావాన్నీ వ్యక్తపరిచే శక్తి లేదు. ఒక అచ్చునుంచి ఇంకొక అచ్చుకు దూకవలెనంటే నడుమ హల్లు ఊతలేనిది సాధ్యం గాదు. ఇట్లు ఇవి రెండూ అన్యోన్యాశ్రయాలైనా నాదరచనకు - అంటే సంగీతానికి - అచ్చులున్నూ, శబ్దరచనకు - అంటే భాషకు - హల్లులున్నూ జీవాలని చెప్పవలెను. కాబట్టి, భాషలో అచ్చులకంటే హల్లులమీదనే దృష్టి ఎక్కువగా నిలుపుతాము మనం. అచ్చులను సాధ్యమైనంతా నమలివేస్తావుంటాము. సంగీతంలో వ్యవహారం దీనికి ఎదురు. అచ్చులను పొడిగించుకుంటూ యథాశక్తి హల్లులను నమలవలసి వుంటుంది. మరిన్నీ నాభిలో పుట్టి, కంఠంమూలాన ధారాళంగా వచ్చే అచ్చుల నాదధారను నోటిలో భిన్నభిన్న స్థానాలలో పుట్టే హల్లులు అరికట్టుతాయి. కాబట్టి సంగీతంలో అక్షర రమ్యత అంటే హల్లుల ప్రాజాపత్యం మితంగా వుండే అచ్చుల సామ్రాజ్య మన్నమాట.

మరిన్నీ ఋ, ఌ అనే కృత్రిమాచ్చులను అట్లుండనిచ్చి తక్కినవాటిని గమనించినా మంచే, అచ్చులన్నీ స్వతః రమ్యంగా కానవస్తాయి. నాదాన్ని ఆ, ఈ, ఊ అని యే అచ్చుమూలాన వ్యక్తంచేసినా, దాని వన్నెలో భేదముంటుందే కాని, రమ్యతలో భేదముండదు. హల్లు లట్లా కాదు. పరుషాలు, మహాప్రాణాలు, ఒత్తక్షరాలు, అందులోనూ క్వ, ద్మ, ష్ట్రి వంటి విజాతీయ సంయోగాలూ, ఒకటి తర్వాత ఒకటి కటుతరంగా మనకు తోస్తుంది. కాబట్టి నాదవ్యక్తికి సహాయంగా వచ్చే భాష అసంయుక్త పరుష సరళమయంగా వుంటేనే గానకళ తలయెత్తుకొని మెరుస్తుంది. లేకుంటే ఒదిగి కుంటుతుంది. పై కటువర్ణాలను పూర్తిగా తోసివేసి పాటలు రాయడం ఏ భాషలోనైనా అసాధ్యమే. ఐతే వాటివల్ల పాటకు కలిగే అడ్డంకి మనసుకు అర్థమైతే రాసేటప్పుడు వాటిని ఎంతో హద్దులో పెట్ట గలుగుతాడు కవి.

## ప్రాచీనగీతకవుల ప్రకృష్టసాక్ష్యం

ఈ అక్షరరమ్యతాతత్వాన్ని ప్రాచీనగీతకవులంతా చాలవరకూ మననం చేసినవారే. సంగీతరత్నాకర రాగాధ్యాయంలో ఉదాహరించిన ప్రతిపాటా దీనికి సాక్ష్యమిస్తుంది. మచ్చుకు భిన్నతానరాగ లక్ష్యంగా వున్న ఈ క్రిందిపదం చూడండి :

"హరవరముకుటజటాలలితం
అమరవధూకుచపరిమలితం
బహువిధకుసుమరజోరుణితం
విజయతే గంగావిమలజలం"

హల్లుల వైవిధ్యానికీ, విచిత్రసంయోగాలకూ సంస్కృతభాషలో వున్నంత ప్రచారం మన దేశంలో మరేభాషలోనూ లేదనే విషయం గమనిస్తే పైరచన చేసినవాడు ఎంత సంయమము గలవాడో తెలుస్తుంది. ఇతరభాషల చరిత్రమంతా ఆ హల్లుల వేసను తగ్గించుకొనే ప్రయత్నంగానే కానవస్తుంది. సంస్కృత భాషలో బంధమంతా పరుషమే నన్నాడు ఒక ప్రాచీనప్రాకృతకవి. కనకనేనేమో ప్రాకృతాది దేశభాషలలో వున్నంత యెక్కువగా గీతవాఙ్మయం సంస్కృతంలో లేదు. ఒకవేళ ఉండివుండినా సంగీతపు సరణితో అతుకకపోవడంచేత నశించిపోయిందేమో. ఆభాషను నాదవ్యక్తికి సహాయంగా సవరించడమంటే గొప్ప సాహసం మాత్రమే కాదు. త్యాగం కూడా. అందుకై కవి యెన్నో అర్థాలూ, భావాలూ వదలుకోవలసివుంటుందిగనక. ఈకార్యంలో నెగ్గినవారిలో అంతా జయదేవుడు అగ్రగణ్యుడుగా గానవస్తాడు. అతని గీతగోవిందం పాటలూ, పద్యాలూ మేళగించిన అద్భుతరసరచన. అందులో పాటలే ముఖ్యం; పద్యాలు చదవడానికి, పాటలు పాడడానికి; కనక భాషావిషయంలో జయదేవుని దృష్టీ, ప్రయత్నమూ ఆరెంటిలోనూ భిన్నంగా కానవస్తుంది. తన సరస్వతి 'మధురకోమలకాంతపదావళి' అన్నాడతడే. కాని యీధర్మాలు అతనిపద్యాలకంటే పాటల్లో ఎక్కువగా వ్యక్తమైవుంది. అతని పద్యమొక్కటి:—

"రాసోల్లాసభరేణ విభ్రమభృతా
మాభీరవామభ్రువాం
అభ్యర్ణే పరిరభ్య నిర్భరమురః
ప్రేమాంధయా రాధయా
సాధు త్వద్వదనం సుధామయమితి
వ్యాహృత్య గీతస్తుతి
వ్యాజాదుద్భటచుంబితః స్మితమనో
హారీ హరిః పాతు వః"

అతని పాటలలోని తునక ఒకటి:—

"సంచరదధరసుధామధురధ్వని
ముఖరితమోహనవంశం
చలితదృగంచలచంచలమౌళిక
పోలవిలోలవతంసమ్
రాసే హరిమిహ విహితవిలాసం
స్మరతి మనో మమ కృతపరిహాసం"

గీతగోవిందాన్ని అనుకరించి వ్రాసినవారెందరో వున్నారుకాని, వారి కెవరికీ భాషపైన ఈ సంయమం లభించలేదు.

ఈ క్రిందిది ప్రాచీనాంధ్రవాగ్గేయకారకులలో నొకరైన తాళ్లపాక అన్నమయ్యంగారి రచన:—

"ప. అలరులు గురియగ నాడెనదే
అ. అలకల కులుకుల నలమేలుమంగ
చ. అరవిరిసొబగుల నతివలు మెచ్చగ
అరతెరమరుగున నాడెనదే
వరుసనపూర్వపువాళపు తిరుపుల
హరి గరగించుచు నలమేలుమంగ.
౨. మట్టపుమలపుల మట్టెల కెలపుల
తట్టెడి నడపుల దాటెనదే
పెట్టిన వజ్రపు పెండెపు తళుకుల
నట్టేటు చిమ్ముచు నలమేలుమంగ."

## అచ్చుల రమ్యత

ఇట్లే అచ్చులుగూడా పాటకు కావలసినట్లు లొంగిపోతూ రమ్యతను హెచ్చించుకోవలసివుంటుంది.

అవి స్వతోరమ్యమైన వన్నాను. కాని భాషలో వాటికి కాలనియమ ముంది; లఘువు కొక్కమాత్ర, గురువుకు రెండు, ప్లుతానికి మూడు. అంతకుమించి భాషలో అచ్చులను పొడిగించనక్కరలేదు. కాని పాట కంతచాలదు. జయదేవాదుల రచనలలో తొంభై పాళ్లు ఈ నియమాన్ని మీరకుండానే పాట నడుస్తుంది. కనకనే నాదవ్యక్తికీ విస్తరానికీ అవకాశం వాటిలో చాలదనిపిస్తుంది. కాబట్టి, పాటలలో లఘువుకు ఒకటికంటే, గురువుకు రెంటికంటే, కావలసినన్ని మాత్ర లెక్కువయిచ్చి, స్వేచ్ఛగా ఈడ్చి, రచించినారు తరువాతి వాగ్గేయకారకులు. ఇదే సంగీతంలో అచ్చుల రమ్యత. ఈ జాతిబయకారపద్ధతే ఇప్పుడూ నడుస్తూవుంది. జయదేవాదుల పాటలలో అక్షరాలనుబట్టి మాత్రాకాలమును చాలవరకూ కనిపెట్టవచ్చును. కాని క్షేత్రయ్య, త్యాగయ్య, దీక్షితులు మొదలైనవారి రచనలలో అది సాధ్యమే కాదు. త్యాగయ్య 'కొలువై యున్నాడే కోదండపాణి' అనే పద్నిమిదిమాత్రలు గల పదకొండక్షరాలను ౧౨౮ మాత్రల కాలంలో అతికించి భాషసంకెళ్లను పక్కకు తోసినాడు.

సంగీతసాహిత్యాల పరస్పరస్పర్ధలో సంగీతము పైచెయ్యిగా నిలచినప్పుడు కలిగే సహజపరిణామాలలో ఈ అక్షరరమ్యత ఒకటి. అంతేతప్ప నియమమూ, శాస్త్రమూ కాదు. నిర్మాణోత్సాహం సంగీతంలో ఎక్కువగా వుంటే సాహిత్యం తనంతట ఈ రమ్యావస్థకు దిగుతుంది. అట్లుగాక భక్తి, శృంగారం మొదలైన భావాల వుద్రేకం ఎక్కువగా వుంటే సాహిత్యమిచ్చే అక్షరా లెటువంటివైనా వాటితోనే సంగీతం సవరించుకోవలసివుంటుంది. మహామహులైన వాగ్గేయకారులందరి రచనలలోనూ దీన్ని మనం చూడవచ్చును.



# కంపెనీప్రభుత్వంనాటి ఆంధ్రదేశం

## విదేశవర్తక సంఘాల వాణిజ్య విధానాలు



= శ్రీ అజ్జరపు వెంకటరమణరావు =

భారతీయ ప్రాచీన వస్త్ర పరిశ్రమలు ప్రపంచ విఖ్యాతిని సంపాదించుకొంటే తెనుగుదేశం ఏనాడూ యీ ప్రఖ్యాతిని పంచుకోని కాలం లేదు. చైనా, పర్షియా, గ్రీసు, రోము, అరేబియా, మలాకా దీవులు, మలయా ద్వీపకల్పం, యిటీవల యింగ్లాండు, ఫ్రాన్సు, పోర్చుగల్లు, హాలండు దేశాలు మన బందరు అద్దకాలే, చింటులే, పాలంపోరులే, తల గుడ్డలే, రుమాళ్లే అంటే ఎంతో మోజుపడేవి. మనం పంపించిన బట్టలే కట్టుకొనేవి. విదేశపు అంగళ్లలో మన తెలంగాణపు వస్త్ర పరిశ్రమలకోసం విపరీతమైన వ్యామోహం వుండేది. ప్రజలు ఎంత ఖరీదయినాసరే యీ రంగురంగుల తళతళ మెరిసే మన బట్టలు దొరికితేనే చాలునని కొనుక్కొనేవారు.

క్రీ. శ. ౧౬-వ శతాబ్దంనాటికి మలయా కల్పం ప్రసిద్ధిపొందిన అంతర్జాతీయ వాణిజ్య కేంద్రం. అనేక దేశాలనుంచి బేహారులు అక్కడకు తమతమ వర్తక సామగ్రితో చేరుకొనేవారు. ఒక దేశం యింకొక దేశంతో తన సామగ్రిని మార్చుకొని, తనకు కావలసిన సామగ్రిని తీసుకొనిపోయేది. కాని ఆనాటి వర్తక వ్యాపారాలలో మన తెలంగాణం సముద్రతీరంనుంచి ఆకుపచ్చటి శాలువలు, చీరలు, అద్దకాలు, రంగు రంగుల మజిలీలు, చలువలు, నీలి, ఎర్రగుడ్డలు తెచ్చి అమ్మే అరబ్బీ పారసీక వర్తకుల వాణిజ్య ప్రతిష్ఠ అపారమయినది. వారి అంగడిలోకి వచ్చే యీబట్టల కోసం ప్రతిదేశంనుంచీ వచ్చిన వర్తకులు ఎంతో మోజుపడి, వారి సుగంధ ద్రవ్యాలను, యితర సామగ్రిని ఎంతధనం యివ్వగలిగిన దేశాలకయినా మాని, యీ గుడ్డల మార్పుదలలకు యిచ్చివేయడం జరిగేది. ఈ వాణిజ్య కేంద్రాలలోని పాశ్చాత్యదేశాల అనుభవమే వారి నీ తెలంగాణంపైకి దృష్టి పారింపజేసిందని సర్ విలియం హంటరు వ్రాశాడు.

క్రీ. శ. ౧౬౦౬ నాటికి పోర్చుగీసు వర్తకులు బందరుతీరంలో తమ వర్తకస్థానాన్ని స్థాపించుకొని యిక్కడ బట్టలు కొని తమ దేశానికి పంపుకొంటున్నారు. క్రీ. శ. ౧౬౦౭ లో యీ వర్తకానికి భాగదేయులుగా హాలండు దేశీయులు యిక్కడికి చేరుకొన్నారు. క్రీ. శ. ౧౬౦౯ లో లండనులో వర్తక సంఘానికి Florence weboyne అనేహాలండు దేశీయుడు ఈదేశంతో వర్తకం చేసుకోడానికి తగినసాయం చేస్తానని బయలుదేరాడు. క్రీ. శ. ౧౬౧౧ లో 'గ్లోబు' అనే ఓడలో అతను బందరు తీరాన్ని చేరుకొన్నాడు. గోల్కొండ నవాబును సందర్శించి, కొన్ని దస్తకులను సంపాదించుకొని తిరిగి యింగ్లాండుకు ప్రయాణమయినాడు. అతడీ తెలంగాణం తూర్పుతీరంనుంచి తన దేశానికి అమ్మకమునకయి తీసుకొనిపోయిన వస్తువులపై ౩౧౭% లాభం కనిపించింది. ఆనాటినుంచీ యీతూర్పుతీరపు వర్తక వ్యాపారంలో ఇంగ్లీషువర్తక సంఘానికి స్థిరమయిన నమ్మకం ఏర్పడింది. నాటి నుంచీ వారి వర్తకకేంద్రం ఒకటి బందరులో స్థాపించుకొని, వారూ వచ్చి, పోర్చుగీసు వర్తకులలాగే యిక్కడ బట్టలు కొని తమ దేశాలకు ఎగుమతి చేసుకోవడం ప్రారంభించి అధికారులుగా మారినారు.

భీమునిపట్నం, విశాఖపట్నం, బెండమూర్లంక, కోరింగ, కాకినాడ, నరసాపురం, నీలపల్లి, ఇంజరం, మదపొల్లం, మచిలీపట్టణం వంటి అనేక తూర్పుతీరపు తెలంగాణపు ఓడరేవులనుంచి ఏటేటా కొన్నికోట్ల రూపాయల విలువ కలిగిన చేనేత వస్త్రాలు యీ విదేశాలకు అమ్ముడు పోయేవి.

క్రీ. శ. ౧౬౮౭ నుంచీ మొగలాయీలు మన ప్రభువులు. ఔరంగజేబు చక్రవర్తికి మనసంగతి ఆలోచించడానికి సావకాశం లేకపోయింది. మరాఠీల ఆందోళనతోటే ఆతనికి కాలం సరిపోయింది. ఆనాడు దక్కను సుబేదారు హైదరాబాదు నవాబు. నామకః మనం మొగలాయీ ప్రభుత్వాధికారంలోని వాళ్లమే అయినా, యితనినే ప్రభువుగా పాటించడం ప్రజాసామాన్యానికి పరిపాటయిపోయింది. క్రీ.శ. ౧౭౦౭ లో ఆలంఘీరు పాదుషా చనిపోవడంతోటే మొగలాయీ సామ్రాజ్యపతనం ఆరంభమయింది. దేశమంతటా అరాజకం ప్రబలిపోయింది. తాబేదారులు సుబేదారులుగా, సుబేదారులు నవాబులుగా మారిపోతున్నారు. ఢిల్లీ సింహాసనంకోసం దేశమంతటా తగవులాట లారంభమయినాయి. ఒకవైపు దేశంలో వున్న రాజకీయ వర్గాలన్నీ ఆటువైపు దృష్టి మరల్చిన కాలంలో, సమయం కనిపెట్టి యీ విదేశవర్తకసంఘాలు తమ వ్యాపారాలు విరివిగా సాగే ప్రయత్నాలు చూచుకోవడం ఆరంభించినాయి.

దేశీయప్రభుత్వాలు అధికారంలోవున్న కాలంలో దేశీయ పరిశ్రమలకు కావలసినంత రాజాదరణ వుండేది. సాలీలు యిబ్బందిపడిఎరుగరు. కాని దేశంలో రాజకీయాధికారం నశించిపోయి, ప్రజాజీవితం దుర్భరమయిన అరాజకంలో వేగిపోయే ఆ కాలంలో వారికి ధనం పెట్టుబడిపెట్టి పనియివ్వగలిగే నాథులు కావలసి వచ్చారు. ఈ అదను కనిపెట్టి, విదేశవర్తకసంఘాలు వారికి కావలసిన మదుపు యిచ్చి వారి కిష్టమయిన రకరకాల బట్టలు కూలికి యీ సాలీలచేత నేయించుకొనే సావకాశాలు లభించాయి.

క్రీ. శ. ౧౭౦౮ లో యింజరంలో యీ ఇంగ్లీషువర్తకులకోసం తయారయే చలువనేతగుడ్డల పరిశ్రమలు యావద్భారతదేశంలోనూ ఆనాడు అగ్రస్థానాన్ని వహించినవని అప్పుడు యీ దేశానికి వచ్చిన సర్ జాన్ హామిల్టను వ్రాశాడు. ప్రతీవర్తకకేంద్రంలోనూ ఇంగ్లీషువర్తకులు సాలీలచేత బట్టలు నేయించుకుంటున్నారు. "కాని ఎటు చూచినా దేశం దుర్భరమయిన అరాజకంతో వేగిపోతోంది. ఒకవైపునుంచి జమీందారుల సైన్యాలు, ఇంకొకవైపునుంచి తురుష్క ప్రభుత్వాల పటాలాలు దేశంమీద పడి దోచుకుంటున్నాయి. అందుచేతనే బట్టలు యథావిధిగా పంపడానికి వీలులేకపోయిం"దని విశాఖపట్నం ఓడరేవులోని వర్తకసంఘాధ్యక్షుడూ, సభ్యులూ వారి ప్రభుత్వానికి విన్నవించుకొన్నారు. కాని కొన్ని వేలమైళ్ల దూరంలో సముద్రంవెనకాల వున్న వారి అధికారులకు యిక్కడి దేశపరిస్థితులు బోధపడే మార్గం లేకపోయింది. వారికి మామూలుగా ఎగుమతులు తగ్గిపోయినట్లయితే వారి వర్తకలాభాలకు మోసం వస్తుందన్న భయంతో వారి తాబేదారులను అదమాయించడం ఆరంభించారు. వీ రింక విధిలేక, యీ సాలీలను వారి వర్తకకేంద్రాల ప్రాకారాలలో బంధించి వారిచేత గుడ్డలు నేయించడం ఆరంభించారు. వారికి యిచ్చే కూలీలు తగ్గించడం ఆరంభించారు. తమ లాభాలను అధికంచేసుకోవడానికి చేసే ప్రయత్నాలన్నీ కాక, సాలీలు తమరు చెప్పినంత సన్నగా నేయలేకపోతే యింత కష్టపడి పనిచేసినా ఆ గుడ్డలను తీసుకోవడం మానేసేవారు. దీనితో యీ బాధ భరించలేక, ఏమయినాసరే, యీ ఇంగ్లీషువర్తకులకు గుడ్డలు నేయకూడదని మన తెనుగుసాలీలు నిశ్చయించుకొన్నారు. ఊరూరుకూ తిరిగి ప్రచారంచేశారు. ఇంగ్లీషువర్తకుల ఆధ్వర్యంలో వున్న నేతపరిశ్రమలకు అవసానకాలం ఆరంభమయినట్లే అనిపించింది.

ఈ సమయం కనిపెట్టి ఫ్రెంచి, డచ్చివర్తకులు సాలీలకు ఎక్కువకూలీలను యిచ్చి అంత నిర్బంధించకుండా వారికి కావలసినంత సావకాశాన్ని యిచ్చి బట్టలు నేయడానికి ఆలస్యమయినా ఇంగ్లీషువర్తకుల వలె బంట్రోతులను నిలబెట్టి బాధించకుండా గడువు యిచ్చి గుడ్డ కొంచెం అలికీగా వున్నా ఏదోవిధంగా బేరం స్థిరపరచుకొని తీసుకొనేవారు. "ఈ యితర

విదేశవర్తకులు చూపించే కనికరానికి, వారిచ్చే సరసమయిన ధరలకు, వారు న్యాయంగా పరిష్కారంచేసుకొనే విధానానికీ సంతుష్టిపడి, సాలీలు వారికోసం ఎన్ని గుడ్డలయినా నేయడానికి ఒప్పుకుంటారేగాని మన కొక్క గుడ్డనయినా నేసియిచ్చే సాలీ కనిపించడంలేదు. నన్ను మీరు యథాప్రకారం బట్టలను ఎగుమతిచేయడం లేదని బాధించి ఏమీ ప్రయోజనం లేదు. దయయుంచి నన్ను స్థానంలోనుంచి తొలగించండి. ఈ వుద్యోగం మానుకొంటున్నాను. ఇంకొకరిని నియమించుకొనే ప్రయత్నాలు మీరు చేసుకోవడం మంచి"దని యీ తెలంగాణపు వర్తకరేవులలోని యింగ్లీషు వర్తకులు లండనులోని వర్తకసంఘానికి వ్రాయడం మొదలుపెట్టారు. దానితో లండనులోని వర్తకసంఘాధికారులలో కొంత చైతన్యం కలిగింది. కాని అది ఏపాటి? ఎటువంటిది? "సాలీలతో కూలీలు తప్పకుండా ఎక్కువ యిస్తామని చెప్పి చూడండి" అన్నారు. యథాప్రకారం ముందర బట్టలునేసియిచ్చే విధానం చూడమన్నారు. "మేము ఎన్నో వాగ్దానాలు చేస్తున్నాం. మా మాటమీద గౌరవం పూర్తిగా నశించింది. అయినా మనలను యింకోసారిగా నమ్మి ఎనభై వేలరూపాయల విలువయినగుడ్డలు మదపొల్లం,యింజరం వర్తకులు యీ సాలీలచేత నేయించి యిస్తున్నారు. ఇవి కేవలం నిర్బంధంవల్ల సాధ్యమయ్యేవేగాని, మనమంటే సాలీలకు యిష్టంవుండి ఎంతమాత్రం కాదు" అని మచిలీపట్నంలోని వర్తకసభ్యులు లండనుకు రాశారు. "మనం యిదివరకు అక్కర్లేదని తిప్పివేసిన గుడ్డలనే యిప్పుడు మనం కావాలంటే తెచ్చియిస్తున్నారు. అవి నేతలో మనం కావాలన్నంత సన్నంగా లేకపోయినా, రంగులు మటుకు బాగున్నాయని పుచ్చుకుంటున్నాం" అని రాశారు ఇంజరంవర్తకులు. ఇంకొక వర్తకకేంద్రమయిన మదపొల్లంనుంచి "నేను సాయశక్తులా బాధపడి, వారిని మన వర్తకసంఘానికి గుడ్డలు ఎలాగయినా నేయాలని సావధానంగా చెప్పి చూశాను. కాని ఏమీ లాభం లేకపోయింది" అని వ్రాశాడు వారి ప్రతినిధి.

దేశపరిస్థితులుమాత్రం మారినాయా! "కొన్ని దినాలనుంచి ఎక్కడా దురంతాలు జరగకుండానే వున్నాయనుకుంటే మళ్లీ తిరుగుబాట్లు ప్రారంభమయినాయి. దేశమంతా విప్లవవాతావరణంతో మునిగిపోయింది. బట్టలకోసం గ్రామాలకు పంపిన బంట్రోతులు వెనక్కు తిరిగిరావలసివచ్చింది" అని విశాఖపట్నంరేవునుంచి వర్తకసభ్యులు అధికారులకు వ్రాశారు. "ఎంతోమంది పనివాళ్లు వాళ్ల సమస్తంతోటే తల దాచుకోడానికి అడవులలోనికీ, కొండలలోనికీ పారిపోతూ"రని ఇంజరంనుంచి వర్తకసంఘంవారింటికి వ్రాశారు. కాని స్వల్పకాలంలోనే యీ గందరగోళం తగ్గింది. "పారిశ్రామికులు వారివారిగ్రామాలకు చేరుకొంటున్నారు. ఈసారి మనకు బట్టలునేసే ఏర్పాట్లు తప్పక చేస్తా"మని మచిలీపట్నంవర్తకులు ధైర్యంగా మాట్లాడారు. ఈసారి, సర్కారులలోని భూములను, శిస్తువిషయాలను పరిష్కారంకోసం రాబోతూవున్న హైదరాబాదునవాబును చూచి వారికి వున్న యిబ్బందులను యీవర్తకులు చెప్పాలని అనుకుంటున్నట్టు విని, మొగలాయీరాయబారి, "మీరు మా ప్రభువు ఆప్రాంతాలకు వచ్చినప్పుడు నావుత్తరువు లేనిదే ఏవిధమయిన మహజర్లు పంపడానికీ వీలులేదు; ఒకవేళ నాఆజ్ఞను అతిక్రమించి ప్రవర్తించారా, యినుపసంకెళ్లు తగిలించి ఖైదుకు పంపిస్తాను"అని వుత్తరం వ్రాసి మచిలీపట్నంవర్తకసభ్యులకు పంపించాడు. ఇంతటితో యింకొకసారి యింగ్లీషువర్తకులు తమ వర్తకవ్యాపారాల విషయంలో పెట్టుకొన్న ఆశలు అంతర్ధానమయినాయి.

డచ్చివారు మటుకు, యీగందరగోళం ఎలా వున్నా, వారి వర్తకాన్నివారు అభివృద్ధిచేసుకొంటున్నారు. ఏడువందలమంది రంగులపనివాళ్లను గోలకొండనుంచి రప్పించి, వారిచేత అనేకరకాల రంగులబట్టలను నేయించుకొంటున్నారు. వారికి సాలీనా ౨౦౦౦ పెగోడాలు యిచ్చి పోషిస్తున్నారు. ఈవిషయంలో తమరూ జోక్యం కలగజేసుకొని, నాలుగయిదుకుటుంబాలను విడదీసి తమకోసం పనిచేసేలా ప్రయత్నిస్తామని యింజరంఇంగ్లీషువర్తకులు లండనులోని అధికారవర్గాలకు వ్రాశారు. కాని వారికి యీసాలీలకు యితరవర్తకసంఘాలకంటె ఎక్కువకూలీలు యివ్వడంగాని, అధమం వారిచ్చినంతమాత్రమయినా యివ్వడంగాని అలవాటులేదు. అదీగాక దీనికి లండనులోని

అధికారులు అనుమతిస్తేగాని, స్వతంత్రించి కూలీ హెచ్చు చేయడానికి వీరికి స్వాతంత్ర్యం లేదు. కాని యితరవర్తకసంఘాలకు యీ యిబ్బంది లేదు. ఏదో విధంగా వారి వాణిజ్యం పెంచుకోవడమే వారి ప్రధానోద్దేశ్యం గనుక సాలీలడిగిన ధరలను వారిచ్చేవారు. అందుచేత సాలీలు వారినేతవస్త్రాలను యీయితరవర్తక సంఘాలకే అమ్ముకొనేవారు. బరంపురంపట్టుపరిశ్రమలు కూడా యీవిధంగానే విదేశీయులకే అమ్మడు పోతున్నాయని యింగ్లీషువర్తకులాక్రందనంచేసేవారు.

క్రీ. శ. ౧౭౩౨లో రాజమండ్రి రుస్తుమ్‌ఆలీ ఖానుపరిపాలనక్రిందికి వచ్చినప్పటినుంచి పరిస్థితులు కొంత బాగుపడ్డాయి. ఇంగ్లీషువర్తకుల వ్యాపారాలు కొంత తేరుకున్నాయి. మళ్లీ వారి వర్తకం బాగా సాగే సూచనలు కనిపించాయి.

ఇంజరం, మదపొల్లంవంటి వర్తకకేంద్రాల నుంచి వర్తకాభివృద్ధికి వున్న భవిష్యత్సావకాశాలను గురించి వర్తకసభ్యులు పదేపదే వ్రాయడం మొదలు పెట్టారు. మళ్లీ ఏదో కొంతమంది సాలీలను కుదుర్చుకొని వారిద్వారా నేతపరిశ్రమలను యిదివరకుకంటె జోరుగా సాగించడం ప్రారంభించారు.

ఈసారి ఫ్రెంచివర్తకులకే కొన్ని విషమపరిస్థితులు ఏర్పడినాయి. పఠాణులు వారి నాణెములకు తగ్గించి విలువలుకట్టడం ప్రారంభించారు. వారి సామగ్రులను ఒకచోటునుంచి ఒకచోటికి పోనివ్వడానికి అభ్యంతరాలు ఆరంభమయినాయి. వారికీ వారి సాలీలు బట్టలు నేసియివ్వమని పేచీలు పెట్టడం ప్రారంభించారు. ఇంజరంలోనున్న ఇంగ్లీషువర్తకు లీపరిస్థితులకు పైకి సానుభూతి చూపించినా, లోపల చాలా సంతోషపడ్డారు. తమరు ముందరికి రావాలంటే యిదే సరి అయిన సమయం అనుకొని "ఫ్రెంచివర్తకులు, హాలండు దేశీయులు చాలా దుర్మార్గులు. తమ వాణిజ్యవిధానం చాలా న్యాయమయినదిగనుక తమరొక్కరికే యీ వర్తకవ్యాపారాలు చేసుకునే హక్కు వుంచి తక్కిన వారికందరికీ తీసివేయవలసిం"దని నవాబుతో రహస్యంగా చెప్పిచూశారు. కాని ఆనాటి నవాబులకు యితరవర్తకసంఘాలకంటె ఇంగ్లీషువర్తకుల ఆధిక్యతను అదనంగా గౌరవించవలసిన అగత్యం ఏమీ కనిపించలేదు. "ఎవరు నవాబుకు వర్తకసుంకాలు చెల్లిస్తే వారికి యీదేశభాగంలో వాణిజ్యం జరుపుకోవడానికి సావకాశం వుంది. ఎవరికీ ప్రత్యేకంగా యీ హక్కును వదిలిపెట్టి యితరులను తొలగించడం జరగదు. వెళ్ల"మని యీఇంగ్లీషువర్తకసంఘాధ్యక్షులకు జవాబువచ్చింది. దానితో యీ మచిలీపట్నపు నవాబు అనడంతోటే ఇంగ్లీషువర్తకులకు ఒళ్లుమండింది. ఇతర వర్తకసంఘాలదగ్గర దట్టంగా లంచాలు పుచ్చుకున్నాడుగనుక తమ కోర్కెలను నిరాకరించాడని వాదించడం ప్రారంభించారు. యీఆరోపణ కేవలం నిరాధారమయినది. మళ్లీ నిజం వారే ఒప్పుకున్నారు. "మన కోర్కెనే అతడు అంగీకరించినాడంటే అతని పీకయో, లేక అధమం అతని ఉద్యోగమో ఎగిరిపోయి వుండేది. అందుకనే మనకున్న యిబ్బందులను ప్రభుత్వానికి తెలియజేసి తగిన పరిష్కారానికి అవకాశాలుంటే చూస్తానన్నా"డని వారే అన్నారు. అసలు వారి భయమేమిటంటే "మళ్లీ ఫ్రెంచివర్తకసంఘం అధికారం సంపాదించుకొంటోంది. ఫ్రెంచినాకల వాణిజ్యవిధానం అత్యంతప్రాముఖ్యస్థితిలోకి వచ్చేస్తుంది." నిజంగా పరిశీలిస్తే యిదే వారి కున్న ప్రతిబంధకం.

ఇంతట్లోకే క్రీ. శ. ౧౭౪౮లో దక్కను సుబేదారు చనిపోయాడు. అతని స్థానంకోసం అన్నదమ్ముల తగాదాలలో ఫ్రెంచివర్తకసంఘం, యింగ్లీషువర్తకసంఘం చెరియొక వైపున చేరుకొన్నాయి. వాటి భావిఅదృష్టాన్ని యీయుద్ధఫలితాలకు విలియావేసి, అంటుకుంటున్న నిప్పును రగిల్చించి హైదరాబాదునవాబుకుటుంబాన్ని యుద్ధంలోకి దుమికించాయి. తామూ దిగినాయి. క్రీ. శ. ౧౭౫౭ లో జరిగిన బొబ్బిలియుద్ధంతో ఆంధ్రతేజం అస్తమించింది. పరాసు దేశీయులపరాభవంతో ఇంగ్లీషువర్తకసంఘం చిరస్థాయి అయి, క్రీ. శ. ౧౭౬౬ దాకా కేవలం వర్తకవ్యాపారాలనే చూచుకొంటూవుండి, క్రీ. శ. ౧౭౬౬లో నైజాము దానరూపేణా యీ ఉత్తరసర్కారులను సంపాదించుకొని, అధికారస్థానాన్ని ఆక్రమించుకొంది.

# పాపభారం

[కథానిక]

= శ్రీ 'అమరేంద్ర' =

"ఇంకా రాలేదా? ఇంకా రాలేదా?" అని తల్లి మూల్గింది.

"వచ్చే వేళయింది. ఈ పాటికి సగందోవలో వుంటుంది. వస్తుందమ్మా, కొంచెంసేపు కళ్లు మూసుకుని పడుకో" అని కూతురు శారద తల్లిపక్కలో కూచుని విసురుతూ బదులు చెప్పింది.

"అమ్మాయీ, నీకు తెలియదే తల్లీ, నీకు తెలియదు. కళ్లు మూసుకుంటే ఇక తెరవటం ఉండదమ్మా. మూసుకు పోతుంటే బలవంతాన తెరుచుకుంటున్నాను అది వస్తుందేమోనని. ఇంకా రాలేదేమే? అసలు రాదేమో?"

"వస్తుందమ్మా, తప్పకుండా వస్తుంది. ఎక్కడున్నా వెతికి తీసుకురమ్మని మనుషుల్ని పంపాను. ఈ పాటికి వచ్చేస్తూ వుంటుంది."

"ఇక నాకు వ్యవధి లేదే తల్లీ! అంతా అయిపోయాక వస్తుందేమో? అయ్యో! ఇంకా రాలేదేమే? ఇంకెప్పుడు వస్తుందే?" అని ఆందోళనతో వణికిపోయి, సొమ్మసిల్లి, క్షణంసేపు మాట్లాడకుండా పడుకున్నది. శారదకు ఏమీ పాలుపోవటం లేదు. తల్లి ధోరణి చూస్తుంటే భయం వేస్తోంది. ఆమె బతకదని వైద్యులంతా నిర్ధారణచేసి ఆశవదులుకున్నారు. అప్పటినుంచీ శారదమనసు మనసులో లేదు. తనను కంటికి రెప్పగా కాపాడి పెంచిన తల్లిని విడిచిపెట్టి తానొక్కర్తే ఈ లోకంలో ఎల్లా బతకగలదు? తండ్రి స్వర్గానికి తరలివెళ్లినప్పటినుంచీ తల్లితప్ప వేరే ప్రపంచమే శారదకు తెలియదు. అటువంటి తల్లి మరణకాలంలో కోరిన కోరిక తాను నెరవేర్చకపోతే ఎల్లాగు? శారదను చిన్నప్పుడు ఎత్తుకుని సాకిన దాసీ ఒకతె వుంది. అది తమ ఇంట్లోనేవుండి శారదకు నాలుగోయేడు వచ్చేదాకా పెంచింది. దాని భర్త కలరా తగిలి చచ్చిపోయిన తరవాత దానికి మతి చలించిపోయింది. ఎంత వద్దన్నా వినకుండా తన పిల్లల్ని వెంటపెట్టుకుని ఆ వూరు విడిచి వెళ్లిపోయింది. ఇది పదేళ్లకిందటి సంగతి. అప్పటినుంచీ ఆ దాసీదాని జాడ తెలియలేదు. ఈ పదేళ్లలోనూ ఆ దాసీదాన్ని గురించి తల్లి శారదతో ఒక్కమాటయినా మాట్లాడలేదు. తాను బతకనని తెలుసుకున్న దగ్గరనుంచీ ఆ దాసీదానికోసం తల్లి ఒక్కవరసన తపిస్తోంది. మరణసమయంలో ఆప్తబంధువుకోసమైనా అంతగా పరితపించరేమో! ఎప్పుడో పదేళ్లకిందట పని మానుకుని ఎక్కడికో వెళ్లిపోయిన దాసీదానికోసం తల్లి అంత తహతహపడటం చూస్తుంటే శారదకు ఏమీ తెలియటం లేదు. తల్లి మళ్లీ అందుకున్నది: "అమ్మాయీ, ఇంకా రాలేదుటే? ఇంక రాదేమో? నాకు వ్యవధి అయిపోతోందమ్మా, ఇంకా రాదే?" శారద తల్లి తలకింది దిండును సరిజేసి "వస్తుందమ్మా, తప్పక వస్తుంది, నువ్వు ఆందోళనపడబోకు. ఎక్కడవున్నా గాలించి తీసుకొస్తాం" అంటుండగానే బైట అడుగుల అలికిడి వినబడింది. వెతకటానికి వెళ్లిన మనుషులు దాసీని వెంటబెట్టుకుని వచ్చారు. ఆ రేగిపోయిన చింపిరితలా, చినిగి పీలికలైపోయిన చీరే, చిక్కిపోయిన రూపూ

చూడగానే శారదనుండె చివుక్కుమన్నది. అమాంతంగా పసేళ్ల నాటి చిన్నపిల్లలాగే శారద "లక్ష్మీ"అని కేకపెట్టి పరిగెత్తింది. దాసీది తాను పెంచిన పాపపద్మాలుగేళ్ల పడుచుగా మారటం చూసి విస్తుపోతూ నిలబడిపోయింది. మంచంమీదినుంచి తల్లి "వచ్చిందా" అని పెనుల్చుకుని అరిచి ముంజేతులమీద అమాంతం లేచి కూర్చోబోయింది. దాసీది పరుగున వెళ్లి "అమ్మగారూ, వచ్చాను. మీపాదాలకాడికి మళ్లీ వచ్చాను. నన్ను మరచిపోయా రనుకున్నాను" అని రోగిపాదాలు కళ్లకద్దుకుంది. రోగి నీరసించిపోతున్న గొంతుతో "లక్ష్మీ...నిన్నా...మరచి..." అంటూ దాసీదాని చేతులను తన చేతుల్లోకి తీసుకుని దాని కళ్లలోకి రెప్పవాల్చకుండా చూసింది. ఏదో చెప్పబోయింది. పెదవులు వణికినయ్. ధ్వని పెగిలిరాలేదు. ఇంతలోనే చేతులు కట్టెబారిపోయినయ్. నిలువుగుడ్లు పడినయ్. దాసీది 'అమ్మగారూ' అని ఘొల్లుమున్నది. శారద 'అమ్మా' అని ఒక్క శోకం పెట్టింది. మాటలకు లొంగని బాధ ఏదో ఆశవంలోపలే అణగిపోయింది. ఎందుకోసం దాసీదాన్ని పిలిపించిందో, ఎందుకు దాన్ని చూడాలని ఒక్కవరసన కలవరించిందో ఎవరికీ తెలియదు. కలవరించిన దాసి వచ్చి కంటపడేసరికీ ఆ రోగికి కాలం తీరిపోయింది. దట్టంగా అలుముకుంటున్న చీకటిలో శారదా, ల ఒకరికేసి ఒకరు చూసుకుంటూ, ఏడుస్తూ దరితెలియని అయోమయంలో పడిపోయారు. శవం మాత్రం నిశ్చలంగా వుంది తనకిక చీకటివెలుగుల భేదమేమీ లేనట్లు!

౨

"దాచలేను, ఇంక దాచలేను" అన్న మాటలతో గది అంతా గింగురుమన్నది. ఆ మాటలు ఎంతో బాధతో క్రుగ్గిపోతున్న గుండెలోతులలోనుంచి దూసుకొనివచ్చినయ్. అద్దంలో, మల్లెపూల రెక్కలకంటె తెల్లని దుస్తులలో వున్న తన నీడను చూసుకుంటోంది మార్గరెట్. ఎదురుగా గోడమీద ఉన్న క్రీస్తుబొమ్మ అద్దంలో కనబడుతోంది. శిలువమీద నిలబడి దారుణమైన బాధతో, దీనమైన ముఖంతో, తడిసిన కళ్లతో క్రీస్తు తన మనసులోకి తొంగిచూస్తున్నాడు. ఆ చూపుకు అందకుండా ఏ పాపం దాగుతుంది? ఆ పవిత్రమైన కాంతిలో ఏ మలినం మాయమైపోదు? ఆ చూపు నర్సుమార్గరెట్ గుండెను చీల్చివేసింది. ఆమె కళ్లకు ఒక్కసారిగా ఇన్నాళ్లనుంచీ తన తెల్లటి వేషంలో దాగిన పాపమొకటి కొట్టవచ్చినట్లు కనబడింది. అణుచుకోలేని ఆవేగంతో ఆమె చిందులు తొక్కసాగింది. ఆమెలోపల దాగిన విషసర్పమొక్కసారిగా ప్రతిరక్తనాళాన్నీ బద్దలుకొట్టి బైటపడాలని బుసలుకొడుతోంది. వణికిపోతున్న కనురెప్పల నొకసారి పైకెత్తి చేతులు జోడించి "ప్రభూ! నిన్ను మోసగించలేను" అని గద్గదస్వరంతో విన్నవించుకున్నది. దూరంగా చర్చిగంట మోగింది. ప్రాణప్రదంగా దాచుకునే బైబిలును చేతపుచ్చుకుని మార్గరెట్ వడివడిగా నడిచిపోయింది.

దోవలో తననుతాను నిందించుకుంటూ అడుగు వేసింది. "ఈ నాడు అగ్నిపర్వతంలాగా బద్దలై నా పాపం బైటపడిపోతుంది. నా కలుషాన్ని కన్నీటితో కడిగివేస్తాను" అనుకుంటుండగా మతగురువు ఎదురైనాడు. మార్గరెట్ అతన్ని దారిలోనే నిలవేసింది. ఆమెకళ్లలోలాన్ని గమనించి మతగురువు విషయమేమిటి అన్నాడు. మార్గరెట్ వణికిపోతూ అన్నది: "నేనొక గొప్పపాపం చేశాను. అది మీ ముందు బైటపెట్టుకుందామని వచ్చాను. ఈ పాపభారాన్ని భరించలేను" మతగురువు చకితుడై "ఏమిటీ, నర్సులు పాపం చేసారా?" అన్నాడు వాళ్లమీద తనకున్న గౌరవాన్ని వెల్లడిస్తూ. మార్గరెటు సిగ్గుతో తల వంచుకుని "ఇంత పవిత్రమైన వేషంలో ఎంత పాపం దాగివుందో! నిజం చెబుతున్నాను. వినండి. విని నాకు ప్రాయశ్చిత్తం విధించండి. ఈ పాపభారంతో నే నిక జీవించలేను. నన్ను అనుగ్రహించండి" అని దీనంగా వేడుకున్నది. మతగురువు కరుణతో కరిగిపోతున్న మనసుతో మార్గరెటు హృదయసంక్షోభమంతా విన్నాడు. అంతా చెప్పినాక మతగురువుకు మోకరిల్లి "నాకు మనశ్శాంతి

లేదా? నాకు విముక్తి లేదా" అని ప్రశ్నించింది. "లేకేమి? ఉంది, ఉంది" అని మతగురువు ఆశకలిపించాడు. "ఏమిటో చెప్పండి. ఎంత కఠినమైన ప్రాయశ్చిత్తం విధించినా సహిస్తాను" అని మార్గరెటు వేడుకున్నది. మతగురువు దయతో నిండిన కంఠంతో "ఎవరికి ఎడబాటు కలిగించావో వారిని వెళ్లి క్షమార్పణ వేడుకో. నీకు మనశ్శాంతి లభిస్తుంది" అన్నాడు. దూరంగా మళ్లీ చర్చిగంటలు గణగణ మోగినయ్. వాటితో కలిసిపోయి మార్గరెటుమనసుకూడా ఆశతో ఝుణఝుణ మన్నది.

ప్రార్థనలు ముగియగానే మార్గరెట్ పరుగు తీసింది. "ప్రపంచంలో ఎక్కడ వున్నా సరే వాళ్ల దగ్గరికి పోయి కాళ్ల మీద పడతాను. కన్నీళ్లతో నా పాపకథ వినిపిస్తాను. వాళ్ల గుండెలు కరిగించి క్షమాభిక్ష వేడుకుంటాను" అనుకుంటూ బయలుదేరింది.

దొరికింది, దొరికింది. అణచివేసే పాపభారం నుంచి బైటపడే దోవ దొరికింది!

## 3

"శాంతమ్మగారూ! శాంతమ్మగారూ!" అన్న పిలుపు విని శారద బెదిరిపోయింది; కంపించిపోయింది. తల్లి పోయి ఎంతోకాలమైతే ఇవాళెవరో వచ్చి ఆ పిడను పేరుపెట్టి పిలుస్తున్నారు. మళ్లీ అదేపిలుపు: ఇందాకటికంటె బిగ్గరగా. లక్ష్మి పరుగుపరుగున వెళ్లి వచ్చి "ఆసుపత్రిలో దొరసానిగారు వచ్చారమ్మా. వారిచేతిమీద ఎన్నో పురుళ్లు పోసుకున్నాను. అమ్మగారికోసం వచ్చారంట. అదుగో వారే వస్తున్నారమ్మా" అని చెప్పింది. నడచినడచివచ్చిన బడలికతో నర్సు మార్గరెట్ లోపలికి వచ్చింది. రాగానే నలుపైపులా తేరిపారజూచింది. శారదను చూడగానే ఆమె ముఖంలో ఒక్క మెరుపు మెరిసింది. పద్నాలుగేళ్లనాడు తాను బొడ్డుకోసిన పసిపాపయేనా ఈ యువతి?

"కూర్చోండి, ఏం పనిమీద వచ్చారు?" అని శారద మర్యాదగా పలకరించింది. లక్ష్మి కుర్చీ తెచ్చి మార్గరెట్ను కూర్చోమన్నది. వద్దని ఆమె నేలమీదనే చతికిలబడి "శాంతమ్మగారు చనిపోయారా పాపం?" అన్నది. శారదకూ, లక్ష్మికీకళ్లనిండా నీళ్లు తిరిగినయ్. ఏమీ మాట్లాడలేక కళ్లు అద్దుకుంటూ నిలబడ్డారు. కొంచెంసేపున్నాక మార్గరెటు "అమ్మాయీ, ఇల్లా రా అమ్మా, కూచో, నీపేరేమిటి?" అంది. శారద చెప్పేలోగానే లక్ష్మి అందుకుని "అమ్మగారు మనసుపడి శారద అని పెట్టుకున్నారు. లేకలేక కలిగారని అమ్మాయిగారంటే అమ్మగారు ప్రాణం విడిచేవారు" అన్నది. ఆ మాటలు వింటుంటే మార్గరెట్కు కొరడా దెబ్బ తగిలినట్లనిపించింది. "నీ పేరేమిటమ్మా" అని దాసీని అడిగింది. "దొరసానిగారూ, నా పేరు లక్ష్మి. మీరు మరిచిపోయారేమో గాని నేను మరిచిపోలేనమ్మా. మీ చేతిమీదుగా ఎన్నో పురుళ్లు పోసుకున్నాను. మీ ఋణం ఎన్ని జన్మలకైనా తీర్చుకోలేను దొరసానిగారూ!" పాపం పుణ్యం ఎరగని అమాయక స్త్రీ తనను మెచ్చుకోవటం వింటుంటే మార్గరెట్కు తన మీద తనకు మితిలేని రోత కలిగింది. తన పాపాన్ని తలుచుకుంటే గుండె భగ్గుమంటున్నది. ఇంతలో దాసీది "దొరసానిగారూ, ఏమైనా పనిమీద వచ్చారా శెలవియ్యలేదు" అన్నది. మార్గరెట్ మాట్లాడలేక పోయింది. ఎంతో ప్రయత్నించి "నీతోనే పనివుండి వచ్చాను లక్ష్మి" అంది. "నాతోనా, దొరసానిగారూ, నాలాటి దిక్కుమాలినవాళ్లతో తమలాటి మహారాజులకి పనేమిటండీ" అని లక్ష్మి దీనంగా అడిగింది. మార్గరెటు మారుచెప్పలేదు. దూరంగా నిలబడి అంతా వింటున్న శారదకేసీ, దగ్గరున్న లక్ష్మికేసీ తేరిపారజూచింది. ఆమెకళ్లు తడిసినయ్. "శారదా! ఇల్లా రా, తల్లీ. మీ అమ్మ చనిపోలేదు; చనిపోలేదు. నిన్ను మీ అమ్మదగ్గరికి తీసుకుపోతా రా" అంది. ఈ మాట విని శారద నివ్వెరబోయింది. "ఏదీ మా అమ్మ?" అని అప్రయత్నంగా అడిగింది. "తొందరపడకమ్మా, నీకు మీ అమ్మను చూపిస్తాను" అంది మార్గరెట్. లక్ష్మి ఆశ్చర్యంతో కళ్లు ఇంతచేసి గోడకు ఆనుకుని నిలబడింది.

"పద్నాలుగో ఏడు కామా శారదా నీకు?" అని అడిగింది నర్సు. అవునని శారద తల ఊపింది.

"అవునవును, పద్నాలుగే. ఆకానుపు నాకూ, అమ్మగారికీ ఒక్కసారే వచ్చింది. ఇద్దరం ఒక్కరోజే కన్నాం. నాపిల్ల చచ్చిపోయేపుట్టింది" అని లక్ష్మి మార్గరెటుముఖంలోకి చూసింది. ఇది వినగానే నర్సు గుండెలలో కత్తితో పొడిచినట్లయింది.గిర్రున కళ్లలో నీరు తిరిగింది. అమాంతంగా లక్ష్మిపాదాలను చేతులతో చుట్టివేసి "నన్ను క్షమించు తల్లీ, నన్ను మన్నించు" అని వణికిపోతున్న కంఠంతో అరిచింది. లక్ష్మి తత్తరపాటుతో "లేవండి దొరసానిగారూ, అయ్యో ఇదేమిటి, ఈ దిక్కుమాలినదాని కాళ్లమీద పడతారు? లేవండి" అని దూరంగా జరిగింది. మార్గరెట్ శారదగడ్డం పుచ్చుకుని "తల్లీ, నాతప్పు మన్నించవూ?" అని బతిమాలింది. ఏమీ అర్థంకాక శారద ఆశ్చర్యపోతూ అన్నది: "ఏమిటో చెప్పండి. నాకేమీ తెలియకుండా వున్నది." నర్సు "చెబుతాను తల్లీ, అందుకోసమే ఇంతదూరం వచ్చాను. మీముందు సిగ్గుపడను. నాపాపమంతా మీముందు విప్పిచెప్పుకుని కొంచెం మనశ్శాంతి పొందుదామని వచ్చాను.లక్ష్మీ, శారదా, మీ అమాయకహృదయాలకు ఈపాపాత్మురాలి మాటలు చాలా ఘోరంగా వుంటయ్.మీముందు నిలబడటానికే సిగ్గుతో చచ్చిపోతున్నాను." అంటుంటే కనుకొనలలో నీరునిండి చెక్కిళ్లమీదుగా రాలినయ్. ఆమెముఖంలో భరింపలేని వేదన, చెప్పలేనంత సిగ్గూ అలముకొన్నయ్.

"దొరసానిగారూ, మీమాటలు వింటుంటే నాకేదో భయం వేస్తోంది. ఎందుకమ్మా అల్లా కళ్లంట నీళ్లు?" అంది లక్ష్మి.

"పద్నాలుగేళ్లకిందటి సంగతి నేను చెప్పేది. నీకు గుర్తుందా లక్ష్మీ ఎంత బాధపడ్డావో? నీరసించిపోవటంవల్ల నీకాను పెంతో కష్టమైపోయింది. నువ్వల్లా బతికి బైటపడతావా అని అందరం దిగులుపడ్డాం. చివరకు అర్ధరాత్రివేళ నీకు పురుడువచ్చింది"

"అవును దొరసానిగారూ, గుర్తుంది. చచ్చిపుట్టిన పిల్లను చూసుకుని గొల్లుమన్నాను. ఇప్పుడున్నట్లుంది"

"లేదు, లక్ష్మీ, నీపిల్ల చచ్చిపుట్టలేదు.సుఖంగా వుంది"

"మీ మాటలు నాకు తెలియటంలేదు దొరసానిగారూ. చచ్చిపోయిన పిల్లను నేను కళ్లారా చూశాను; కాదంటారేమిటి?"

"లేదు, లక్ష్మీ, నీపిల్ల సుఖంగా వుంది. చచ్చిపోయిన పిల్లను నీకు చూపిన పాపాత్మురాలిని నేనే. నీకు ఘోరమైన అన్యాయం చేశాను. దానికే నీకాళ్లమీద పడి క్షమించమని వేడుకుంటున్నాను" అని లక్ష్మిపాదాలను తాకబోయింది. లక్ష్మి దగ్గరి వారించి "అయితే దొరసానిగారూ, నాపిల్ల నెక్కడ దాచారో చెప్పండి?" అని అడిగింది.

"నీకూ, శాంతమ్మగారికీ ఒకేసారి పురుడు వచ్చింది. నీకు పురుడు వచ్చేసరికీ శాంతమ్మగారు కన్నారు. ఆవిడకు చచ్చిపోయిన శిశువు పుట్టింది. రాకరాక కానుపు వచ్చింది. వచ్చింది వచ్చినట్లుగానే చచ్చిపోయిన శిశువును కన్నది. శిశువును చూసుకుని ఆవిడ ఎంతో దుఃఖించింది. నీకు ఎంత కావాలన్నా ఇస్తాను; నాబిడ్డను బతికించు అని ఎంతో దీనంగా వేడుకున్నది. నాకు ఆతల్లి దుఃఖం చూడగానే గుండె కరిగిపోయింది. ఇంతలో నీగదిలో పిల్ల కెవ్వుమనటం వినిపించింది. పురుడురాగానే పసిపిల్లల బొడ్డు కోసి స్నానం చేయించి, పాపలందరినీ మూడు పూటల దాకా మేమే పెంచుతాం. గుర్తుకోసం పాపలకాలికి తల్లి పేరు రాసిన చీటీ దారంతో కడతాం. పురుడు వచ్చినాక నీకు మత్తువదలలేదు. సొమ్మసిల్లి సోయ తప్పివున్నావు. అప్పుడు ఈ పాపాత్మురాలు ఏం చేసిందనుకున్నావ్? నీ శిశువుకాలికి శాంతమ్మగారి పేరు కట్టి పడుకోబెట్టి శాంతమ్మగారి చచ్చిన శిశువును నీపక్కన పడుకోబెట్టాను. ఇదంతా పైవాళ్లెవరూ చూడకుండా రెప్పపాటులో చేశాను. నీకు స్మృతివచ్చాక నీపిల్ల పోయిందని శోకం పెట్టావు. తన పిల్ల చచ్చిపోయినా, ముద్దులుమూటగట్టే పసిపాప పక్కలోకి వచ్చిందని శాంతమ్మగారు పొంగిపో

యారు. ఆసుపత్రినుంచి ఇంటికి వెళ్ళేనాడు నన్ను చాటుగా పిలిచి ఇదుగో ఈ ఆరువందల రూపాయలు లంచమిచ్చాడు. అప్పటినుంచీ వాటిని నేను ముట్టుకోలేదు. నాపాపమంతా వాటిలోనే దాగి నన్ను క్షణ క్షణమూ శూలంతో పొడిచేది. ఇదుగో లక్ష్మీ, ఈ డబ్బు నువ్వు తీసుకో. దానితో నీబిడ్డలు సుఖపడితే నాపాపం కొంత శమించినట్లే. నామాట వినవూ? తీసుకోవూ?

"శారదా! విన్నావమ్మా నేను చెప్పినదంతా? నన్ను ఏవగించుకుంటున్నావుకదూ? నీకు నేను పిశాచిగా కనబడటంలేదూ? అవును తల్లీ, పాపమెరుగని పసిమనసులకు నావంటి పాపాత్ములు భూతాలుగా కనబడరా మరి? కాని నిన్నొక్కటి వేడుకుంటున్నాను తల్లీ, ఒక్కసారి నేను వినేట్లుగా లక్ష్మిని 'అమ్మా' అని పిలూ; చెవులారా విని నేచేసిన పాపం కొంత శమించిందని పొంగిపోతాను. శారదా, నిన్ను మీ అమ్మనుంచి ఎడంచేసిన పాపిని నేను. మరొక పరాయిస్త్రీని తల్లిగా భావించి భ్రమపడేట్లుచేసిన పిశాచిని నేను. ఇదుగో ఇప్పుడు నిన్నూ, మీ అమ్మనూ ఒక్కచోటికి చేర్చాను. ఏ చేతులతో మిమ్మల్నిద్దరినీ విడదీశానో ఆ చేతులతోనే మిమ్మల్ని కలిపివేస్తాను. లక్ష్మీ, ఇదుగో నీ బిడ్డ. నువ్వు తొమ్మిదినెలలూ మోసిన బిడ్డ. ఇన్నేళ్ళనుంచీ నీకు ఎడమయింది. ఆ ఆపేక్ష అంతా ఒక్కసారిగా తీర్చుకో" అని మార్గరెట్ ఆగిపోయి కళ్ళు తుడుచుకుంది.

ఉన్న కుదుటిలోనుంచి ఒక్కసారిగా పెకలించి ఎక్కడికో విసిరివేసినట్లు శారద స్తంభించిపోయింది. అంతా శూన్యంగా కనబడుతోంది. పధ్నాలుగేళ్ల బతుకూ పేకమేడలాగా, నీటిబుడగలాగా ఆ శూన్యంలో కలిసిపోతోంది. "నా తల్లీ, నాతల్లీ!" అని లక్ష్మి శారదను రెండుచేతులతోనూ పసిపిల్లలాగా ఎత్తుకుని ముద్దులతో ఉక్కిరిబిక్కిరయేట్లు చేసింది. లక్ష్మి ఆనందం చూస్తున్నకొద్దీ మార్గరెట్‌కు కన్నీరు ఆగటంలేదు. తను తల్లీపిల్లలను విడదీయటంవల్ల ఎంత పాపం చేసిందో ఆ క్షణంలో గ్రహించగలిగింది. అక్కడ నిలవలేక వడివడిగా వెళ్లిపోయింది. శారదా, లక్ష్మీ ఎంత బతిమాలినా వెనక్కు తిరగనైనాలేదు. ఆ పాపాన్ని కడిగివేయగల శక్తి కన్నీటి కున్నదా అనుకుంటూ వెళ్లిపోయింది.

గోడమీద వేలాడుతున్న శాంతమ్మగారి ఫోటో ఒక్కసారి కదిలి "అమ్మయ్యా!" అని నిట్టూర్చినట్లు వినిపించింది. ఏదో మోయలేని బరువు కిందికి దింపినట్లు! ఆ బొమ్మకేసి చెమ్మగిలిన కళ్లతో చూస్తున్న శారద అప్రయత్నంగా "అమ్మా" అని పిలిచింది. అమాంతంగా లక్ష్మి వచ్చి శారదను గట్టిగా కౌగిలించుకుంది. తన కౌగిలి నింకెవరు సడలింపగలరు? తన బిడ్డ నింకెవరు దొంగిలింపగలరు? తమ నింకెవరు ఎడం చేయగలరు?



# నవసంధ్య

●

=శ్రీ వేమూరి వేంకటరామనాథం=

మొయిలుముట్టక యారవోసిన వెన్నెలల్
సాగిసాగని చిఱుచాయ లవిగో
రాలిన తెలివెదురాకుల పాన్పుపై
గలగల మ్రోగెడు గాలివాలు
వేకువసతి కొనవ్రేలి పసుపునీట
తడిసిన నీరెండ పొడలచలువ
వ్రాలిన యెలదేటి వరుసల తనియింప
జాలులై సోనలై రాలు తేనె
పసుపువన్నెల పరువులపైన దొరలె
నీలితెలికెంపురంగుల పూలనరులు;
పైడిపూతలు పన్నిన పట్టుపైట
దాల్చె వనలక్ష్మి నవ్యసంధ్యాంగణమున.

సురలోకభామినీ చుంబితకేకినీ
సందోహ మందలాస్యమ్ము లవిగో
బృందావనోద్యాన వీథీ సుధాపాన
మత్తబంభరరవోన్మాద మదిగో
విద్యాధరీస్నిగ్ధ బింబస్మితోన్మత్త
పికలోకగీతికానికర మదిగో
గంగాతటరసాల ఖాదనోత్సుకశీల
శుకపుటాగతనవాశువులు నవిగో
నిత్యకల్యాణకుసుమమందిరనికుంజ
సానుజీవనశోభాప్రసార మదిగో
వెలది, వనమెల్ల నందనబింబమయ్యె
నుషాదర్శణమున.

# సౌందర్యమును కుటుంబములో నిలబెట్టుట

"మా అమ్మ నీకు ఫోటోలో కనబడుచున్నంత సౌందర్యవతిగాయుండేది. గాని యేఫోటోలు అయినను ఆమె చర్మలావణ్యమును చూపలేవుకదా" అని ఆ తల్లి చెప్పుచున్నది. ఆ తల్లి కూడా చర్మసౌందర్యమును -అంత అద్భుతముగా నిలబెట్టుకున్నది. తన కుమార్తె కూడా అల్లా చేయవలెనని ఆమె కోరిక. తన కుటుంబపు సౌందర్యమును కాపాడుకొనే రహస్యమును, పియర్సు సబ్బును నిర్మలమైననటితో వాడే నిధానమును, తన కుమార్తెకు శ్రద్ధగా బోధించినది ఈ బోధన సౌందర్యమును కుటుంబములో తరతరాల నిలచి వుండేటట్లు చేస్తుంది.

ఇండియాలో నలభై సంవత్సరములనుంచి అందమైన స్త్రీలు ప్రత్యేకముగా పియర్సునే వాడుచున్నారు. దీని పరిమళము, మృదువైన నురుగు దీనికి సబ్బులలో ప్రాముఖ్యత ఇచ్చినవి.




# పియర్సు సబ్బు

శాశ్వతముగా సౌందర్యమును కాపాడుటకు

TG. 40-172 TL

A. & F. PEARS, ISLEWORTH, ENGLAND

# జనపదములు



= శ్రీ వేదురుసోమయాజుల వరహాలు =

జనపదము అనగా జనులు నివసించే తావు. ఊళ్లు, గ్రామాలు, నగరాలు యిత్యాదులన్నీ యీ జనపదములు అన్న శీర్షిక క్రిందికే వస్తాయి. ఇవి ప్రపంచక మంతటా వున్నాయి. వివిధదేశాలలో నివసించే జనులు వారివారి భాషలలో వారివారి జనపదాలను వివిధములుగా నిర్దేశిస్తున్నారు. 'హేమ్‌లెట్' (Hamlet), 'విలేజ్' (Village), 'టౌన్'(Town), 'సిటీ' (City) యిత్యాదులు ఆంగ్లేయుల జనపదములు. గొండా, గాం, బస్తీ, షహర్, నగర్, పూర్ యిత్యాదులు భారతదేశమునందలి వివిధరాష్ట్రాలవారి జనపదములు. ఇట్లే తదితరఖండాంతరవాసుల జనపదములును గలవు. ఈజనపదములు యెప్పుడు పుట్టాయి, ఎలా వృద్ధిచెందేయి, అప్పటి జనులు వాటికి చేసిన నామకరణాలు యేమి నిర్దేశిస్తున్నాయి అన్న విషయాలు తెలుసుకోవాలంటే ముందుగా ఆ జనపదాలను సృష్టించి, పెంచి, పోషించి, తుదకు లయంకూడా చేస్తూవున్న జనుల సంగతి కొంత తెలుసుకోవడం ఆవశ్యకం.

కేవలం అగ్నిగోళంగా యీ మన భూగోళం వున్నప్పుడు అందెట్టి జీవాణువూ నివసించియుండలేదు. ఆ మహాగ్నిపుంజం క్రమంగా చల్లారి వాసయోగ్యమైనపిమ్మటనే అందు జీవాణువు ఆవిర్భవించి, క్రమపరిణామం చెంది తుట్టతుదకు మానవాకృతి దాల్చింది. అట్లు మొట్టమొదట భూమిపై జీవాణువు ఆవిర్భవించి వర్ధిల్లిన ప్రదేశము మధ్యఆసియాలోని పామీరుపీఠభూమేకానిండు, లేక ఉత్తరధ్రువపరిసర ప్రదేశమేకానిండు ఆ వాదములతో ప్రస్తుతం మనకు పనిలేదు. ఈసందర్భంలో మనం ముఖ్యంగా గ్రహించవలసిన విషయంమాత్రం ఒకటి వుంది. అదేమిటంటే? జీవాణువుయొక్క క్రమపరిణామంవల్ల రూపొందిన ఆ మొట్టమొదటి మానవుడు (Primitive man)ఒక్క ఆకారమునతప్ప తదితరవిషయాలలో కేవలం పశుప్రాయుడుగానే వుండేవాడు. బుద్ధివికాసము ఈషణ్మాత్రంకూడా వానికి లేదు. అడవిపంటే వానికి ఆహారం. ఆ ఆహారాన్ని సమకూర్చుకోడానికి తన శరీరాంగాలే పరికరాలు. వాతావరణముల తాకుడు తట్టలతో గ్రలూ పర్వతగుహలే వానికి అభిరక్షు. వేయేల? 'కరతలభిక్షం తరుతలవాసం' చేస్తూ పర్యటనచేసే దిగంబరి మూడుమూర్తులూ వాడే. అందువల్ల ఆకాలంలో ఆ మానవుడు నిత్యపర్యటన చేసే మహారణ్యామే మొత్తముపై ఒక జనపదముగాని ప్రత్యేకించి యిది జనపదము అనడానికి అవకాశం లేకుండాపోయింది. ఆ మానవుడు క్రమంగా పరిణామం చెందుతూ కొంతకొంత బుద్ధివికాసం కలిగి తన్ను ఆవరించుకొనివున్న పంచభూతములూ, వాటి శక్తిసామర్థ్యములూ గ్రహిస్తూ ప్రకృతిసంపదలను తనకు అనుభవవేద్యములుగా చేసుకొనుటకు అనువగు సాధనసంపత్తిని, పరికరములను సమకూర్చుకొని, వ్యవసాయమునకు దిగినతోడనే వాని నిత్యపర్యటనజీవితమునకు (Nomadic age) స్వస్థిరనివాసమునకు ప్రారంభం అయింది. ఆనాడే భూమిపై ప్రత్యేకించి యిది జనపదము అని నిర్దేశించడానికి అవకాశం కలిగింది. కృషిప్రారంభం పర్యటనజీవితాన్ని అరికట్టి స్థిరనివాసం ఒకటి నెలకొల్పడమేకాకుండా ఆనాటి మానవుడు తాను క్రొత్తగా అవలంబించిన వృత్తిలో సహాయపడుటకు కొంత పశుగణమునుకూడా సమకూర్చుకొనుటకు కారణ

భూతమైనది. అందువల్ల పంటకుతోడు పాడియు రేకెత్తినది. ఈకారణములచేత సాగుకూ, తానూ తన పశుసంపదా సుఖముగా జీవించుటకూ అనువైన తృణ, కాష్ఠ, జలసమృద్ధములగు తావులను చూచుకొని అక్కడనే ఆమానవుడు నివసించుటకు తలకొనుటచేత మొట్టమొదట జనపదము వెలసినది.

ఈవిధంగా రేకెత్తిన జనపదాలు క్రమంగా అభివృద్ధిపొందేయి. ఆ పరిణామకాలంలో వాటివాటి అభివృద్ధులలో గల అంతరాలను నిర్దేశిస్తూ వాటికి వివిధములగు నామకరణాలు ఆయాకాలాలలో ఆయా జనులచేత చేయబడ్డాయి. ఆనామకరణాలు కొన్ని మార్పు చెందీ, కొన్ని యథాతథంగాకూడా నేటికీ వ్యవహారంలో నిలిచి వున్నాయి. వాటినన్నింటినీ సేకరించి పరిశోధించి అందు నిగూఢంగా యిమిడివున్న ప్రాచీన వ్యవహారాలనూ, విజ్ఞానాన్నీ ఆవిష్కరించుకోవడమే మన ప్రస్తుతకర్తవ్యం.

మన భారతదేశం, మొదటినుండీ వివిధజాతుల వారికీ లొంగిపోయి వారి పాలనలక్రింద యేండ్లతరబడి వుండుటంవల్ల నానాజాతులవారి సంప్రదాయాలూ మన జనపదవాచకములలో నిండి నిబిడీకృతమైనాయి. మరియు మన దేశములో వివిధభాషలతో, వివిధ రాష్ట్రాలలో నివసించువారి ప్రత్యేక సంప్రదాయములుకూడ ఆ జనపదవాచకములలో సమ్మిళితములై యున్నాయి. వ్యక్తికి యింటిపేరు, పేరు అన్న యుగం వున్నట్లే జనపదాలకుకూడా ఒకరెండు నిర్దేశవాచకములు కవగూర్పబడివున్నాయి. అందొకటి ఆ జనపదముయొక్క కుటుంబమును, వేరొకటి దాని ప్రత్యేకనామకరణమును సూచించును. ఉదాహరణ: 'విజయనగరము.' ఇందు 'విజయ' అను పదము ప్రత్యేకనామకరణము. 'నగరము' అనునది ఆ జనపదముయొక్క కుటుంబసూచకము. మార్పులు యీ రెండు పదములకూ కలిగినవి. అందు కుటుంబసూచకములైన 'నగరము' యిత్యాదివాచకముల క్రమపరిణామంగురించే ప్రస్తుత వ్యాసంగాని ఆ ప్రత్యేకనామకరణలలో గలిగిన మార్పులనుగురించిమాత్రం కాదని ముందుగానే మనవిచేసుకుంటున్నాను. ఈ ద్వివిధములైన వాచకములలోని మార్పులకూ రెండు ఉదాహరణాలుమాత్రం విశదపరిచి అసలు విషయంలో ప్రవేశిస్తాను. మొట్టమొదట తురుష్కులు హైందవుల దివ్యస్థలమైన 'కాశీ'లో కాలుపెట్టిచూడగానే అక్కడ అంతా వైరాగ్యం, వేదాంతం తప్ప ఆప్యాయనమైన దారూ, ప్యారీలు మచ్చుకైనా వారికి కనబడలేదు (ఇప్పుడు కొల్లలుగా వున్నాయిలెండి). అందువల్ల వారికి ఆ జనపదము ప్రీతిగాక వారు దానిని 'బినారస్' అన్నారు. వారి భాషలో రస్ అనగా రసము; బినా అనగా లేనిది—అనగా రసవిహీనమైనది అని భావము. అప్పటినుండీ మన కాశీ 'బినారస్'గా మారి ఆంగ్లేయుల ఉచ్చారణసంపర్కంవల్ల 'బెనారస్'గా వికృతిపొంది నిలిచింది. ఇట్లే హస్తినాపురము ఢిల్లీగాను, కాళీఘట్టము కలకత్తాగాను, మాదిరాజుపట్నం మదరాసుగాను పరిణమించేయి. యింకా యిత్యాదులు వున్నాయి. ఇవి జనపదముల ప్రత్యేక నామకరణలలో కలిగిన మార్పులు. ఇట్టివాటితో యీ వ్యాసంలో పనిలేదు. మన అయోధ్యాపురమును తురుష్కులు 'ఫైజాబాద్' అన్నారు. ఫైజ్ అనగా పూర్వీకులు; ఆబాద్ అనగా నెలకొల్పిన తావు అని అర్థం. ఈ తురుష్కుల సంపర్కంచేతనే మన భారతదేశములో అప్పటికి అమల్లోవున్న జనపదవాచకముల జాబితాకు 'ఆబాద్'లు అన్న ఒక క్రొత్త వాచకం జమఅయింది. అప్పటినుంచీ భారతభూమిలో అలహాబాద్ (అల్లా + బాద్), అహమ్మదాబాద్, హైదరాబాద్, ఔరంగాబాద్ యిత్యాదిజనపదములు నెలకొన్నాయి. ఇట్టి కుటుంబసూచకపదములలోని విజ్ఞానాన్ని ఆవిష్కరించు ప్రయత్నమే ఈవ్యాసము.

ఈ జనపదాల నిర్మాణంలో మన ప్రాచీనులు తదితర యేజాతివారికీ తీసిపోరుసరిగదా, వాళ్లందరికంటేకూడా ఒకఆకు హెచ్చే చదివేరు. ఏమంటే, మన తెలుగునాట వున్నన్ని జనపదసూచకవాచకాలు మరి యేభాషవారికీ వున్నట్లు నాకు కనబడలేదు.

అందులో కొన్నింటిని వుదాహరిస్తున్నాను చూడండి -గూడెం, పల్లి, పాలెం, పేట, ఊరు, వాడ, పాడు, ఆడ, వలస, కోట, గ్రామము, వీడు, ప్రోలు, కటకము, నగరము, పురము, పట్టణము, అగ్రహారము, వరము యిత్యాదులు. వీటినన్నింటినీ పర్యాయపదా (Synonyms)లని ఒక్కమాటతో కొట్టివెయ్యడానికి యెంతమాత్రం వీలులేదు. అవి అన్నీ మన జనపదాల క్రమాభివృద్ధిని, వాటిలో వాటికి కల అంతరాలను సూచిస్తున్నాయి. ఆంగ్లేయుల హేమ్లెట్, విలేజ్, టౌన్, సిటీ అన్నవన్నీ సిననిమ్సు కావు. "నవ్విన పట్నాలౌతాయి" అన్న సామెతలో వున్న ఊరు-పట్నం అన్న రెండూ పర్యాయపదాలని ఎవరూ అనలేరు. విప్రవరులు నలదమయంతులను అన్వేషించిన రీతిని ఆంధ్రకవిత్వవిశారదుడైన నన్నయభట్టు యెట్లు చెప్పెనో చూడండి.

చక్రమునం గల
నగర, మహాగ్రామ, పక్కణంబులు కలయన్
జగతీదేవోత్తము లి
మ్ముగ రోసిరి నిఖిలదేశముల కరిగి వడిన్."

(భారతం, అరణ్య. ౨-౧౪౧)

నగరములు, మహాగ్రామములు, పక్కణములు అని మూడుతరగతులుగా జనపదములు అప్పటికే అన్ని దేశాలలోనూ అమల్లోవున్నట్టు స్పష్టంగా వ్రాసేడు. ఇందు పక్కణము అనగా బోయపల్లి అని అర్థము. ఇచ్చట దిగుముఖక్రమంలో (Descending order) పూర్తిగా వికసించిన పుష్పాలుగా నగరాలను, అరవిరి కుసుమాలుగా మహాగ్రామాలను, కేవలం కోరకాలుగా పక్కణాలను సూచించేడు. ఈ నగరము, మహాగ్రామము, పక్కణము అన్న జనపదవాచకాలు అన్నీ పర్యాయపదాలే అయివుంటే నన్నయ ఆ విధంగా వ్రాసివుండేవాడే కాడు. ఈ కారణములవల్ల పైన ఉదాహరించిన జనపదవాచకాలన్నీ పర్యాయపదాలు కావనీ, వాటిలోవాటికి కొద్దోగొప్పో అంతరమంటూ ఒకటి వుందనీ నిర్ణయించి అసలువిషయంలోకి దిగుతాను. ప్రస్ఫుటంగా వున్న మన జనపదవాచకాలను కొన్నింటిని గ్రహించి వాటిని అయిదు తరగతులుగా విభజించేను.

## ౧. గున్న లేక గుడ్డి

మన దేశమున మన్యప్రాంతాలలో అక్కడక్కడ చిన్నచిన్న కొండవాళ్ల వాసస్థానాలు కనబడుతున్నాయి. అంటే అవి కొండలపైనున్న, బాగా వ్యవహారణలోవున్న చిన్నచిన్న జనపదాలకంటే కూడా భిన్నమైనవి. మహావుంటే ఒక్కొక్కచోట నాలుగైదు గడ్డిగుడిసెలు, అందు కొందరు ఆటవికులు కనబడతారు. వాళ్లని "ఇదేం వూరు? దీని పేరు?" అని అడిగితే "జౌను. లచ్చంనొరగున్న, ఫిమంనొరగున్న, జోన్నగుడ్డి, గంటిగుడ్డి" అని యిత్యాదిపేర్లు చెబుతారు. అంతకు మినహా గాటి సంగతి యితర ప్రపంచకానికి యీ యిరవయ్యోశతాబ్దంలో కూడా తెలియదు. ఇట్టి 'గున్న', 'గుడ్డి' అన్న మాదిరి జనపదాలే ప్రప్రథమంలో మన ఆంధ్రదేశమున వెలసియుండును. ఆ నామకరణలే అనుశ్రుతంగా ఆ మన్యప్రాంతాలలో అమల్లో వుంటున్నాయి. 'గున్న'శబ్దం ప్రథమావస్థను సూచిస్తుంది. మొదట 'గున్న'అని పేర్కొనబడిన చెట్టే పిదపపిదప పెరిగి పెనుమ్రానుగా వ్యవహరింపబడుతోంది. మొదటి ఏనుగుగున్న తరువాత మత్తకరిగా పరిణమిస్తోంది. ఇక 'గుడ్డి'అన్న మాటకు వ్యవహారంలో 'సాగులో వున్న మెట్టుభూమి' అన్న అర్థం కనబడుతోంది. నేటికీ యీ గున్నలలోను, గుడ్డిలలోనూ నివసించే జనులు ఆటవికజాతికి చెందిన సవరలు, కోదులు, చెంచులు, గదబలుగానే కనబడుతున్నారు. ఈకారణాలచేత అట్టివాటినే మన తెలుగునాట మొట్టమొదట లసిన జనపదాలుగా గ్రహించడం సమంజసమని నా వూహ.

## ౨. గూడెము

గూడెము అనగా కొండదొనను ఆశ్రయించి వుండే ఒక చిన్న జనపదము. గున్నలు, గుడ్డిలు పర్వతాలపై ఉండేవి. ఈ గూడెం అన్న జనపదము వెల

కొన్న కాలానికి మానవుడు కొండదిగి వ్యవసాయము నకు ప్రారంభించినట్లు తోస్తోంది. భారతదేశంలో వున్న ఓఢ్రులు, వంగీయులుకూడా వ్యవహరించే 'గొండా' అనే జనపదం యీ మన గూడేనికి సరి పోలుతుంది. గూడెంలో గృహనిర్మాణం గున్నగుడ్డె లలోకంటే భిన్నమైన పరిణతి చెందినట్టు తోచదు. ఉదా: గంపలగూడెం, పందులగూడెం యిత్యాదులు.

## 3. పల్లి

పిమ్మట వెలసినది పల్లి. పల్లి అనగా గుడిసె అని అర్థం. గృహనిర్మాణంలోగాని, జనపదనిర్మా ణంలోగాని పైవాటికంటే విశేషం యేదీ యీపల్లి లలో కనబడదు. గుడిసెల సంఖ్యమాత్రం పెరిగినట్టు గోచరిస్తోంది. దీనికే 'పల్లె'అనికూడా ఒక రూపాం తరం. పిల్లి అని ఒక భ్రష్టరూపంకూడా కనబడు తోంది. ప్రాచీనగ్రంథాలలో యీపల్లిలను విస్తారంగా బోయపల్లి, భిల్లపల్లిగా పేర్కొనివుండడం చూస్తే ఆయాజాతులవారు వాటిని వెలకొల్పినట్టు గ్రహించ వలసివుంది. ప్రస్తుతం అగ్నికులక్షత్రియుల మని చెప్పు కొనుచున్న పల్లిజాతివారికీ యీ పల్లికీ యేమైనా సంబంధం వుందేమో విచారణీయం. ఉదా: రేపల్లి, ఆలుగుపల్లి, మామిడిపల్లి యిత్యాదులు.

## ౪. పాలెము

పైవాటికంటే యీపాలెం అనే జనపద ములో మన ప్రాచీనులు గుడిసెలు నిర్మించడంలో ఒక వరసా వాడీ పాటించినట్టు స్పష్టమాతోంది. అసలు యీ 'పాలెము' అన్నది 'పాళెము' అన్నదానికి రూపంలాగు గోచరిస్తోంది. 'పాళెము' అన్న మాటకు చిన్న జనపదము అని అర్థము. అది 'పాళి'శబ్దభవము. 'పాళి' అనునది 'పాళి' శబ్దముయొక్క రూపాం తరము. పాళి యనగా వరుస యని అర్థము. అందువల్ల పాలెములో గుడిసెలు ఒక వరసదీర్చి నిర్మించబడినట్లు తేలుతోంది.

## ౫. ఊరు

ఊరు అన్న మాటకు తడి అని అర్థం. అందు వల్ల యీ రకపు జనపదములు బాగా పల్లపుప్రదేశ ములలో వెలకొనినట్లూ, ఉడుపుభూములు (Wet Lands) ఉడుపుపంటలు యీ జనపదము వెలకొన్న కాలానికి బాగా అభివృద్ధిచెందినట్టూ గోచరిస్తోంది. ఉదా: పావులూరు, పాటూరు, గూనూరు యిత్యాదు.

పైన ఉదాహరించిన అయిదురకముల ప్రథమా వస్థకు చెందిన జనపదములు క్రమాభివృద్ధి చెందుతూ అంతకంతకు మధ్యను అంతగా యెడములేకుండా ఒక దానికి సమీపంలో మరియొకటి వెలకొని క్రమంగా రెండూ కలిసిపోయి ఒక్క జనపదముగా కొన్నికొన్ని చోట్ల యేర్పడినవి. అట్టి సందర్భములలో అట్లు యేర్పడ్డ పెద్దజనపదమునకు ఆ కలిసిపోయిన మొదటి రెండింటి పేర్లూ కలిపి వ్యవహరణ ప్రారంభమై 'పల్లె టూరు' (పల్లి + ఊరు), పల్లెపాలెం, పల్లెగూడెం యిత్యాదులు వెలసినవి. ఇట్టివాటిని కవల (Twin) జనపదములుగా గ్రహించవలయును. ఇక్కడి కివి పక్కణాలుగా నన్నయ సూచించిన కోరకావస్థకు చెందిన తెలుగునాటి జనపదములు. వీటినే కుగ్రామ ములుగాకూడ కొందరు చరిత్రకారులు వర్గీకరించి యున్నారు.

ఇది ఒకతరగతి. ఇంక రెండవతరగతి. కాల గర్భంలో క్రమపరిణామం చెందుతూ యీ కోరకా వస్థ దాటి మన జనపదములు యెట్లు పరిణమించినదీ ఈతరగతిలో చూడవనగును.

## ౧. గ్రామము

మొదటి తరగతిలో పేర్కొనబడిన గున్న, గుడ్డె, గూడెం అన్న జనపదాలే క్రమాభివృద్ధి గాంచి గ్రామాలుగా తయారైనాయి. మన 'గూడెం'తో సన్నిహితమైన 'గొండా' అనే జనపదాన్నే మొట్ట మొదటి జనపదముగా గ్రహించి ఓఢ్రులూ వంగీ

యులూకూడా పిమ్మటిది 'గ్రాం'గా చెబుతూ 'గొండా-గ్రాం'అని ఒక క్రమం యేర్పరించేరు. ప్రత్యేకముగా చేయబడ్డ నామకరణతో అత్తి యీ గ్రామము అనిగాని, 'గ్రాం'అన్న గ్రామముయొక్క సంక్షిప్తరూపంతోగాని నేటికీ వ్యవహారంలో వున్న తెలుగునాటి జనపదము యేదీ నాకు కనబడలేదు. కాని ఒరిస్సా, బీహార్, బెంగాల్, మధ్యపరగణా లలో యిట్టి జనపదములు చాలా కనబడుతున్నాయి. ఉదా: జాడుగ్రాం, సాలిగ్రాం, సేవాగ్రాం యిత్యాదులు. ఈ 'గ్రాం' అన్నదానికి భ్రష్టరూపమో, రూపాంతరమో 'గాం'అనికూడా ఒకటి కనబడుతోంది. ఉదా: బాలుగాం, రాజనందగాం యిత్యాదులు. ఇట్టివి మన తెలుగునాటకూడా కనబడుతున్నాయి. ఉదా: బెలగాం, నందిగాం యిత్యాదులు. మన తెలుగునాట యీ 'గాం' అన్నదానిలోని 'గ' కారముకూడా లుప్తమై 'అం' అన్న అనుస్వారాంతమే గ్రామశబ్దమునకు సూచనగా నిలిచినట్లు 'రాజాం', 'సిగడాం', 'బొద్దాం', 'కురపాం'యిత్యాది జనపదములవల్ల గోచరిస్తోంది. ఈ గ్రామములు నెలకొన్న తరువాత జనపదవిస్తీర్ణమును నిర్ణయిస్తూ గ్రామకంఠము, పొలిమేర అనునవి నెలకొన్నట్టుకూడా తెల్లమౌతోంది.

## ౨. పాడు-పూడి

నేటికీ మన తెలుగునాట అమల్లోవున్న 'పల్లె-పాడు' అన్న క్రమాన్నిబట్టి చూస్తే యీ'పాడు' అన్నది అభివృద్ధిగాంచిన పల్లెగా గోచరిస్తోంది. పల్లెలు బాగా పల్లపునేలలలో అలముకొన్నట్టు యిదివరకే సూచించేను. పాడు అనగా పాటినేల అనికూడా అర్థం వున్నది

"ఏ పాడేకానీ మఱి
యేపెన్నగరైన బ్రతుకకేలేని గడవనీ
యోపిక తగ్గు న్నెల్లగ
నూపిరిపై దీపి తలుగుచుండు న్విదపన్.

కోరుకొన్న కెంపుకోపుగంగాళముల్
మాటలల్లువాని తేటబ్రాత
యీవు నేను వేడ్క నెనయగల్గిన పాడు
తోడ నీకు కాదు దొరల మేడ"

(శ్రీమదజ్ఞా దిభట్ట నారాయణదాసు గారి అచ్చతెనుగు ఉమరుకైయాము-రుబాయిలు ౧౫-౨౫ పుట.)

ఇందు మొదటిపద్యమున పాడునకు నగరము తోడి న్యూనత సూచింపబడినది. ఉత్తది, శూన్యము అన్న అర్థములు చెప్పబడినవి. ఇంకనూ వ్యంగ్యంగా రెండవ పద్యంలో 'పాడు' అన్నదానికి 'కూరు బ్రతుకు' సూచింపబడింది. మేడలతో ఒప్పే నగరములలోని జీవితముకన్నా ఆ చెప్పిన పరిస్థితులలో మారుమూలకూరుజీవితమే శ్రేష్ఠతరముగా చెప్పబడుతోంది. మేడలు అన్న గరిష్ఠమైన నాగరికవాసస్థానములకు కనిష్ఠమైన 'పాడు'వాసస్థానము తైపారువేయబడినది. మేడ గరిష్ఠమైనప్పుడు దానికి కనిష్ఠము 'మిద్దె' గావలసి యుండును. 'పాడు'శబ్దమునకు పాటినేల, శూన్యము అన్న అర్థములు, మేడలతోడి కనిష్ఠత చెప్పబడుటచే యీ 'పాడు' అన్న జనపదములలో అంతకు ముందు అమల్లోవున్న పూరిగుడిసెలు పూర్తిగా పోయి నాటి స్థావరములలో పాటిమట్టిబోడిమిద్దెలు నెలకొన్నట్లు స్పష్టమౌతోంది. ఉదా: మోకాలుపాడు, దుత్తపాడు యిత్యాదులు. ఈపాడుశబ్దభవమో, రూపాంతరమో, వైకల్పికమో 'పూడి' అనికూడా ఒకటి వ్యవహారంలో నున్నది. ఉదా: గంగుపూడి, కూచిపూడి యిత్యాదులు.

## 3. పేట

ఇది బాగా తీర్చిదిద్దిన 'పాలెము'గా గోచరిస్తోంది. పేట అనగా హారములో ఒక సరము. ఈ జనపదములో యిండ్లు సరముమాదిరిగా ఆకారము తీర్చి నిర్మించినట్లు గోచరిస్తోంది. ఉదా: అంబాజీ పేట, సీతమ్మపేట యిత్యాదులు.

## ౪. వాడ-ఆడ

వాడ అనునది క్రమపరిణతి గాంచిన మొదటి తరగతి 'ఊరు'. అందువల్లనే వ్యవహారంలో "ఊరు-వాడ"అన్న క్రమం యేర్పడ్డది. వాడ అనగా వీథి అని అర్థము. అనగా ముఖాముఖిగా నున్న రెండు యిండ్ల వరుసల మధ్యప్రదేశము. పైన చెప్పిన హారములోని సరమువలె ఒంటిపేటగా ఇండ్లు నిర్మింపబడిన 'పేట' మాదిరిగాగాక వీథులు తీర్చి నిర్మింపబడిన జనపదము యీ'వాడ'. ఉదా: గుడివాడ, విజయవాడ యిత్యాదులు. ఈ వాడను వైకల్పికమో, రూపాంతరమో 'ఆడ'అనికూడా కనబడుతోంది. ఉదా: వేపాడ, వెలగాడ, కలగాడ యిత్యాదులు.

మొదటితరగతిలోవలె యీ రెండవతరగతిజనపదములుకూడా ఒకదానికి సమీపములో ఇంకొకటి నెలకొని కవలలుగా పెంపొందినను గ్రామకంఠము, పొలిమేర అనునవి యేర్పడియున్నందున తమతమ ప్రత్యేకతను గోల్పోక ఒక్క సామీప్యమునుమాత్రమే సూచించు జంటనామములతో నేటికీ అమల్లో వున్నవి. ఉదా: బల్లంకిబానాది, పాటూరుబొద్దాం, విజినగిరితానారం, వసితిమిడి యిత్యాదులు. ఈరెండవ తరగతినే చరిత్రకారులు 'గ్రామములు'గా వర్గీకరించేరు. ఏకారణమువనో నన్నయభట్టు యీవర్గమును విసర్జించి కుగ్రామములైన పక్కణములనుండి మహాగ్రామములకే దాటివేసినాడు.

ఇంక మూడవతరగతి. మొదటితరగతిజనపదములు క్రమపరిణామం చెంది రెండవతరగతిలో ఉదాహరించిన జనపదములుగా వెలిసినట్టులే ఆ రెండవ తరగతిజనపదములు అభివృద్ధిగాంచి యీ మూడవతరగతిగా పరిణమించినవి. ఈ అభివృద్ధి సూచించుటకే వీటిని మహాగ్రామములక్రింద నన్నయ వర్గీకరించినాడు. అంతేగాని యీ మహాగ్రామము అన్న పేర జనపద మేదీ మన తెలుగునాటనేకాదు, అఖిలభారతమునందుగూడ కనబడలేదు.

## ౧. కోట

ఇది అభివృద్ధిచెందిన 'పేట'. ఇందు ముఖ్యముగా కలిగిన మార్పు కోట ఒకటి నెలకొన్నది. ముందుగా ఒక కోట నిర్మింపబడి దానిచుట్టూ ఒక పేట నిర్మింపబడినది. అప్పటినుండే "కోట - పేట" అన్న వ్యవహారం కలిగింది. ఉదా: సామర్లకోట, ధరణికోట, తల్లికోట యిత్యాదులు.

## ౨. వీడు

ఇది పరిణతిగాంచిన 'వాడ.' కోటలు నెలకొన్న సెమ్మట [illegible] సిబ్బందులు నివసించుటకుగాను ప్రత్యేకముగా నెలకొల్పబడిన జనపదము యీ 'వీడు'. వీడు అనగా దండు, శిబిరములు అని అర్థము. ఇవి యించుమించుగా ప్రస్తుత కంటోన్మెంటుల (Cantonments) తో సరిపోలివుండును. ఉదా: కొండవీడు, నూజవీడు యిత్యాదులు.

## 3. ప్రోలు

ఇది పెంపుగాంచిన 'పాడు'. కోట అగడ్తచేత అతిదుర్గమమైనదిగా నిర్మింపబడిన జనపదము. ఉదా: చేబ్రోలు, రాయప్రోలు యిత్యాదులు. దీనికి 'ఓలు' అన్న రూపాంతరంకూడా గోచరిస్తోంది. ఉదా: ఒంగవోలు, రాజోలు, బిక్కవోలు యిత్యాదులు.

## ౪. కటకము

ఇది ఒక రాజధాని జనపదము (Royal Head-quarters). పైన ఉదాహరించిన కోట, ప్రోలు, వీడు అనువాటిలో కోట, సిబ్బందులు ఉన్నప్పటికీ రాజు, అనగా పాలకుడైనవాడు విధిగా అందుండునన్న నియామకము లేదు. అందు విధిగా రాజప్రతినిధు లుండేవారు. 'కటకము' లో రాజు విధిగా కాపురముండునని తెలియుచున్నది. ఉదా: ధాన్యకటకము, కటకము యిత్యాదులు.

నాల్గవతరగతి:—పైన విశదీకరించిన కవలజనపదములమాదిరిగానే పై రెండుమూడుతరగతుల జనపద

ములు కవగూర్చబడి రూపొందినవి నాల్గవ తరగతి జన పదములు. ఇందు రెండుకంటె హెచ్చు జనపదములు కవగూర్చబడియుండుటచేత అన్నింటి నిర్దేశవాచకములూ సమసించుటకు సాధ్యముగాక వేరునిర్దేశవాచకములు నెలకొల్పబడినవి. అట్లయ్యును అందు అంతర్భాగములుగా కవగూర్చబడినవాటికి వాటివాటి నిర్దేశవాచకములనే యథాతథంగా నిల్పియుంచిరి. అందువలన యిచ్చట అవగాహనకు కొంత క్లిష్టత యేర్పడి, మన జనపదవాచకములలో కొన్నిగాకున్న కొన్నియైనా పర్యాయపదములా అన్న భ్రమ కలుగుతోంది. వాటిని యీ క్రింద ఉదాహరణలతో విశదపరుస్తాను. ఈ నాల్గవతరగతిజనపదములనే చరిత్రకారులు, నన్నయభట్టుకూడా బాగా వికసించిన ప్రస్ఫులుగా నగరములన్న పేర వ్యవహరించేరు.

## ౧. నగరము

ఇది విశేషపరిణతిగాంచిన కటకము. ఈ 'నగరము' అన్న జనపదము రెండుమూడుతరగతులకు చెందిన జనపదముల సంపుటి. అందువల్ల యిందలి అంతర్భాగములకు పేట, కోట, వాడ, వీడు, ప్రోలు, కటకము యిత్యాదినామము లుండును. ఆ కారణముల చేత ప్రాచీనగ్రంథములందలి పుర, నగరవర్ణనలలో ముందుగా ఒక నగరమును బేర్కొని, పిమ్మట పేట, అక్కటకమున, అవ్వాడ, ఆపేట అని ప్రాచీనకవులు వ్యవహరించినది అందలి అంతర్భాగముల నుద్దేశించిగాని పర్యాయపదములుగామాత్రము కాదని నా పాయము. ఇటి అభిప్రాయమునకు నేను వచ్చినది ఒక పదిమంది ప్రాచీనకవులు చేసిన నగరవర్ణనలను గైకొని అతిజాగరూకతతో పరిశీలించిన పిమ్మటనేగాని లాకాయిలూకాయిగా చెప్పినది మాత్రము కాదని వినయపూర్వకముగా విన్నవించు కుంటున్నాను. ఆ ప్రస్తారమునంతటినీగాని, ఫలితములనుగాని పూర్తిగా యిందు వివరింప వీలులేదు. క్లుప్తముగామాత్రము నా పరిశోధనాఫలితములను మనవి చేసుకుంటున్నాను. పేట, కోట, వాడ, వీడు యిత్యాదులు నగరవర్ణనలలో పేర్కొనినప్పుడు వాటికి కొన్ని ప్రత్యేకలక్షణములను ప్రాచీనులు సూచించిరి. అట్టి ప్రత్యేకలక్షణములను అందరును ఏకరీతినే రూపించిరి. చతురంగబలములను, ముఖ్యముగా యుద్ధభటులను వర్ణించినప్పుడే 'వీడు' శబ్దమును ప్రయోగించిరి. ఇంకను యిత్యాదు లున్నవి. నగరము అనగా రాజాంతఃపురపరిసరము అని అర్థము. నగరి, నగరు అనికూడా వ్యవహరణ లున్నవి. ఉదా విద్యానగరము, గజపతినగరము యిత్యాదులు.

## ౨. పురము

ఇది పెరిగి పెద్దదైన 'ప్రోలు'. మిగతవిషయములన్నియు నగరమునకువలె నుండునని గ్రహించునది. ఉదా: పీఠికాపురము, పెద్దాపురము యిత్యాదులు.

ఈ నగరము, పురము అన్న జనపదములే 'నగర్', 'పూర్' అన్న మార్పులతో అఖిలభారతమునందును కలవు. ప్రాచీనగ్రంథములలో యీ రెండింటినీకూడా కలగుచ్చిన పట్టులుకూడ గలవు. అట్టి తావులలో బహుజాగ్రత్తగా అన్వయించుకోకపోతే యివి పర్యాయపదములన్న భ్రాంతి క లు గ క మా న దు. మచ్చుకు అట్టివి రెండు ఉదాహరణలుమాత్రం చూపి విడుస్తాను.

> "అల వైకుంఠపురంబులో
> నగరిలో నామూలసౌధంబు"

అన్నప్పుడు వైకుంఠ మనే పురములో గల నగరు, అనగా రాచనగరు, రాజాంతఃపురపరిసరము అని భావము.

> "ద్వారకానగరంబు నేరీతి జొత్తును...
> ...........................
> అనుచు నాద్వారకాపుర మతడు సొచ్చె."

యిందును 'ద్వారకానగరంబు' అన్నప్పుడు ద్వారకాపురమునందలి రాజాంతఃపురముగా గ్రహించవలయునేగాని పురము, నగరము పర్యాయపదములుగా చెప్ప వీలులేదు. ఈ పురములో నగరములు అన్న

జనపదముల మిళాయింపులు నేటి మదరాసు సిటీలో జార్జిటౌను మాదిరిగా నుండును. అంతమాత్రమున సిటీ, టౌను సిననిమ్మనగా చెప్ప వీలులేదు. తిక్కన సోమయాజిగారు యీ నగరము, పురము అన్న వాచకములకు భేదం పాటించకుండా పర్యాయపదములుగానే వాడేరు. ప్రతీజనపదానికీ ప్రత్యేక నామకరణ, కుటుంబ సూచక వాచకము అన్న యుగ్మం వుంటూ వున్నా విరటరాజుగారి నగరానికి ప్రత్యేక నామకరణ భారతంలో ఎక్కడా చెప్పబడియుండలేదు. వూరికే విరటుని నగరము అనిమాత్రం వ్రాసేరు. దానిని వారు నగరముగను, పురముగను కూడా వర్ణించేరు.

"వారు మరియు నూళ్లు సొరక యడవి తెరువుల నడచి విరాటునగరంబున కనతిదూరంబగు కొంతా రమ్మున

"అప్పుర మిచ్చుటచ్చటను నాసలవచ్చితి."

"నే డప్పురంబు సొత్తమని తలంచి"

"పురంబు సమీపభూమికిన్"

"పురము దృగ్గోచరమగుటయు"

"పురము ద్రుపదకన్యక సొచ్చెన్."

ఇంకను యీనగరానికీ, పురానికీ గల తారతమ్యం బాగా యిదమిత్థమని నిర్ణయించడానికి తగిన ప్రమాణములు నాకు లభ్యంకాలేదు. ముఖ్యముగా యీ రెండింటి విషయం. వాటిని పర్యాయపదాలే అంటారో, లేక వేరంటారో పెద్దలు మరి!

## 3. పట్టణము

పైన చెప్పబడిన నగర, పురముల లక్షణములే దీనికీ వర్తించును. ఉదా: చెన్నపట్టణము, విశాఖపట్టణము యిత్యాదులు. ఇందు పైవాటికంటే చెప్పతగ్గ విశేషములు రెండు కలవు. మన జనపదవాచకములలో కొన్ని యథాతథంగాను, కొన్ని స్వల్పమార్పులతోను అఖిలభారతమునం దంతటా గోచరిస్తూవున్నవి గాని యీ పట్టణ మనునదిమాత్రం అఖిలభారతమునందేగాదు, ప్రపంచకములో మరియెక్కడాకూడా లేదు. అది కేవలం ఆంధ్రుల ప్రత్యేకవాచకం. మన తెలుగునాట వున్న పట్టణాలు అన్నీ సముద్రతీరపు రేవు స్థలములుగా గోచరించడంచేత మన ఆంధ్రుల నౌకావ్యాపారం మంచి దశలో వున్నప్పుడు యీ పట్టణశబ్దమునకు రేవుస్థలం అన్న అర్థం వుండివుంటుంది. ప్రస్తుతంలో కొన్నికొన్ని పట్టణాలకు సముద్రము కొన్ని మైళ్ల దూరములో వున్నప్పటికీ పూర్వము దాని సమీపములోనే సముద్రము వుండియుండును, కాలగర్భంలో కలిగిన పాటుపోటులవల్ల అట్టి పరిస్థితి కలిగియుండవచ్చును అనుటకు ఆక్షేపణలు లేవు. ఇక లెక్కకు యేఒకటిరెండు పట్టణములోమాత్రం ఆంధ్రదేశమధ్యస్థమున కనబడుచున్నవి. వాటికిన్ని సమీపంగా పూర్వం సముద్రముండే దనడం సాహసం. కాని అట్టివాటికి ఆ పట్టణనామకరణం కొన్ని పొరపాట్లవల్ల కలిగినట్టూ, అట్టివి ప్రాచీన జనపదములుగాక యిటీవల నెలకొల్పబడినట్టూ తెల్లమౌతోంది. అదొక పెద్దవిషయం. ఆ పరిశోధనాఫలితాలన్నీ యిందు పొందుపరచ వీలులేదు. ఒకటిరెండు సూచించి విడుస్తాను. ఆంగ్లేయులు మన దేశములో ప్రబలినతరువాత వారు వారి సిబ్బందులకుగాను నెలకొల్పిన కంటోన్మెంటునకు అర్థం పర్థం, మంచీ చెడ్డా తెలుసుకోకుండా ఏ తమిళసోదరుడో 'దండుపట్నం' అని అనువదించివేసేడు. కంటోన్మెంటు అను ఆంగ్లజనపదమునకు సిసలైన తెలుగువాచకము 'వీడు' గాని దండుపట్నం అనునది పొరపాటు; శుద్ధతప్పు. అప్పటినుండీ దండుపట్నం అన్న పట్నాలు కొన్ని భూమధ్యమున వ్యవహరింపబడినవి. రెండవది మన పురములు, నగరములు కొంచిన పెంపువిస్తీర్ణములకు, అనగా 'మధుర'లకు (Suburbs) నామకరణలు గావించునప్పుడు మనవారే నిగూఢంగా యీ మన జనపదవాచకములలో ఇమిడియున్న గంభీరవిజ్ఞానం గుర్తెరుగకుండా చిత్తమొచ్చినరీతిని పట్టణములనీ, నగరములనీ అర్థంలేని నామకరణలు యిటీవల చేసివేసేరు. అందువల్ల కొత్తపట్టణం, పాతపట్టణం మొదలైనవి రేకత్తేయి. విశాఖపట్నంజిల్లా శృంగవరపుకోట

తాలూకా యేజన్సీలో కాకిసట్నం అన్న జనపదం ఒకటి కనబడుతోంది. దానిని ఆప్రాంతీయులు నూటికి నూరుగురు కాశీపుర మనే వ్యవహరిస్తున్నారు. విజయనగర సంస్థానంరికార్డులలో అది చాలాచోటకు కాశీపురముగనే వున్నట్లు విన్నాను. అందువల్ల దానికి ఆ పట్టణశబ్దం యిటీవల తగిలించబడి వుంటుంది. యింకను యిత్యాదులు వున్నాయి.

౫-వ తరగతి:—ఇట్లు కుగ్రామ, గ్రామ, మహాగ్రామ, నగరములుగా క్రమాభివృద్ధి పొంది మన జనపదములు పూర్ణవికాసము గాంచినవి. అప్పటికి తెనుగురాజ్యాలు బాగా స్థిరపడి మంచి ఉచ్ఛదశలో వెలిగినవి. అప్పుడు రాజులు వారివారి వితరణబుద్ధి చేతను, లలితకళలయందలి యభిమానములచేతను, ధర్మార్థకామమోక్షములందలి ఆసక్తి చేతను, యింకా యిత్యాదికారణాలచేతను కొన్నికొన్ని వసతులు కొందరికి కొందరికి బహుమానములుగాను, జీవనాధారపు మాన్యములుగను దానపట్టాలు వ్రాసి యివ్వడం, ఆయాప్రజలు ఆయాస్థలములలో చిన్న చిన్న జనపదములు నెలకొల్పుకొని సుఖజీవనం చెయ్యడం మన చరిత్రలు చెబుతున్నాయి. ఈ విధంగా యేర్పడిన జనపదాలు దరిమిలావి అగుటచేత వాటిని ఈ అయిదవతరగతిక్రింద ఉదాహరిస్తున్నాను.

## ౧. అగ్రహారము

వేదాధ్యయనసంపన్నులు, శాస్త్రపారంగతులు, పండితులు, కవులు మున్నగు బ్రాహ్మణులకు వారి వారి ప్రజ్ఞాప్రకర్షలకు మెచ్చి శాశ్వతజీవనోపాధిగా రాజులు కటాక్షించిన వసతులు యీ అగ్రహారములు. ఇట్టి స్థలములలో నెలకొన్న చిన్నచిన్న జనపదములకు వాటి పరిణతికి అనువగు జనపదవాచకములకు వెనుక అగ్రహారము అను పదము జతపరిచి వ్యవహరించుట ప్రారంభమైనది. ఉదా: చామలాపల్లి అగ్రహారము, కొత్తకోట అగ్రహారము, రామస్వామిపేట అగ్రహారము యిత్యాదులు.

## ౨. వరములు

ఇవి కేవలం బ్రాహ్మణులకేకాక తదితరవర్ణములవారికికూడ రాజులు వారు యుద్ధసమయములలోనూ, తదితర అవసరములలోనూ చేసిన సాయమునకు మెచ్చి వరములుగా బహూకరించినవి. ఉదా: ధర్మవరం, చోడవరం, రామవరం యిత్యాదులు.

## 3. పెంటలు

ఇవి కొన్ని వృత్తులు చేసుకొని బ్రతికేవారికి రాజులు జీవనోపాధిగా కటాక్షించిన వసతులు. వాటిని ఆ కాలములలో 'పెంటలు' అని వ్యవహరించేవారు. ఈ పెంట అన్నది పేటకు రూపాంతరముగాకూడా వ్యవహరింపబడివుంది. ఉదా: పురిటిపెంట, పాచిపెంట, పెంటూరు యిత్యాదులు.

## ౪. వలస

పూర్వకాలమున తాము చేసిన నేరములకు దండవిధాయి విధించిన దండనానుసారం కొందరు తమతమ స్వస్థలములు విడిచి పరదేశములలో నివసింపవలసి వచ్చుటవలనను, ఇంకా వ్యాపారము మున్నగు యితరఅవసరములచేతను జనులు అన్యప్రదేశములలో నివసింపవలసివచ్చినప్పుడు యేర్పడిన జనపదములు వలసలుగా పేర్కొనబడుచున్నవి. ఉదా: కొత్తవలస, జొన్నవలస, చింతలవలస యిత్యాదులు.

విషయం ఒక బ్రహ్మభేద్యమైనది. నేను కేవలం ఒక జిజ్ఞాసువును. ఏదోరీతిగా ఆవగింజలో అరపాలు తెలుసుకోగలిగేను. ఈ అల్పకృషిలోనూ నా లోపాలోపాలు క్షమించి, ఉన్న మంచినే గ్రహించమని యావదాంధ్రలోకానికీ వినయవినమిత మస్తకంతో విన్నవిస్తున్నాను.

# చంద్రభూషణ క్రియాశక్తి



= శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

'చంద్రభూషణక్రియాశక్తిరాయలకడఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు' అని శ్రీనాథుఁడు చెప్పుకొనియున్నాఁడు. చంద్రభూషణక్రియాశక్తి యెవ్వరు? రాయ లెవ్వరు? వారికడ శ్రీనాథుఁడు సార్వభౌమబిరు దెప్పుడు నెలకొల్పెను? అట్లు పాదుకొల్పిన యవసర మెద్ది? అను విషయములు విచారణీయములు. శ్రీనాథుని చరిత్రను రచియించినవారందఱును పై సీసపాదమునఁ బేర్కొనఁబడిన 'రాయలు' క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకు విద్యానగరమును బాలించిన ఇమ్మడిదేవరాయలనియు, నితని రాజ్యకాలముననే శ్రీనాథుఁడు విద్యానగరమునకుఁ బోయి యచట రాయల యాస్థానమున చంద్రభూషణక్రియాశక్తిసముఖమునఁ గవిసార్వభౌముఁడైన గౌడడిండిమభట్టు నోడించి రాయలచేఁ గనకాభిషేకమును వడసి సార్వభౌమబిరుదు నందెననియు నభిప్రాయపడియున్నారు. సుప్రసిద్ధవాఙ్మయవిమర్శకులును, నాంధ్రగీర్వాణవిద్యావిశారదులును నగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు దమ శృంగారశ్రీనాథ మను గ్రంథమునందు ఇట్లు వ్రాసియున్నారు:

"అష్టదిగ్విజయపటహీకృతబిరుదడిండిమాడంబరులును, గవిసార్వభౌములును నగు ద్వితీయతృతీయడిండిమభట్టారకులు కర్ణాటాధీశ్వరుల యాస్థానకవీశ్వరులని కనుగొంటిమి. ద్వితీయడిండిమభట్టారకుఁడు క్రీ. ౧౪౪౬ వఱకుఁ గల్గు ప్రౌఢదేవరాయలయొద్దను, దృతీయడిండిమభట్టారకుఁడు క్రీ. ౧౪౯౦ ప్రాంతములఁ గల్గు సాళ్వగుండనరసింహరాయలయొద్దను గలరని తెలిసికొంటిమి. కర్ణాటాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయని దర్శింపఁగాఁ గొండవీటి నుండి శ్రీనాథుఁడు విద్యానగరమున కరిగెను...తరువాత రాయలు సభఁ గూర్పించెను. రాయల సన్నిధిని శ్రీనాథునకును డిండిమభట్టారకునకును వైరము వర్ధిల్లెను. కవితావిషయమున వారిరువురును విజిగీషువులై వివదించిరి...శ్రీనాథునకును డిండిమునకును జరిగిన వివాదమునఁ జంద్రభూషణక్రియాశక్తి రాయలనువారు మాధ్యస్థ్యము జరిపినవారు కాఁబోలును. "చంద్రభూషణక్రియాశక్తి రాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు" అన్న చరణమున కర్థము పైవిధముగా నుండునని నే ననుకొనుచున్నాఁడను. చంద్రభూషణక్రియాశక్తిప్రసక్తిలోఁ గొండూరుశాసనము జదువవలసినది......క్రియాశక్తిస్వామిశిష్యుఁడయిన చంద్రభూషణాచార్యునికిఁ గర్ణాటాధీశ్వరుఁడగు బుక్కరాయఁడు శిష్యుఁడని దానివలనఁ దెలియుచున్నది. ఆశాసనము క్రీ. ౧౩౪౯ లో నెలకొల్పఁబడినది. శ్రీనాథుని కాలమునకు సరిపడునది కాదు. ఆకాలమునఁ గర్ణాటాధీశ్వరులకు గురువులుగాఁ గాశీవిలాసక్రియాశక్తి ప్రభృతులు క్రియాశక్తిపదలాంఛను లుండిరి. వారి పరంపరలోఁ బ్రౌఢరాయలకాలమునఁ గూడ నొక చంద్రభూషణక్రియాశక్తి కలఁడేమో!

"వివాదమున డిండిమభట్టారకుఁ డోడిపోయినట్టు మాధ్యస్థ్యము నెరపిన పండితుఁడు నిర్ణయించెను" ఇత్యాది.[1]

శ్రీ ప్రభాకరశాస్త్రిలవారి తీర్మాన మంగీకరింపఁదగినది కాదు. శ్రీనాథుఁడు దర్శింపఁబోయినది

1. శృంగారశ్రీనాథము, పుటలు ౧౮౧-౮౨.

'క్రై). ౧౪౪౬ వఱకు గల్గు ప్రౌఢదేవరాయలు'ని నిశ్చయించిచెప్పుటకు ఆధారము లెవ్వి? 'లక్ష్మీశోపేంద్ర ప్రౌఢరాయక్షితీంద్ర' 'ప్రౌఢ దేవేంద్ర రాయ భూపాలవరుని సమ్ముఖంబున దయఁ జూడుముమ్మ సుకవి' అను శ్రీనాథుని చాటూక్తులే యగునా? అగునేని యవి శ్రీనాథుఁడు దర్శించినది క్రై). ౧౪౪౬ వఱకుఁ గల్గు(ఇమ్మడి) ప్రౌఢరాయలనని నిర్ధారించుటకు సాధకములు గాఁజాలవు. క్రీ. శ. ౧౫-వ శతాబ్దమున ప్రౌఢదేవరాయ నామాంకితులు నలుగురు రాజులు విద్యానగరమున రాజ్యమొనర్చిరి. ప్రథమప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౦౪ వఱకును రాజ్యపాలన మొనర్చిన రెండవహరిహరరాయల కుమారుఁడు. సామాన్యముగ శాసనములయం దితని పేరు దేవరాయలనియే కానవచ్చుచున్నను ప్రౌఢ దేవ రాయలని ఇతనిఁ బేర్కొను శాసనములు లేకపోలేదు. 2 రెండవప్రౌఢదేవరాయలు మొదటి ప్రౌఢదేవరాయల మనుమఁడు; విజయరాయల పుత్రుఁడు. క్రీ.శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకు నితఁడు రాజ్యముజేసెను. మూఁడవ ప్రౌఢదేవరాయలు రెండవ ప్రౌఢదేవరాయల కుమారుఁడు. ఇతని వాస్తవమైన పేరు మల్లికార్జునరాయలు; పెక్కుశాసనము లితని ముమ్మడిప్రౌఢదేవరాయ లనియే పేర్కొనుచున్నవి. క్రీ. శ. ౧౪౪౬ మొదలు ౧౪౬౫ వఱకు నితఁడు ప్రభుత్వమునల్పెను. నాల్గవ ప్రౌఢదేవరాయలు రెండవ విరూపాక్షరాయల కుమారుఁడు; ఇతఁడు క్రీ. శ. ౧౪౬౫ ప్రాంతమున విద్యానగరసింహాసనము నధిష్ఠించెను. ఇతనినే సాళువగుండ నరసింహరాయల పక్షమున నరసానాయకుఁడు విద్యానగరమునుండి వెడలనడచి కర్ణాటకసామ్రాజ్యమును స్వాధీనము గావించుకొనినది.

పైఁబేర్కొనఁబడిన ప్రౌఢదేవరాయలు నలుగురిలో శ్రీనాథుఁడు దర్శించిన దే ప్రౌఢదేవరాయలనో కనుగొనవలసియున్నది. శ్రీనాథుఁడు కొండవీటిని పాలించిన యనవేమారెడ్డి కాలమునుండియు రాజమహేంద్రవరము నేలిన వేమవీరభద్రారెడ్ల యవసానకాలము వఱకును రెడ్డిరాజుల నాశ్రయించియుండెనని యాతని గ్రంథములవల్లఁ దెలియుచున్నది. తరువాతఁ గూడ కొంతకాలము జీవించియుండెనని 'కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి' యను నతని చాటువువల్ల విదితమగుచున్నది. అనవేమారెడ్డి క్రీ. శ. ౧౩౮౧ ప్రాంతమున కొండవీటిగద్దెనెక్కెను; క్రీ. శ. ౧౪౩౭ తరువాత వేమవీరభద్రారెడ్లు రాజ్యముచేసినట్లు నిదర్శనము లెవ్వియుఁ గానరావు. కావున క్రీ. శ. ౧౩౮౦ మొదలు ౧౪౫౦ పర్యంతము శ్రీనాథుఁడు జీవించి యుండెనని మనము స్థూలముగ నిర్ధారించవచ్చును.

ఇట్లు నిర్ణీతమైన యీనూటయేండ్లకాలమున విద్యానగరమున పైఁబేర్కొనఁబడిన ప్రౌఢదేవరాయ నామాంకితులు నలుగురిలో మువ్వురు ప్రభుత్వమునల్పుచుండిరి. ఈమువ్వురిలోఁ గడపటివాఁడగు ముమ్మడి ప్రౌఢదేవరాయలు క్రీ. శ. ౧౪౪౬ లో సింహాసనము నధిష్ఠించియుండుటచేతను, అప్పటికే శ్రీనాథుఁడుముసలివాఁడై దూరమున నుండిన విద్యానగరమునకు బయనముసేయు స్థితియం దుండకపోవుటచేతను అతఁడు దర్శించిన రాయలుముమ్మడిప్రౌఢదేవరాయలు గాఁడని మనము నిశ్చయించవచ్చును. ఇఁక మిగిలియుండువారిరువురు. వీరిలో నెవ్వరనుట ప్రస్తుతము చర్చనీయము. ఇంతవఱకు లభ్యమైన గ్రంథసామగ్రినిబట్టి ఈ యంశము స్పష్టముగఁ గనుగొనుటకు వీలుగాదు. సర్వత్ర దేవరాయలనియో, ప్రౌఢదేవరాయలనియో కానవచ్చుచున్నవి. అతఁ డిన్నవ దేవ,లేక ప్రౌఢదేవరాయలని గూనవాలుపట్టుటకుఁ దగు సాక్ష్యమెందును గానరాదు; కావున నీ విషయమును వేరుమార్గమున సాధించవలసి యున్నది. చంద్రభూషక్రియాశక్తి యెప్పటివాఁడో కనుగొనఁగలిగితిమేని ఈ విషయము నందుమూలమున నిశ్చయించవచ్చును. ఇతఁడు కొండూరుశాసనమునఁ బేర్కొనఁబడియున్నాఁడనియు, నది క్రీ. శ. ౧౩౪౯ నాఁటిదగుటచే నతఁడు శ్రీనాథుని కాలమువాఁడు గాఁడనియు శ్రీ ప్రభాకరశాస్త్రిలుగారు వ్రాసియున్నారు కదా. వారీశాసనకాలమును జక్కఁగ పరీక్షించక

2. ARE. 399 of 1926

పోవుటచే వారి కీయభిప్రాయము గల్గినది. అందు శాసనకాల మిట్లు చెప్పియున్నది:

"అథ నిజతపోరాజ్యే జగత్క్షేమంకరే జాగ్రతి కలికాలే ఏకసప్తత్యధికద్విశతాధికసహస్రాబ్దపరిమితే గతే సంవత్సరే పర్యాయస్య ద్వావింశత్యావర్తే సాధారణనామసంవత్సరే వర్తమానే శ్రావణ మాసే కృష్ణపక్షే చతుర్దస్యామిందువాసరే యతీంద్రస్య క్రియాశక్తిగురోః పర్వణే తస్యైదం క్రీతయే శ్రీ చంద్రభూషణాచార్యః......ప్రాదాత్."

ఈ శాసనకాలవిషయమును జర్చించుచు, బ్రహ్మశ్రీ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిలుగారి సమ్మాన సంపుటమున "కవిసార్వభౌముఁడు-కనకాభిషేకము" అను శీర్షికగల వ్యాసమున నిట్లు వ్రాసియున్నాఁడను: "కలికాలమున ౧౨౭౧ సంవత్సరములు గతించిన వెనుక చంద్రభూషణాచార్యులవారి తపోరాజ్యము జరుగుచుండఁగా క్రియాశక్తియతీంద్రగురునియొక్క ౨౨ది యగు పర్వదినమునకు సరియైన సాధారణసంవత్సర శ్రావణ బ. ౧౪ సోమవారమునాఁడు ములికినాటిమధ్యస్థితమైన కొండూరుగ్రామము నగ్రహారీకరించి యాచార్యులవారు బ్రాహ్మణుల కొసఁగిరని తెలియుచున్నది. ఇందు 'కలికాలే' యనునది ప్రమాదజనితము. 'శకకాలే' యని యుండవలయును. మఱియు శా. శ. ౧౨౭౧-వ చత్సరమునకు సరియైన ప్రభవాదివర్షము విరోధికాని సాధారణ కాదు. గణించిచూచిన సాధారణసంవత్సరమునకు సరియగు శకవర్షము ౧౨౯౨ అని తెలియవచ్చుచున్నది. కావున చంద్రభూషణాచార్యులు కొండూరు నగ్రహారీకరించి బ్రాహ్మణులకు దానముజేసినది శా. శ. ౧౨౯౨ నకు సరియైన సాధారణసంవత్సర శ్రావణ బ ౧౪ సోమవారమునాఁడు (౧౮ ఆగస్టు ౧౩౭౦).

"కలికాలే...పరిమితే గతే సంవత్సరే పర్యాయస్య ద్వావింశత్యావర్తే సాధారణనామసంవత్సరే వర్తమానే...యతీంద్రస్య క్రియాశక్తిగురోః పర్వణే" యనుటవల్ల సాధారణ శ్రావణ బ. ౧౪ నాఁడు క్రియాశక్తిగురుని ౨౨-వ యాబ్దికమని తెల్లమగుచున్నది. శా. శ. ౧౨౭౧ కి సరియైన విరోధిసంవత్సరమునకును, సాధారణసంవత్సరమునకును మధ్య ౨౨ యేండ్ల యెడ ముండుటచేతను, సాధారణసంవత్సరముతో క్రియాశక్తియతీంద్రునికి ౨౨ పర్వములు గడచుటచేతను, శాసనోక్తమైన శా. శ. ౧౨౭౧-వ సంవత్సరము పైఁజెప్పిన యాక్రియాశక్తిగురువుయొక్క శివసాయుజ్య సంప్రాప్తకాలమని తోఁచుచున్నది. ఆ సంవత్సరముననే చంద్రభూషణాచార్యులవారును తపోసామ్రాజ్య పట్టబద్ధులైయుండవలయును."

తరువాత కొంతకాలమునకు బ్రహ్మశ్రీ ప్రభాకరశాస్త్రిలవారిని గలుసుకొనినపుడు వారు నాచేఁ జేయఁబడిన కాలనిర్ణయము సరికాదని చెప్పిరి. ఇట్లే మిత్రులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారును నేఁజేసిన కాలనిర్ణయ మంగీకరింపఁదగినది కాదనియు, నద్దానికిఁ బ్రబలమగు నాక్షేపముగలదనియు నుడివిరి. ఇం... ...ప్ప విమర్శకు లామోదించకపోయినను, ...ండూరుతామ్రశాసనము గల్పితముగాకుండిన, నాచేఁ జేయఁబడిన కాలనిర్ణయమే సరియైన దను తలంపు నన్ను విడువదాయె. ఈతలంపు వ్యర్థమైనది కాదని చంద్రభూషణ క్రియాశక్తియొక్క మఱియొక శాసనమువల్ల నిశ్చయమగుచున్నది. ఇది బెంగుళూరు జిల్లా హొసకోటతాలూకా వోగటగ్రామములోని శివాలయమునందుఁ గలదు. శా. శ. ౧౩౦౦ సంవత్సరమున (అనఁగా క్రీ. శ. ౧౩౭౭-౭౮) వ్రాయించినది. ఇందు దక్షిణవారణాసిస్థిత స్వయంభూత్రియంబక దేవపాదారవింద సేవాసంసక్తుఁడును, కాశ్యపగోత్ర పవిత్రుఁడును.......మండలాచార్య సంస్థిచక్రవర్తి ఆచార్యవర్య యభంగరాహుత్తరాయాది బిరుదాంకితుఁడు నగు చంద్రభూషణదేవ ఒడయులవారు మరుదాడుగ్రామమునందలి కొంతభూమిని భాగీరథీపురమున విజయము జేసియుండిన వరదరాజస్వామియాలయమునకు దానము గావించినట్లు చెప్పియున్నది. ఈశాసనగ్రంథమునుగూర్చి కీర్తికాయులు మహామహోపాధ్యాయ ఆర్. నరసింహాచార్యులవా రిట్లు వ్రాసియున్నారు. "శాసనమున గొన్ని భాగములు మాసిపోవుట విచారకరము. చంద్రభూషణదేవ ఒడయలకు జెందు బిరుదావళి యాతఁ డొక గొప్ప యాచార్యుఁడని తెలుపు

చున్నది. రెండవ హరిహరరాయల గురువని పెక్కు శాసనములందు పేర్కొనఁబడిన క్రియాశక్తి యను సమకాలీనుఁడైన మఱియొక గొప్ప గురువర్యునికిఁగూడ స్వయంభూత్రియంబక దేవపాదారవిందసేవా సంసక్తుఁడను బిరుదు గలదు. వీరిద్దరును ఒక్కరని నేను తలఁచుచున్నాఁడను. మఱియు నీదేవాలయమునందే వచ్చెడు క్రీ. శ. ౧౩౮౮ నాఁడు వేయించిన ఇంకొక శాసనమున స్థానికుఁడు క్రియాశక్తిదేవుడు పేర్కొనఁబడియున్నాఁడు. ఇది నాచేఁజేయఁబడిన వ్యక్త్యైకీకరణమును బలుపుసేయుచున్నది."3

పై పోగట శాసనమునందలి చంద్రభూషణ ఒడయలే కొండూరుతామ్రశాసనమునందలి చంద్రభూషణక్రియాశక్తి. ఇద్దఱును కాశ్యపగోత్రపుత్రులే. ఇద్దఱును దక్షిణ వారాణసీస్వయంభూత్రియంబక శ్రీపాదపద్మారాధకులే. ఇద్దఱును యాచార్యవర్యయభంగరాహుత్తరాయాది బిరుదాంకితులే. మఱియు వారిరువురును నొక్కకాలమువారే. కొండూరును శా. శ. ౧౨౯౨ కు సరియైన సాధారణ సంవత్సరమున బ్రాహ్మణులకు చంద్రభూషణ క్రియాశక్తి దానము చేసెను; మఱి యెనిమిదేండ్లకు పిమ్మట శా. శ. ౧౩౦౦ సంవత్సరమున చంద్రభూషణదేవ ఒడయలు భాగీరథీపుర వరదరాజస్వామికి మరుదాడుగ్రామమున కొంత భూమిని దానముజేసెను. కావున చంద్రభూషణదేవ ఒడయలును, చంద్రభూషణ క్రియాశక్తియు నొక్కరే యగుదురుగాని భిన్నులుగారు.

మఱియు క్రియాశక్తి బుక్కరాయల సంతతి వారికి గురువైనట్లు గ్రంథములవల్లను, శాసనములవల్లను దెలియవచ్చుచున్నది.

బుక్కరాయల కుమారుఁడగు కుమారకంపణ ఒడయుల దేవియైన గంగాదేవి తన మధురావిజయమున—

"అసాధారణసర్వజ్ఞం విలసత్సర్వమంగలమ్,
క్రియాశక్తిగురుం వందే త్రిలోచనమివాపరమ్."

అని ప్రశంసించియున్నది. శా. శ. ౧౩౦౦ లకు సరియైన కాళయుక్తియందు వ్రాయించిన యొక శాసనమున రెండవ హరిహరరాయలు "విరూపాక్షసాక్షాత్కులపరమదైవం కులగురుక్రియాశక్త్యాచార్యకలికలభకంఠీరవయశః" అని చెప్పుకొనియున్నాఁడు.4 మఱియు శా. శ ౧౩౦౧ కి సరియైన సిద్ధార్థి (క్రీ. శ. ౧౩౭౯)నాఁటి దంబాలుతామ్రపట్టికలలో నిజగురువైన క్రియాశక్తిమూర్తియనుజ్ఞను బొంది గదుగ కీర్తినారాయణస్వామియాలయమునకు ౬౬ గ్రామములను దానముజేసినట్లున్నది.5 శా. శ. ౧౩౧౨ కు సరియైన శుక్ల నామసంవత్సరమున వ్రాయించిన యొక శాసనమున—

"ప్రాతాపేమ్మడిబుక్కభూప
క్రియాశకిరి
త్వ్యాఖ్యాతస్య గురో గుణ గోరివ
సతాం శక్రోభ్యదత్తక్రమాత్."6

అని యున్నది. ఇందువలన రెండవ హరిహరరాయల కుమారుఁడైన యిమ్మడి బుక్కభూపాలుఁడు సయితము క్రియాశక్తికి శిష్యుఁడని తెలియుచున్నది. శా. శ. ౧౩౧౯, ౧౩౨౦ నాఁటి రెండు తామ్రపట్టికలలో స్వయంభూత్రియంబక దేవపాదపద్మారాధకుఁడును రాజరాజగురుపితామహక్రియాశక్తిదేవుఁడు పేర్కొనఁబడియున్నాఁడు.7 మఱియు శా. శ. ౧౩౨౫ కు సరియైన స్వభానుసంవత్సరమునాఁటి శాసనమున విఠప్ప ఒడయరను రాయసామంతుఁ డొకఁడు దాను "శ్రీమత్క్రియాశక్తిగురుమునీశ్వరచరణకమలమరాళత్రియంబకపూజాధురంధరుఁడ"నని చెప్పుకొనియున్నాఁడు.7a శా. శ. ౧౩౩౨ కు సరియైన వికృతియందు వ్రాయించిన శాసనమున ప్రథమ(ప్రౌఢ)దేవరాయలు

"శ్రీ స్వయంభూత్రియంబకచరణారవిందారాధక శ్రీమద్రాయరాజగురుమండలాచార్య ఆచార్యవర్య అభంగరాహుత్తరాయ తపోరాజ్యలక్ష్మీనిజనివాసకాయ శ్రీ క్రియాశక్తిగురువరచరణపరిచరణప్రసా

---

3. మైసూర్ ఆర్కియలాజికల్ రిపోర్టు ౧౯౧౯. పారా ౮౭.

4. ఎపి. కర్నా. సం ౫. చెన్న ౨౫౬.

5. మైసూరు ఆర్కియలాజికల్ రిపోర్టు ౧౯౧౫ పారా. ౧౦౫.

6. ఎపి. కర్నా. సం. ౧౦ ముల్. ౧౧.

7. మైసూరు ఆర్కియలాజికల్ రిపోర్టు ౧౯౧౨ పారా ౯౯.

7 a. ఎపి. కర్నా. సం. ౮. తీర్థ. ౧౩౩.

దాసాదిత మహితసార్వజ్ఞసామ్రాజ్యవైభవ శ్రీమద్రాజాధిరాజపరమేశ్వర శ్రీ వీరప్రతాపదేవరాజమహారాజః"

అని ప్రకటించుకొనియున్నాఁడు.8

పై నుదాహరించిన శాసనములలో నొక వోఁగటు శాసనమందుతప్ప మఱిదేనియందును చంద్రభూషణాచార్యుని పేరు లేదు. "ఆ కాలమునఁ గర్ణాటాధీశ్వరులకు గురువులుగాఁ గాశీవిలాసక్రియాశక్తిప్రభృతులు క్రియాశక్తిపదలాంఛను లుండిరి" అని శ్రీ ప్రభాకర శాస్త్రిలవారు చెప్పియున్నారుకదా. పైశాసనములందు పేర్కొనఁబడిన క్రియాశక్తి యతఁడేల కాఁగూడదు? అను ప్రశ్న యొకటి బయలు వెడలవచ్చును. 'ప్రభృతుల' మాట యటుండనిండు. వారు నాకతీతులు. కాశీవిలాసనామధేయుఁడైన క్రియాశక్తిముని యొకఁడీకాలమున నుండెననుట వాస్తవము. బుక్కరాయల మంత్రులలో నొక్కఁడైన మాధవమంత్రి కితఁడు గురువని ఇతనిచే విరచితమైన సూతసంహితవ్యాఖ్యయందు కలదు.

"శ్రీమత్కాశీవిలాసాఖ్యక్రియాశక్తీశసేవినా
శ్రీమత్త్ర్యంబకపాదాబ్జసేవానిష్ణాతచేతసా." 9

మఱియు శా. శ. ౧౨౮౦ కి సరియైన కీలక సంవత్సరమున వ్రాయించిన శాసనమున "యః సాక్షాద్గిరిశావతారవపుషః కాశీవిలాసేశితుః" అనియు, "శ్రీమత్కాశీవిలాసక్రియాశక్తి శివదైశిక" అనియు రెండుపర్యాయము లితఁడు పేర్కొనఁబడియున్నాఁడు. 10 ఇంతకంటెఁ బ్రస్తుత మితనిగురించి మఱి యేమియుఁ దెలియదు. లభ్యమైన శాసనాదిసామగ్రిని బరిశీలించిచూడఁగా నితఁడు కర్ణాటాధీశ్వరులకు గురువని తలఁచుటకు లేశమైన నవకాశము గాన్పించదు; పైనుదహరింపఁబడిన శాసనములందు క్రియాశక్తికిఁగల బిరుదు లితనికి లేవు; చంద్రభూషణక్రియాశక్తికిఁ గలవు; కావున వానియందుఁ బేర్కొనఁబడిన క్రియాశక్తిమాని కాశీవిలాసుఁ డనుటకంటెఁ జంద్రభూషణుఁడనుట యుక్తము. కాశీవిలాసుఁడు క్రియాశక్తిమతమునకుఁ జెందిన సామాన్యశైవసన్యాసిగాని కర్ణాటాధీశ్వరులగురువు గాఁడు. అప్ప కర్ణాటాధీశుల కులగురువు చంద్రభూషణుఁడేకాని యన్యుఁడు గాఁడు. ఈపేరటి క్రియాశక్తి యొకఁడు రెండవ ప్రౌఢదేవరాయల కాలమున నుండెనేమో యని శ్రీ ప్రభాకరశాస్త్రిలవా రాశంకించిరి. దొరకినంతవఱకుఁ గల చరిత్రసామగ్రిని గాలించి చూచినను రెండవ దేవరాయల కాలమునఁ జంద్రభూషణ క్రియా శక్తి యెందునుగానరాఁడు. కావున రెండవదేవరాయలనే శ్రీనాథుఁడు దర్శించినదని మొట్టమొదట నొక నిరాధారపు సిద్ధాంతమును జేసికొని దానిని నిజముసేయుటకై యాతని కాలమున నొక చంద్రభూషణాచార్యుఁడుండియుండవలయునని వాదించుటకంటె చంద్రభూషణాచార్యులకు సమకాలికుఁడును, శ్రీ క్రియాశక్తిగురువర చరణపరిచరణ ప్రసాదాసాదితమహిత సార్వజ్ఞసామ్రాజ్యవైభవుఁడును నైన మొదటి దేవరాయలనే దర్శించెననుట సమంజసము.

కావున (౧) కొండూరు వోఁగటుశాసనములవలన మొదటిబుక్క, రెండవహరిహరరాయలకాలములో చంద్రభూషణక్రియాశక్తి యుండినట్లు తెలియవచ్చుటచేతను, (౨) పెక్కుశాసనములయందు చంద్రభూషణ క్రియాశక్తియొక్క బిరుదులే గల క్రియాశక్తిగురుఁ డొకఁడు విజయనగరరాజులకు కులగురువని చెప్పియుండుటచేతను, (౩) ప్రథమదేవరాయలు చంద్రభూషణాచార్యుల బిరుదావళినే గలిగిన క్రియాశక్తి గురువరచరణ పరిచరణ ప్రసాదాసాదితమహిత సార్వజ్ఞసామ్రాజ్యవైభవుఁడనని చెప్పుకొని యుండుటచేతను, (౪) శ్రీనాథుఁడు 'చంద్రభూషక్రియాశక్తి రాయలకడఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు' అని వచించియుండుటచేతను, (౫) రెండవ దేవరాయల కాలమున చంద్రభూషక్రియాశక్తి యను పేరు గలవా రెవ్వరును లేకపోవుటచేతను శ్రీనాథుఁడు దర్శించిన దేవరాయలు మొదటి దేవరాయలేయనియు, నతని సన్నిధినే యతని గురువర్యుఁడగు చంద్రభూష క్రియాశక్తి యొడయుల యాధిపత్యముక్రింద నడచిన విద్వత్సభలో శ్రీనాథుఁడు డిండిమభట్టారకు నోడించి సార్వభౌమపదమును, కనకాభిషేకమును బడసెననియు నమ్ముచున్నాను.

8. ఎపి. కర్ణా. సం ౧౧. దావణ. ౨౩.

9. సోర్సస్ ఆఫ్ విజయనగరహిస్టరీ, పుట ౫౧.

10. ఎపి. కర్ణా. సం. ౮ షికా. ౨౮౧.

# "హెచ్. ఎం. వి." రికార్డులలో

శారదా ప్రొడక్షన్స్

# "మాయాలోకము"

నుండి గీతములు

3 రికార్డులు N. 18766-8

SAMUEL.




'హెచ్. ఎం. వి.' వ్యాపారులయొద్ద దొరుకును.

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"

ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్,

డండం—బొంబాయి — మదరాసు — ఢిల్లీ — లాహోరు.

# ఇల వేలుపు

## శ్రీరామకృష్ణశాస్త్రి =

మనిషి మనిషిదీ ఓకత్త్వం. మనిషి - మనిషి! వేయిమంది మనుష్యుల పెట్టు స్వార్థం:

ఒక్కొక్క స్వార్థానికి..ఒక్కొక్క దేవుడు ఆ ఒక్కడికే ఇలవేలుపు.

...నీకు అభిరుచులు మాటిమాటి మారుతూం టేనేగాని, జీవితంలో తగినంత రుచీ - పచీ అనుభ వించలేవు.

అనుక్షణమూ మారుతూండకపోతే, నీ బ్రతుకూ అనేక బ్రతుకే కాదు. కాని, నీదేవుడికి ఆస్వాతం త్ర్యములేదు...ఒక మాట...ఒక బాణం...ఒక పత్ని.

నీకు నెత్తిమీది దేవతగా...నీ తీరని కోరికలకు అమర్త్య - లక్షణాలు...నీకు అనువైనంతవరకూ ప్రసాదించి..నీదైవాన్ని ఒకరూపంగా మూటకట్టావు. అది నీవు ఎట్లా ఆడించితే అట్లా ఆడవలసిన కీలు బొమ్మ...

ప్పులన్నింటికీ పూటకాపు నీదైవం... కాని ఆ అభాజనుడు, పొరబాటునన్నా తప్పుచేస్తే దండించకుండా దయతలచి విడిచిపెట్టిన పాపాన పోవు...

అసలు, నీతాళం తప్పింది: కాని, అడుగు తప్పు వేశాడని, చేతికి అందింది పుచ్చుకుని ఆ లేత కాలు విరిగేట్టు ఒక్కపెట్టు పెట్టావు ఆనాడు: కాని, అందరి పసిపిల్లలలాగా అయ్యో - మయ్యో అనేందుకు వీలులేదు ఆ అర్భకుడు. ఆలా కుంటుతూనే వ్యత్యస్త పాదారవిందుడుగా...నీవు ఆడమన్నట్టు ఆడితీరవల సిందే కాదా...తీర్థులూ...

దేవుడు దేవుంటనగా దేవుం డా సీమనుండి దిగి వచ్చేనా?...ఎదుట ఉన్నవాడే పెళ్లికొడుకు...అని అమ్మవారిని పడకగదిలో బిగించి...అర్ధరాత్రివేళ అశ్వ మేధపర్వం ఓండించి...నారాతే బ్రహ్మరాత అని రాజునూ, ప్రజలనూ బుకాయించిన మహానుభావుడవు నీవే కాదటయ్యా.

పక్కను జేరుక చెక్కిలినొక్కుచు చక్కగా సాక్కి యుండేవేళ...మీ ఆయనతో నను బ్రోవమని చెప్పవే అని అనుశాసించింది నీవేకావటయ్యా!... అంతఃపురంలో అణగి మణగి...ఆకాస్తైనా నీకు అందకుండా ఉందామన్నా, అక్కడైనా వాళ్లకు నీ అహంకారం, కడగండ్లు తప్పడంలేదు...కవీ, రవీ కానని చోట్ల సొంపు శోధించేందుకు ... నీవే తగిన మొనగాడవయ్యా!

ఔను, మరి. నీదేవుడు...కద్దన్నా, లేదన్నా ఆతడికి నీవే దిక్కు...మనుగడ.

నీదైవం కుయ్యాలించే దైవం. వాని తలదన్నిన వాడు - మరొకడు లేడు...

కాని... నీకూ నీదైవానికీ...గోవుకూ గోపాలు డికీ ఉన్న లంకె...ఈ అనుబంధం లేకపోతే, ఇద్దరూ ఉండరు...(అని నీకు తెలియదు.)

...ఇంతకూ, దేవుడూ మనిషివంటి వాడే నంటావా?...

*   *   *

ఇవన్నీ, మనం ఎవరమూ ఒప్పుకోని...ఒప్పుకో ...సంగతులు.

—దేవుడూ మనిషివంటివాడే!

...ఉన్నమాట కొస్తా అనేస్తే, వాళ్లకన్న నిజానికి, మనకే ఉలుకు ఎక్కువ: ఎందుచేతనంటే, అది మన నిర్వాహకత్వమాయెను!

దేవుడంటే...మనకు కోపం తెప్పించినప్పుడు శుద్ధదయ్యం!...పాపం, అది శక్తి నోరు-వాయ లేని పదార్థం మనం తినమన్నప్పుడల్లా తినాలి: పెట్టిన నగలన్నీ మోయాలి: మన పవళింపు-సేవముచ్చటలన్నీ తరువాత, అప్పుడు అమ్మవారిపక్కకు ఒత్తిగిలాలి: నిద్ర ఉన్నా లేకపోయినా, కోడి కూయక ముందే, మళ్లీ మేలుకుని కూర్చోవాలి: అన్నింటికీ కిక్కురుమనకుండా, సహించి, రాయిలాగా...నల్ల రాయిలాగా పడిఉండాలి: అలా ఉంటున్నా అద్దానికి ఒక్కొక్కనాడు చివాట్లు తప్పవు:

—ఎక్కడున్నాడయ్యా దేవుడు?—ఎక్కడా, మన నెత్తిమీద: నీవుకాని, నేనుకాని...దేవుణ్ణి ఇంకోచోట ఉండనియ్యం. నెత్తిన ఎక్కించుకు కూర్చుంటాము సంచన్ గా; అలుక వచ్చినప్పుడు ఎత్తికుదేసేందుకు వీలుగా-(ఆనుషంగికంగా ఇక్కడ ఒక విషయం ప్రస్తావించాలి: సంప్రదాయసిద్ధంగా... నెత్తిన ఎక్కించుకున్నవాళ్లు ఎవరైనా దేవతలే: సర్వసాధారణంగా ఆగౌరవం పెళ్లాం అనే వస్తువుకు దక్కుతూంది. అయితే, పెళ్లాం దేవత అయినప్పుడు, తల్లి దయ్యం కావలసిన అగత్యం ఉన్నదా అంటే... ఆహాం, ఓవిగంగా, ఉన్నదనే చెప్పాలి. దేవతకూ-దయ్యానికీ ఉన్న అవినాభావసంబంధాన్నిబట్టి, దేవత-దయ్యం, ఏకకాలమందు తనపెళ్లాం కాలేనప్పుడు...తనపిల్లల తల్లి కాకపోతే, తన గ అయినా దయ్యం అయితీరాలి అని సంప్రదాయం. లేకపోతే, లోకం బొటా-బొటిగా ఉండదు...ఇది యావత్తూ అప్రస్తుతం......)

* * *

—దేవుడులోంచి దేవతల్లోకి విస్తరించాము: ఇంత జనాభా ఎలా పెరిగిందయ్యా అంటే...నీ కులగోత్రాభివృద్ధినిబట్టి నీ యిలవేలుపులసంఖ్యకూడా వృద్ధిఅవుతూనేఉంటుంది: ఎవరి పంచె వారు కట్టుకున్నట్టు...ఎవరి చీరె వారు సింగారించుకున్నట్టు... ఎవరి దేవుడు వారికంటూ ఉండాలి: (అప్పుడప్పుడు, ముచ్చటకొద్దీ, వారిది వీరూ-వీరిది వారూ సింగారించుకున్నా, ఎల్లకాలమూ ఉంచుకునేందుకు వీలు లేదుకనుక ఎప్పటిదో అప్పుడు తిరిగి యిచ్చేసెయ్యాలి: ఇలా, వాడకెక్కువకావడంలో కొందరు దేవతలు అరిగి-చిరిగి చివరకు ఎందుకూపనికిరాకుండా పోతారు: కొంతమంది పాతబడి, అట్టడుగున పడిపోతారు: ఎల్లకాలమూ చెక్కుచెదరకుండా మన్నే దేవతలు ఎందరో ఉండరు. ఇక ఉమ్మడివాటి సంగతా?... అది అంత గణుతించవలసిన విషయం కాదు.)—(మునుపు ముక్కోటిదేవతలు ఉండేవారు: ఆతరువాత, లోకం యావత్తూ, మన జనాభా ఎంతో పెరిగింది ...మధ్యమధ్య ఎన్నో అవాంతరాలు వచ్చినవి: ఈ మధ్యనే అయిదారేళ్లపాటు పెద్ద యుద్ధంకూడా జరిగి నేల కొంతమేర తెరిపి అయిందట: ఇవన్నీ పారజూసుకుని, ఇప్పుడు, ఆలెక్కను వాళ్ల సంఖ్య పెరిగిందో, విరిగిందో తేల్చుకోవాలి. అది, ఎవరో పనీపాటా లేనివాళ్లు తీరుబడిగా తిని కూర్చుని గుణకారం చేయవలసిన విషయం.)

* * *

ఎక్కడివాడయ్యా దేవుడు?—ఎక్కడ ఉంటూ

ఎవరిని అడిగినా, ఎవరికి వారు, ఎవరికి తోచినట్లు వారు...చెపుతారు. అయితే, ఒకరన్నమాట ఇంకొకరికి పొసగదు. 'ఎందెందు వెదకిచూచిన అందందే కలడు' అని, దత్తకొడుకు, వాళ్ల నాన్నతో మొరాయించాడు: కాని అంతకు పూర్వం, 'క్రోడంబై పినతండ్రిని కూల్చిన' సందర్భంలో, వాళ్ల నాన్న ముల్లోకాలూ గద బుజాన వేసుకుని గాలించి చూసినా ఎక్కడా కనబడలేదు. తిరిగి తిరిగి విసివి-వేసారి చివరకు, 'పోనీ, ఎవడో అనామకుడు' అని ఊరుకున్నాడు. హరి హరీ అంటూ యింట్లో పిల్లవాడు అహోరాత్రములూ అదేపనిగా పోరు పెడు

తూంటే...' ఈ సచరాచరములకు నధీశుడౌచు నేనుండగ, ఈశున (రామానుజపురవాసుడు)సర్వేశుడు, వా, డెవడురా? హరి అనువా డెవడురా?' అంటూ నిజంగానే, తెలియక అడిగాడు: 'తనయందు నిఖిల భూతములందు నొకభంగి, సమహితత్వంబున' తన తమ్ముని నాశనంచేసిన ఉద్దండుడు ఉండగలడనే లౌక్యం అమాయకుడైన దానవాగ్రణి గ్రహించలేక పోయినాడు: అందువల్లనే, ప్రహ్లాదుని భక్తికి జడిసి, స్తంభంకడుపున పుట్టవలసిన ఇరకాటంలో పడ్డప్పుడు కూడా...వాళ్ల నాన్న ఎదుట నిజరూపంతో సాక్షాత్కరించేందుకు జంకాడు: కనుక, ప్రహ్లాదుని యిల వేలుపు ఆతడు వెదికినచోట్లా...ఉండమన్న చోట్లా కనబడ్డాడుకాని...వాళ్ల నాన్నకు అలా అంగుబాటులో గోచరించలేదు...

ఎక్కడున్నాడయ్యా దేవుడు ?—

'కలడందురు దీనులయెడ...సకలయోగి గణములపాలన్...'

ఈ రెండుసుక్కుల్లోనూ పీసపాలుకూ! జం ఉండేందుకు వీలులేదు: దీనులకు దేవుడు ఇవ్వలేని వరం దైన్యం. అందుచేతనే, దీనులపాలిట ఎన్నడూ దేవుడు ఉండడు. వారు, దైవోపహతులైన భాగ్యశాలురు కాలేని అదృష్టవంతులుకదా!

ఇహ, యోగిగణముల విషయం...యోగులకు దైవసాక్షాత్కారం కలిగితే...ఉన్నంతలో వారు తరించి సిద్ధులుగా మారిపోతున్నారు: యోగులుగా నిలిచే యోగ్యత నశిపోతూన్నది. దహరాకాశపు పండువెన్నెలలో దాక్కునేందుకు వెంపరలాడే దేవులనందరినీ తరిమివేసి అక్కడ అద్దంలాగా ఉంచుకోవడమే యోగం చేసే సాధన. ఆ పరగణా యావత్తూ దేవు డన్న దానికి 'టాబూ':

ఎక్కడున్నాడయ్యా దేవుడు ?

ఎక్కడ లేడయ్యా ?

—ఆమాటకు ఈమాట తెగులు. అంతటితో యీ మీమాంస ఆపూటకు...కట్టుబడుతుంది

దేవుడు వెయ్యేళ్లూ వర్ధిల్లుతూంటాడా ?— ఎబ్బే, అది ఎలా పొసుగుతుందయ్యా ? వెయ్యేళ్లకూ నీకు ఎన్నేళ్లు ఆయుస్సో, నీదేవుడికీ అంతే కాదూ?

నీవు పెట్టింది తిని, నీవు యిచ్చింది కట్టుకుని, ఉండమంటే ఉండి, ఊడమంటే ఊడి సర్వకాలసర్వావస్థలయందూ, నీకు అక్రీతదాసుడుగా వెట్టిచాకిరీకి తేరగా కుదిరిన దేవుడికి....నీవు ఊడగానే అంతటితో ఆ నౌకరీకూడా ఊడుతుంది. నీవు, అస్తమించిన అనంతరం, మరేత్రోవా లేకపోతే అనమం పంచభూతాలలో నీతోసంతవరకూ కలిసిపోగో హక్కు అయినా ఉంది...కాని, నీదేవుడు నీలో సమాధిఅయిపోయినందువల్ల అక్కడితో ఆతనికి సమా

ఏడాది కోసమైనా, ఆబ్దికంనాడు, ఎవరో ఒకరు నీవాళ్లు.....నీకుసుబౌలనీ (దుగ్గబౌలనీ) నీకు యిష్టమైన ఆహార పదార్థాలనీ, తమకు గుడిగా, తలచుకుంటారు. కాని, నీ తద్దినం నాడైనా నీదేవుడి పేరు చెప్పి వాళ్లు పప్పైనా పెంపకూడు వెయ్యరు. కాకులూ, కచ్చికలూ, గంగిగోవుపాటి చెయ్యలేదు నీవుపోయిన తరువాత...నీదేవుడు.

నీదేవుడూ నీ అంతటి 'అర్ధాయుస్సు' వాడేను!

నీదేవుడు...నా దేవుడు.

భక్తి కొద్దీ మనం వాళ్లని పెట్టే బాధలు పగవాళ్లకైనా వద్దు బాబూ.

నీ ఉమ్మసుకొద్దీ నీవు సర్కారు సొమ్మంతా ఖర్చుపెట్టి సంతర్పణలూ, సమారాధనలూ చేసి... చివరకు ఆరావచ్చేటప్పటికి, ఆబరువంతా నీదేవుడి నెత్తిన వేస్తే...పాపం ఆ అమానవుడు ఏ తిప్పలో పడి అర్ధరాత్రివేళ వచ్చి ముడుపు చెల్లించిపోవాలి!— అత్తగారి పోరుపుల్లు పడలేక అలసి సొలసి నీవు అలా భక్తిలోకి ఒరిగిపోతే నీదేవుడు, దక్కిస్తూ తన రూపు కూడా మాపుచేసుకుని, కంట్లో నత్తివేసుకుకూర్చుని యింకెడు బియ్యం పండివిసిరిపొయ్యాలి...!—నీకు కాలునొచ్చినా చెయ్యినొచ్చినా నీదేవుడు, వణుకుతూ ఊడిపడి నీకు దమ్మిడీఖర్చులేకుండా, చేత్తో తీసివేసినట్టు బాధ మటుమాయం చెయ్యాలి.

—ఏది చెయ్యమంటే అదల్లా చెయ్యాలి. ఎప్పుడు పిలిస్తే అప్పుడు పలికేట్టు ఉండాలి. నీవు తిడితే, దులిపేసుకుని పడిఉండాలి: నీకు అనుగ్రహం వచ్చి పిలిస్తే సంతోషంతో చంకలుకొట్టుకుంటూ, వచ్చి వాలాలి.

అంతే, ఏం చేస్తాం. అనుదుట మనం అల్లా వ్రాశాము...ఆ బ్రతుకు అల్లా వెళ్ళమారవలసిందే!

ఇంట్లో-వంట్లో కట్టిపడేసుకున్న దేవుళ్ల సంగతి యింత లక్షణంగా ఉంది గనుక, ఇక, గుళ్లో స్తంభించి పోయిన రాయళ్ల సంగతి ఆలోచిద్దామా?—'యింటి కన్న గుడి పదిల'మనే సామెత యీ స్వరూపాలకు దేనికీ అనువర్తించదు: ఈ వాక్యానికి కర్త పూజారి:

పూజారి ఉన్నంతవరకూ ఆ దేవుడికి మైనా రిటీ వెళ్లదు...ఏం వరం యివ్వబోయినా అది చెల్లదు ...ఎంత సంపాదనపరుడైనా...ఎంత ఆస్తిఉన్నా... ఏ దేవుడికీ కనీసప్రహక్కులైనా లేవు:

కొందరి దేవుళ్లు...పగతీర్చుకునేందుకు బ్రతి కుండగానే వాళ్ల కడుపున పుట్టి చేతనైనంతవరకూ పగ సాధించుతున్నారు. కాని, అందరికీ అలా తెగించ డానికి భయంకాబోలు: వాళ్లకన్న పైఎత్తుగా... మళ్లీ వాళ్లకడుపున నీలాటి-నాలాటి రాలుగాయలు పుడితే?—(దేవతల కడుపున దయ్యాలు పుట్టడ మంటే...అందుకు యిదే హేతువు.)

యుద్ధానంతర పునర్నిర్మాణమంటూ ఇదో హటి, ఈ నడుమ ఎలాగూ రానేవచ్చింది కనుక... యీ సందర్భంలోనైనా...మన దేవుళ్లకు మనతో బాటు చతుర్విధస్వాతంత్ర్యములలో...పోనీ అన్నీ కాకపోయినా అధమం కొన్నైనా...అబ్బేట్టు చూ డటం మనకు విధాయక మానా, కాదా?

—'అన్నివిధాలా అణగీమణగీ పడిఉండని దేవుడు మాకు అసలే అక్కర్లే'దంటారా?—అదీ మాబాగే!—దేవుడు బ్రదికిపోతాడు: కాని, నిరంకు శత్వం చెలాయించడమనేది మనకు యీనాటి పరి పాటా?—మనం పుట్టకముందునుంచి మన తల్లికడు పున ఉంది. ఎవరో ఒకరు ఇంకొకరికి లోకువగా ఉండితీరాలి...ఏ మానవుడూ ఇకనుంచి...అట్లాంటిక్ ప్రణాళిక ననుసరించి ఇంకొకరికి అడుగులకు మడుగులొత్తేందుకు వీలులేదు కనుక ... ఇహ, అడుగూ-బొడుగూ మిగిలింది ఎవరయ్యా?—'ఎవ రయ్యా లోకువ?' — అంటే, నంబికొండాయ్ డు ... నీ దేవుడు!-నీ దేవుడు మనిషైనా కాడే, పాపం!

'నీ దేవుడేమిటి, నా దేవుడేమిటి...మనలాంటి భూతాలన్నింటా కలయదిరిగేవాడు ఒక్కడేసుమా... అన్ని పేర్లకూ మూలపదార్థం శాశ్వతమైన ఆ మృత్తికే కదా' అని వాదానికి దిగుతావా?...సరే అలా త్రోవ కురా...అందరి ఉమ్మడి ఉపయోగానికీ ఒక్కడే ఉంటే...మళ్లీ నీకు విడిగా వీడు ఎందుకూ...అది నీ 'అహం' ఔనా కాదా?—ఇంకోమాట, కుమ్మరి ఒక్కసారి కుండచేసి దాన్ని ఆ రూపంలో తగుల బెట్టిన తరువాత...పగిలిపోతే, పనికిరాకపోతే... పారేస్తాడు కాని...మళ్లీ అసలు మట్టిలోకి మార్చేయ గలడా?—మన చేతుల్లో బడి...ఒక్కసారి పుటం వేసిన తరువాత...దానికి మళ్లీ తనలో కలిసిపోగల సత్తా...తగులడిపోయింది...ఔనా, కాదా?...

ఎవడికి వాడు, వాడిమానాన 'నా దేవుణ్ణి ఏమైనా రాచి రంపాన పెడుతున్నానా, పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నానుకాని!' అనేవాడే...ఔను! 'వెయ్యితిట్లు ఒక్క పూర్ణంబూరెతో సరికావు' అని అనుకుంటూండబట్టే ... నీ దేవుడు నీ పాలిట పడి ఉన్నాడు!...అదే నీలో ఉన్న గొప్ప! అందు చేతనే నీ దేవుడు ఎప్పుడూ నీకు భక్తుడు:

(దేవుడూ మనిషివంటివాడే!—అని గట్టిగా అనుకునేందుకుకూడా వీల్లేనట్టు తోస్తూంది, చూడగా-చూడగా: మనిషివంటివాడైనా అయితే...మనిషి కైనా లేని యిన్ని కడగళ్లు...మరి?...)




# రష్యాలో విచిత్ర వైద్యశాస్త్ర పరిశోధనలు

పీనుగుల రక్తమైనా ఫరవాలేదు — చచ్చినవారి గ్రుడ్లతో బ్రతికినవారికి కండ్లు- చచ్చినవారి నాడులను దాచే బ్యాంకులు — క్లోరోఫారానికి విడాకులు - కన్నీళ్లతో క్రిమిసంహారణ — పెన్సిలినుకు పెద్దన్న — మృతసంజీవని.

= శ్రీ డి. ఎ. ఎ. యస్. నారాయణరావు =

వైద్యశాస్త్రంలో ఈ మధ్య సోవియటు రష్యాలో అనేకమైన ఉన్నతపరిశోధనలు జరిగేయి. ఆ పరిశోధనాఫలితములు సైనికులయొక్కయు, సామాన్యప్రజానీకముయొక్కయు అనారోగ్యాన్ని త్వరలో పోగొట్టడానికీ, రోగాలను త్వరలో కుదర్చడానికీ ఉపయోగిస్తున్నాయి. ఇటీవల జరిగిన పరిశోధనల మూలంగానే ఆ దేశంలోని సైనికవైద్యశాఖ గాయపడిన సైనికులలో నూటికి ౭౩ మందిని త్వరలో బాగుచేసి మళ్లా యుద్ధరంగంలోనికి పంపేది మొన్నటి యుద్ధంలో. సోవియటువైద్యశాఖ దేశమంతటా బహుళంగా వ్యాపించుటచేతను, ఉన్నతపరిశోధనల ద్వారాను ఇతరదేశములలోని వైద్యశాఖలన్నిటికంటె అత్యున్నతమైన స్థానాన్ని అలంకరిస్తూంది.

## పీనుగుల రక్తమయినా ఫరవాలేదు

గాయపడి, రక్తము నష్టపోయినవారిలోనికెక్కించుటకు రక్తము విరివిగా కావాలి. ఆరోగ్యవంతులనుండి రక్తమును విరాళముగా తీసికొని, దానిని జాగ్రత్తపరచి, యుద్ధరంగానికి పంపి, బడ్ ట్రాన్స్ఫ్యూజనుకు ఉపయోగిస్తారు. సోవియటు వైద్యులు బ్రతికియున్నవారినుండేకాక, కొన్ని కారణాలవలన చనిపోయిన వ్యక్తులనుండికూడ సకాలంలో రక్తమును తీసినట్లయితే దానిని బ్లడ్ ట్రాన్స్ఫ్యూజనుకు ఉపయోగించవచ్చునని కనుగొన్నారు. ఒక వ్యక్తి ఆఖరుఊపిరి తీసీతీయగానే శరీరములోని జీవకణములన్నీ నశింపవు. కనుక అంటుజాడ్యములవలనకాక ప్రమాదములవలన మరణించినవారి శరీరములనుండి రక్తమును చనిపోగానే తీసినట్లయితే అది బ్లడ్ ట్రాన్స్ఫ్యూజనుకు ఉపయోగిస్తుంది. ఇలాగ రక్తాన్ని అదనంగా సంపాదించడానికి వీలయింది.

రక్తాన్ని ద్రవస్థితిలోనే కావలసినంత కాలం ఉంచడం, ఒకచోటినుండి ఇంకొకచోటికి పంపడం కష్టం. కనుక దానిని డిహైడ్రేటుచేసి (నీటిని ఇగరగొట్టి), ఘనస్థితిలో ఉండే పదార్థమును తయారుచేస్తారు. ఆ పదార్థము మరల ద్రావకంలో సుళువుగా

కరిగి, ద్రవస్థితిలోని రక్తమువలెనే ఉపకరించాలి. ఇటువంటి ఘనస్థితిలోని పదార్థాన్ని సులువుగాను, తొందరగాను తయారుచేసే కొత్తపద్ధతిని రష్యను శాస్త్రజ్ఞులు ఇటీవల యుద్ధకాలంలో కనుగొన్నారు. దానివలన బ్లడ్ ట్రాన్సుఫ్యూజనుశాస్త్రము వివృద్ధి పొందింది.

## చచ్చినవారి గ్రుడ్లతో బతికినవారికికండ్లు

రష్యనుడాక్టరు ఫిలటోవు అనునతడు కొన్ని రకాల గ్రుడ్డితనమును చాలా ఆశ్చర్యకరమైన మార్గంలో కుదరడం ప్రవేశపెట్టేడు. చనిపోయిన వారి కళ్లను పీకి గ్రుడ్డివారికి వాటిని అతికి దృష్టిజ్ఞానాన్నిస్తున్నాడు. అదివరకు వైద్యశాస్త్రప్రయోగంతో దృష్టిని తిరిగి పొందినవారందరికంటె ఎక్కువమంది గ్రుడ్డివారిని ఫిలటోవు ఒక్కడూ తన నూతనపద్ధతితో బాగుచేసేడు.

## చచ్చినవారి నాడులను దాచే బ్యాంకులు

ఫిలటోవు చనిపోయినవారి ధాతువులను (tissues) కొన్నిటిని తీసి బ్రతికియున్నవారి కతకడం, చనిపోయినవారి నాడులను గాయపడిన సైనికులకు అతికి వారిని చావునుండీ, పక్షవాతంనుండీ తప్పించడం కూడా కనుగొన్నాడు. రక్తాన్ని విరాళాలుగా తీసికొని, అవసరార్థం బ్లడ్ బేంకులలో ఎలా దాస్తారో, అలాగే శవాలనుండి నాడులను తీసి ఎప్పుడు అవసరమైతే అప్పుడు ఉపయోగించడానికి నెర్వు బేంకులలో దాస్తున్నారు రష్యను వైద్యులు.

## క్లోరోఫారానికి విడాకులు

విష్నెవిస్కీ అను రష్యనుశాస్త్రజ్ఞుడు క్లోరోఫారం అవసరం లేకుండానే నొప్పిలేకుండా ఆపరేషనులు చేసే పద్ధతి ప్రవేశపెట్టేడు. నొయకిన్ అనే రసాయనిక పదార్థాన్ని ఆపరేటు చేయవలసినచోట ఇంజెక్టు చేస్తే, ఆచుట్టుపట్ల ప్రదేశము మాత్రం చైతన్యరహితమవుతుంది. అప్పుడు ఆపరేషనుచేస్తే రోగికి నొప్పి ఉండదు. ఆపరేషను చేస్తున్నప్పుడే కాక, చేసిన తరువాత గాయము మానుట మొదలుపెట్టేదాకా కొన్నాళ్ల వరకూకూడా నొప్పి ఉండదు. దీనివలన సైనికులకు బాధ చాలావరకు తగ్గింది.

లీనాస్టెర్న్ అనునామె పరిశోధనలు సోవియటు వైద్యంలో గొప్ప అభివృద్ధి తెచ్చేయి. రక్తంలోనికి ఏవేనా పదార్థాలను ఇంజక్షను చేసినప్పుడు అవి మెదడులోకీ, సెరిబ్రోస్పైనలు ద్రవంలోకీ వెళ్లలేవు. మెదడులోనుండి వచ్చే నాడులకణాలూ, వెన్నెముకనుండి వచ్చే నాడుల కణాలూ ఈసెరిబ్రోస్పైనలు ద్రవంలో ఉంటాయి. సెరిబ్రోస్పైనలుద్రవంలోకి పైనుండి పదార్థాలు సాధారణంగా వెళ్లలేకపోవడంమూలాన్నే శరీరంలోని రక్తము పాడయినా, మెదడు సులువుగా పాడవకుండాకాపాడబడుతూంది. కాని ఇలాగ రక్తంలోనికి పంపబడిన పదార్థాలు సెరిబ్రోస్పైనలుద్రవంలోకి వెళ్లలేకపోవుటచేత సిఫిలిస్, టెటనస్, పక్షవాతం మొదలైన కొన్ని రోగాలు లేదు. ఆ ఇంజెక్షనుమందులు సెరిబ్రోస్పైనలుద్రవంలోకి వెళ్లి, మెదడుమీద పనిచేస్తేనే ఆజబ్బులు కుదురుతాయి. లీనాస్టెర్ను ఈవిషయాన్ని గ్రహించి, కొన్ని జబ్బులకు ఇంజెక్షనులు రక్తంలోకి కాక నేరుగా సెరిబ్రోస్పైనలుద్రవంలోకి ఇవ్వాలని సూచించింది. అందుమూలంగా సాధారణంగా గాయపడినవారికి కలిగే మతిభ్రమణ (Shock) త్వరగా కుదర్చబడగలుగుతూంది. సెరిబ్రోస్పైనలుద్రవంలోకి కొన్ని రసాయనికపదార్థాలను ఇంజెక్టుచేయగానే, మతిభ్రమణ పోతూంది. ఈవిధానం గాయపడిన చాలామంది సైనికులకు ఉపయోగపడింది. ఇదేవిధానం టెటనసురోగాన్ని కుదర్చడంలోకూడా చాలా ఎక్కువగా ఉపయోగపడుతుంది.

## కన్నీళ్లతో క్రిమిసంహారణ

లాలాజలంలోను, కన్నీళ్లలోను, ఇతరగ్రంథుల నుండి వచ్చే ద్రవాల్లోను లైసోజైము అనే పదార్థం

ఉంటుంది. అది బేక్టీరియాక్రిములను నశింపజేస్తుంది. ఆపదార్థాన్ని కాల్పులు మాన్పడానికీ, కొన్ని ఇతర గాయాలు మాన్పడానికీ ఉపయోగంలోనికి తెచ్చిన వాళ్లు సోవియటుశాస్త్రజ్ఞులు. ఈ లైసోజైమును ఇంకొక పదార్థంతో కలిపి దానిని రక్తవిరేచనములు కుదర్చడాని కుపయోగించేరు.

## పెన్సిలినుకు పెద్దన్న

కలరాను సూక్ష్మంగా గుర్తించే విధాన మొకటి ప్రొఫెసరు ఎర్మలోవా కనుగొన్నాడు. అనేకవిధము లైన క్రిమివినాశకమందులను అతడు కనుగొన్నాడు. సల్ఫోనిలుద్రవ్యాలకు లొంగని కొన్ని బేక్టీరియా క్రిములు పెన్సిలీను అనే పదార్థానికి లొంగుతున్నాయనీ, ఆపదార్థం యుద్ధసమయంలో గాయాలను మాన్చడానికీ, కొన్ని అంటురోగాలను కుదర్చడానికీ విరివిగా ఉపయోగపడిందనీ అందరికీ తెలిసినదే. సోవియటువైద్యులు పెన్సిలినువలెనే చాలానేర్పుతో పని చేసే గ్రామిసిడినుఅనే క్రిమివినాశకపదార్థాన్ని కని పెట్టేరు. పెన్సిలినుపనిచేయని కొన్నిరకాల బేక్టీరియాపైకూడా పనిచేస్తూ సోవియటువైద్యులు కని పెట్టిన గ్రామిసిడిను చాలారోగములను కుదర్చడానికి పనికివస్తూంది.

ప్రొఫెసరు నెవ్యడామ్‌స్కీ ఇటీవల కేన్సరు రోగాన్ని కుదర్చడంగురించి కొంత కృషి చేసేడు. నాఫ్తలినుతైలంలో అల్ట్రాసానికుతరంగాలను పంపి, ఆతైలాన్ని ఇంజెక్షనుఇవ్వడం మూలంగా కేన్సరు రోగాన్ని కొంతవరకూ కుదర్చవచ్చునని చూపేడు.

## మృతసంజీవిని

ఒక జీవి మరణబాధ ననుభవిస్తున్నప్పుడుగాని, మరణించినట్లు డాక్టర్లు లెక్కకట్టిన తరువాతగాని ఆజీవిఅవయవాలు మళ్లా సక్రమంగా పనిచేసేటట్లు చెయ్యాలని చాలామంది శాస్త్రజ్ఞులు ప్రయత్నాలు చేసేరు. జీవి ఆఖరుఊపిరితియ్యడంతో శే, దేహంలో రక్తప్రసరణ ఆగిపోవడంతో శే జీవి మరణించినట్లు వైద్యులు చెప్తారు. కాని ఆతరువాత కొంతకాలానికి గాని ఆదేహంలోని జీవకణాలన్నీ చావవు. ఈ మధ్య కాలంలో ఏప్రయత్నంవల్లనైనా ఆజీవిని మళ్లా బ్రతికించవచ్చునా అనేది పెద్దప్రయత్నం. ఇదివరకు ఈరంగంలో హైమన్సు, తామ్సను, బీర్‌బామ్, కుల్యబోకు, ట్రూకవోకుజ్, ఆంద్రియేవ్ అను వారలుపనిచేసి, కొన్నిఫలితాలను తెచ్చేరు. వారందరి ప్రయోగాలలోనూ చనిపోయిన వ్యక్తులయొక్క కొన్ని అవయవాలనుమాత్రం కొంతకాలం బ్రతికించ గలిగేరు. కాని ఆవ్యక్తియొక్క అన్ని అవయవాలూ పనిచేసి మళ్లా ఆవ్యక్తి పూర్తిగా బ్రతికేటట్లు చేయ లేదు.

ప్రొఫెసరు బుర్డెన్‌కో క్రింద రష్యాలో ఈ సమస్యపై కొందరు శాస్త్రజ్ఞులు ఎనిమిది సంవత్సరాల నుండి పనిచేయడం మొదలుపెట్టేరు. కుక్కలను నెమ్మదిగా చంపి వైద్యాభిప్రాయంప్రకారం అవి చనిపోయినతరువాత, కృత్రిమంగా రక్తప్రసరణమును ఏర్పాటుచేసి, వానిని మళ్లా బ్రతికించేరు. ఆతరువాత మనుష్యులమీద ప్రయోగాలు చేసేరు. ఊపిరి తిరగక చనిపోయిపుట్టిన బిడ్డలను బ్రతికించడానికి ప్రయత్నించేరు. డాక్టర్లు మామూలుగా చేసే ప్రయత్నాలన్నీ విఫలమయి, చావును నిర్ణయించినతరువాత, బుర్డెన్‌కో శిష్యులు తమ విధానంప్రకారం పనిచేసేరు. ఇలాగ ఆబిడ్డలు బ్రతికేటట్లు చేయగలిగేరు. కాని ఆబిడ్డలు మొదటిలో పునర్జన్మ పొందినతరువాత కొన్ని గంటలుమాత్రమే జీవించగలిగేవారు; కాని ఆతరువాత పరీక్షమూలంగా వాళ్ల ముఖ్యఅవయవాలు కొన్ని సరిగా లేవని తేలింది. యుద్ధరంగంలో గాయాలవలన రక్తనష్టమై చనిపోయినవారిమీద ప్రయోగాలు చేసేరు ఈశాస్త్రజ్ఞులు. వాళ్లలో కృత్రిమంగా రక్తప్రసరణాన్ని గావించి, తరువాత రక్తనాళాలలోనికి రక్తాన్ని ఎక్కించి, చనిపోయిన కొందరు సైనికులను బ్రతికించగలిగేరు. అలా బ్రతికినవారిలో ఇతరజబ్బుల

వల్ల మళ్లా కొన్నిరోజుల్లో కొందరు చనిపోయినా, కొందరుమటుకు పూర్తిగా బ్రతికేరు. కనుక ఏవ్యక్తి అయినా, ఊపిరితిరగక చనిపోయినప్పుడు, ఎక్కువ రక్తనష్టంవలన హఠాత్తుగా చనిపోయినప్పుడు, వైద్య నిర్వచనంప్రకారం చావు సంభవించిన కొద్దినిమిషాల లోగా ప్రయత్నాలు చేసి ఇలాగ మళ్లా బ్రతికించ గలుగుతున్నారు రష్యనుశాస్త్రజ్ఞులు. చనిపోయేక ఇంకా ఎక్కువఆలస్యంగా తమ విధానం ఉపయోగించి బ్రతికించడానికి వీలవుతుందా, లేదా అని ప్రయత్నాలు చేస్తున్నారు.



# శంబుకవధ

[నాటిక]

= శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావు =

[దృశ్యము దండకారణ్యము - శంబుకుని యజ్ఞవాటిక - శంబుకుఁడు యజ్ఞవేదికపై నాసీనుఁడై యుండును. భార్య తుంగభద్ర చెంత నిలచియుండును.]

(నేపథ్యమున వేదఘోషము.)

శంబు—(చేతులు జోడించి నిమీలితనేత్రుఁడై) హే చరాచరభూతబహిరంతర్విహారీ! హే వేదవేద్యా! హేపరమపురుషా! హే జ్యోతిస్స్వరూపా! హే అనంతసృష్టిస్థితిలయవిధాయకా! హే జగద్రక్షకా! పాహిమాం! పాహిమాం! (ధ్యానంగతుఁడగును)

(ప్రవేశము - శ్రీరామలక్ష్మణులు)

శంబు—(కన్నులు తెఱచి శ్రీరామునిఁ జూచి మహానందముతో) ప్రజ్వలితసర్వదిగంతమూర్తివై, నీలమేఘశ్యాముఁడవై యున్న నీ వెవ్వరవు మహాపురుషా, ఈ యరణ్యదేశమునఁ బ్రత్యక్షమైతివి? నాయజ్ఞఫలస్వరూపుఁడవైయున్న నీ వెవ్వరవు ప్రభూ! ఈమనోహరస్వరూపమే నా నిత్యాంతర్ధ్యానమూర్తి! ఈస్వరూపమే, ఈమహోజ్వలతేజోమూర్తియే నాతపోదృష్టికి సర్వదా ప్రత్యక్షమగుచున్నది! ఆహా! నేను ధన్యుఁడను! ధన్యుఁడను!

పవనాంబుభక్షులై భయదాటవుల ఘోర
తపమొనర్చెడు తపోధనులకైన,
సంసారదూరులై సర్వసంగత్యాగు
లై సంచరించు సంయములకైన
హోమయజ్ఞదీక్షాగరిష్ఠాత్ములై
బ్రహ్మపథానువర్తనులకైన,
ఆహారనిద్రావిహారనిశ్చలహరి
ధ్యానపరా భక్తసత్తములకైన,
అందఁగారాని సచ్చిదానందమూర్తి
సర్వభూతాంతరస్థతేజస్స్వరూపి,
సకలబ్రహ్మాండసామ్రాజ్యచక్రవర్తి,
అహహ! యెంతలో నాకుఁ బ్రత్యక్షమయ్యె!

తుంగభద్రా! రమ్ము, రమ్ము. మనము తరించితిమి.

(శ్రీరామునకు సాష్టాంగప్రణామమొనర్చును.)

శ్రీరా—శంబుకా! నన్ను గుర్తించితివా?

శంబు—గుర్తించితిని. దేవా! నీవు నా ధ్యానమూర్తివి! నాతపస్సమాధియందు ఈ దూర్వాంకురశ్యామలమూర్తియే, ఈ తేజోరాశియే సర్వదా నాయంతర్దృష్టికి గోచరించుచుండును. దేవాదిదేవా! ధన్యోస్మి! ధన్యోస్మి.

శ్రీరా—ఓయీ! నే నెవ్వరి ధ్యానమూర్తినిఁ గాను. తపస్సమాధియందు నే నెవ్వరి హృదయములను వసించువాఁడను కాను. నేను కేవల మొక మనుష్యమాత్రుఁడను.

శంబు—కాదు. కాదు. ఈ నీలనీరద మనోజ్ఞమూర్తినే నేను నిత్యమును నాతప స్సమాధియందుఁ జూచుచున్నాను! ఈ స్వరూపమే! ఈమనోహరాకృతియే! నా యెదుటఁ బ్రత్యక్షమైయున్న యీ దివ్య మంగళవిగ్రహమే యది! అణుమాత్రమును భేదము లేదు. ఈ యాకర్ణాంతవిశాలనేత్ర ములే యవి! ఈ యాజానుబాహువులే యవి! ఈనీలరత్నచ్ఛటామోహనమూర్తియేయది! మహాపురుషా! నన్నేల పరీక్షించెదవు? నాధ్యానమూర్తివే నీవు! సందియము లేదు.

శ్రీరా — శంబుకా! నేను నీధ్యాన మూర్తినిఁ గాను. అయోధ్యారాజ్యమున కధీశ్వరుఁడను నేను! ఎన్నఁడైన రామ నామమును వినియుంటివా?

శంబు—రామనామము! వినియుంటిని. అనేకముఖముల వినియుంటిని. తొల్లి యీ వనమునందు నేను దివారాత్రములు శ్రీరామ నామమునే జపించుచుంటిని. పితృవాక్యపరి పాలనార్థమై రాజ్యభోగపరిత్యాగ మొనర్చి సతీసమేతముగ నేదినమున నీవు మహారణ్య గామివైతివో, యాదినమే శ్రీరామనామము నాజపమాలపైఁ బ్రతిధ్వనించుట కారం భము! కాని, రఘుపతీ! ఏదినమున లోకాప వాదహేతుకముగ మహాపతివ్రత, లోకైక పావని, నిరపరాధిని, పూర్ణగర్భధారిణి యగు జానకీదేవిని విభ్రాంతమతివై యరణ్య గర్భమున విసర్జించితివని వినియుంటినో, ఆనాఁటినుండియు రామనామమునందలి మా ధుర్యము నా కనుభూతమగుట లేదు! రామ నామము ధూమకేతువువలె నాహృదయమున కుత్పాతసూచకమై తోఁచుచున్నది! దివ్య మూర్తి యని నేను భావించిన శ్రీరాముఁడు కేవల మొక క్షుద్రమనుష్యమాత్రుఁడని నేను గుర్తించితిని! ఆదివ్యత్వము అణు మాత్రమైనను నీయందు నా కిప్పుడు గోచ రించుట లేదు...... అయినను......అయినను నా ధ్యానదృష్టికిఁ బ్రత్యక్షమగుచుండిన యీ మనోహరమూర్తివే నీవు! సందేహము లేదు. ఇందలి రహస్యమును నేను గ్రహింపఁ జాలకున్నాను!

శ్రీరా—గ్రహింపవలసిన యావశ్యక తయు లేదు. ఓయీ! ప్రస్తుతము నేను నీయెదుట న్యాయాధిపతినై నిలచియున్నాను. నీకు మరణదండనము విధింప నేను వచ్చి యున్నాను.

శంబు—మరణదండనమా? రాజేంద్రా! నాయపరాధమేమి?

శ్రీరా—వర్ణాశ్రమధర్మద్రోహివై నీవు సమాజనియమముల నతిక్రమించితివి. నీయజ్ఞ కర్మహేతువుచే రాజ్యమునందనావృష్టియు, దుర్భిక్షమును, అకాలమరణములును సంప్రా ప్తములగుచున్నవి.

శంబు—(నవ్వి) రాజ్యమునందలి యుప ద్రవములకు నాయజ్ఞకర్మమా హేతువు? నీవు సత్యముఁ బల్కుచుంటివా? ఇంత యుక్తిహీనమగు వాక్యము నీముఖమునుండి యెట్లు వెల్వడినది ప్రభూ! ఇదియా నీ న్యాయనిష్ఠ?

కులసతీ విసర్జన మహాకలుషమునను
నీదు మస్తిష్కమిపుడు భ్రాంతిగతమయ్యె!

పాప పుణ్య విచారసందీపనంబు
సాధ్యమగు టెట్లు నీ కింక సార్వభౌమ !

శ్రీరా—శంబుకా ! కాలయాపనము వలనఁ బ్రయోజనములేదు. నీయపరాధము నకు శిక్ష ననుభవించుటకు నీవు బాధ్యుఁడవు.

శంబు—రఘుపతీ! ప్రాణత్యాగమునకు నేను వెనుదీయుటలేదు. కాని, నీధర్మవిచారణమునకు నాకు నవ్వువచ్చుచున్నది ! అపూర్వము ! అద్భుతము ! రామచంద్రా ! నీ యధఃపతనమునకు నేను దుఃఖించుచున్నాను. నీపూర్వప్రతిభ చిహ్నమాత్రమైనను లేక సంపూర్ణముగ నశించిపోయినదా ? మహారాజా ! తెలిసినది !

ఏ రమాదేవి తేజఃప్రసారణమున
నీవు తేజస్వివై యుంటి విన్నినాళ్లు,
ఆ మహాతేజ మిపు డరణ్యముల కేగె,
కాకయున్న నీ కీయధోగతి యదేల ?

అకలంకంబగు వంశమా నవసె, స
ద్వృత్త్ జీవనాశాలతా
ప్రకరం బెల్ల పదాహతంబయి చనెన్
బాతాళ గర్భంబునన్ !
ఇఁక రాజోత్తమ ! పాడు రాచరికమం
దే మున్నదం చీవు మా
నక మోమెత్తితి వాజగజ్జనని వెం
టన్ గానకున్ బోవకన్ ?

శ్రీరా—శంబుకా ! నీతోఁ దర్కవితర్కములు చేయుటకు నేను రాలేదు. నేను యుక్తిజ్ఞాన తేజోవిహీనుఁడ నైన నగుదును గాక ! శాస్త్రనియమానుసారము నీయపరాధమునకు శిక్ష ప్రాణహరణము. ఆశిక్షావిధానముఁ బాలించుటకు నేను వచ్చి ఎట్టిమరణమును నీ వపేక్షించెదవో చెప్పుము. నీవు నాతో యుద్ధముఁ జేయఁగోరెదవా ?

శంబు—రాజేంద్రా ! రావణవిజేత యగు జగదేకవీరునితో యుద్ధమా ? ఇంతకును యుద్ధమున సంహరించుట యొక శిక్ష యగునా ? నాకుఁ బ్రాణదండనము విధించితివి. ఇదిగో, ఆత్మసమర్పణమొనర్ప సిద్ధముగ నున్నాను. నామూర్ధమును ఖండింపుము. (శిరము వంచును)

తుంగ—(ముందునకు వచ్చి) సూర్యాన్వయసంభవుండును, పుణ్యవ్రతుండు నగు శ్రీరాముఁడవు నీవేనా, మహాపురుషా ? నీయెడ నేయపరాధము సేయుంగని నాభర్తను సంహరింపఁబూనితివా ?

శ్రీరా—సాధ్వీమణీ ! నీభర్త సంఘ విప్లవకర్తయై దేశారిష్టములకు హేతుభూతుఁడయ్యెను. ఆయపరాధ మెట్టిదో నీకుఁ దెలియదు.

తుంగ—మహారాజా ! నాభర్త నిశ్చయముగ నపరాధియే యైనచో, కులకాంతను, అశ్రుధారాసిక్తనై యర్థించుచున్నాను. క్షమాభిక్ష మీయరా ? నిరపరాధినినైన నన్ను అనాథను జేసివేయుదురా ?

శ్రీరా—కాంతామణీ ! నీ భర్తయపరాధము క్షమాయోగ్యము కాదు. స్వధర్మత్యాగియై పరధర్మమగు యజ్ఞకర్మానుష్ఠానమును బూని, యావద్రాజ్యమునకు నరిష్టకారియైన నీభర్తయపరాధము రాజదృష్టియందు క్షమాయోగ్యము కాదు.

తుంగ—ప్రభూ! రాజదృష్టి మానుష దృష్టి కతీతమైనదా ?

శ్రీరా—ఆ జిజ్ఞాసకుఁ బ్రస్తుతము నా హృదయమునందు స్థానము లేదు. కేవల రాజత్వమునకై నేను మానుషత్వమును విక్రయించుకొని చాలకాలమైనది.

శంబు—తుంగభద్రా! నే నొనర్చినది యపరాధము కాదు. నీ వీతని క్షమాభిక్ష మడుగనేల? కేవలము స్వజాతిసంస్కారణమే నాయాదర్శముకాని, పరధర్మగ్రహణము కాదు. మానవసంఘమునందుఁ బరికల్పితమైయున్న స్వార్థనియతిని నేను ప్రతిఘటించితినేకాని సర్వోత్తమమగు ఈశ్వర నియతిని నేను ప్రతిఘటింపలేదు.—రఘురామా! నీశిక్షావిధానమును నీవు పాలింపుము. సిద్ధముగ నున్నాను.

శ్రీరా—లక్ష్మణా! ధనుర్బాణముల నిటు తెమ్ము.

(లక్ష్మణుఁ డందిచ్చును)

తుంగ—(ఇరువురి మధ్యను నిలచి) నిష్ఠురాత్మా! ముందు నాప్రాణముల హరింపుము. అస్త్రమును బ్రయోగింపుము. ముందు స్త్రీవధాప్రశస్తిఁ బడసి పిదప నిరపరాధిని సంహరింపుము. నిర్దోషియగు మహాసాధ్వియకల్మషహృదయముపై వజ్రాఘాత మొనర్చితివి! లంకారాజ్యమును శ్మశానమొనర్చి యారుద్రభూమియందు శతలక్షరాక్షసవధూహాహాకారములఁ బ్రతిధ్వనింపఁజేసితివి! ఈవిధానము నీకుఁ గ్రొత్తకాదు. కానిమ్ము. అస్త్రమును విడువుము. నీకీర్తిచరిత్రమును మూడులోకములును గీర్తింపఁగలవు!

శ్రీరా—సాధ్వీమణీ! ప్రభుకార్యమున కంతరాయముఁ గల్గింపకుము.

శంబు — తుంగభద్రా! దూరముండుము. నిర్విచారముగ నుండుము. మన జీవనలీల కిదియే సమాప్తముకాదు. అది యనంతము! అప్రతిహతము!

తుంగ—(ప్రక్కకుఁ దొలఁగి) వధింపుము. వధింపుము. రాజేంద్రా! భర్త ప్రాణముల హరించి నిరపరాధినియగు ధర్మపత్నిని అనాధను జేయుచుంటివా? పాషాణ హృదయా! (ఏడ్చును)

శ్రీరా—పతివ్రతామణీ! నీవు సత్యముఁ బల్కితివి. నాహృదయ మిప్పుడు పాషాణమే యైయున్నది. నా తనూమనఃప్రాణసర్వస్వము నిప్పుడు పాషాణమయమే యైయున్నది. లౌకికవ్యథాసముచ్చయము లెంతటి కఠోరములైనను న న్నిప్పుడు బాధింపఁజాలవు. కేవలరాజధర్మమునకై పూర్ణగర్భిణియైన యర్ధాంగలక్ష్మిని విసర్జించితిని! కేవల రాజధర్మమునకై యిప్పుడు నీభర్తప్రాణముల హరించెదను!

శంబు — ఇది రాజధర్మము కాదు. రాజేంద్రా! ఇది రాజధర్మపు నిర్జీవకంకాళము. దానిని నీవు పూజించుచుంటివి. రాజధర్మము, సత్యప్రతిష్ఠ చాలకాలమై నిన్నుఁ బరిత్యజించినవి.

అఖిల భోగత్యాగి వై తొల్లి యేనాఁడు
కాషాయ వస్త్రంబుఁ గట్టినావో!
అధముఁడౌ గుహుని ప్రేమాంజలి నేనాఁడు
శ్రీ పాదయుగళి మర్పించినావో!
శబరి యుచ్ఛిష్టప్రసాదంబు నేనాఁడు
సిద్ధామృతముగ భక్షించినావో!
పగఁబాసి రావణభ్రాత కేనాఁడు లంకారాజ్యపట్టంబుఁ గట్టినావో!

అహహ! లోకాభిరామమైనట్టి నాఁటి
ఆ మహాతేజ మానాఁడె యస్తమించె!
దండకారణ్యరాజ్యపదంబు విడచి
తిరిగి యేనాఁ డయోధ్యకున్ మరలినావొ!

ఇంకను ధర్మ మెక్కడ? ధర్మమను పేర నధర్మభూతమున కాత్మార్పణ మొనర్చు కొంటివి! ఆ పవిత్రధర్మదేవతా పునస్సంధానము తిరిగి నీ కీజన్మమున లభింపఁజాలదు.—అయినను, నీవు నాయారాధ్యమూర్తివి! నాధ్యానాధిష్ఠానదేవతవు! ఆ శ్యామసుందర మూర్తివే నీవు! నీయస్త్రాఘాతమున నాకు శాశ్వతముక్తి లభించఁగలదు. దేవాదిదేవా! అస్త్రమును సంధింపుము.

శ్రీరా — (అస్త్రసంధానముఁ జేసి) ఆహా!

కడచె సీతాపరిత్యాగకాండ మపుడు,
కడచు నింక శంబుకవధాకాండ మిపుడు,
అహహ! యీమహారాజత్వమందు నిట్టి
పుణ్యకాండంబు లింక నెన్ని ముగియవలెనొ!

శంబుకా! నీయపరాధమునకు ఈ దివ్యాస్త్రము నిన్ను భస్మీకృతు నొనర్చి వాయుమండలమున లీనముఁ జేయుఁగాక!

(బాణము విడచును- బాణముతో శంబుకుఁ డదృశ్యుఁడగును)

తుంగ—హా! హా! ప్రభూ! ప్రభూ! (మూర్ఛిల్లి, తిరిగి లేచి) రఘువంశకళంకా! నిష్ఠురాత్మా! పతివ్రతాశాపోపహతుఁడవు నీవు! ముహూర్తమాత్రమైన నీ కీజన్మమున శాంతి యుండదు. అహోరాత్రములు ఆహార నిద్రావిహీనుండవై, సహస్రబంధుమధ్యమున నేకాకివై, మనస్తాపవహ్నిజ్వాలామధ్యంగతుఁడవై నీవు మరణము నపేక్షింతువు! నరరూపరాక్షసా! నీముఖముఁ జూచిన నరకము సంభవించును. నాసమక్షమునుండి తొలఁగిపొమ్ము.

శ్రీరా— దేవీ! అవనతమస్తకుఁడనై చేతులు మోడ్చి నీయభిశాపమును ఆశీర్వాద ప్రాయముగ నేను గ్రహించుచున్నాను. లక్ష్మణా! రమ్ము.

(లక్ష్మణునితో నిష్క్రమించును)



# అనద

= శ్రీ పురిపండా అప్పలస్వామి =

స్వప్నంలో స్వప్నంలా
పోతూ పోతూ నిలిచిన
సన్నని దొంక కాలి దారి
వాకిట్లో జీబురు పొద
పొదలో చీకట్లో నిశ్శబ్దంగా
ఏదో ఒక జాలి పిలుపు
పిలుపే మలుపై తీసిన
తలుపై నను గదిలోనికి
దీనంగా మౌనంగా
కునుకుతున్న గదిలోనికి
మినుకుమినుకు గుడ్డివెలుగు
ఆరీ ఆరని దీపం
బిగులుబితుకు గదిలోనికి
లాక్కొన్నది.

చవిటినేల పదునారని
చీకు నేల చింకిచాప
పడివున్నది చితిపైవలె
బాలెంత నిషాదుని ని
ష్ఠుర శరమేదో సోకిన
లేడిపోలె.

రొమ్ముమీద
పాలింకిన రొమ్ముమీద
మరణించిన చిన్నిపాప
కొరడువారి చిన్నపాప
రామ రామ!
చెక్కులబడి దిగజారిన
కన్నీళ్లకు తడిసి తడిసి
మలినపు చినిగిన వసనం
పీలికలా ఓదార్పులు!

ఆకలితో శోకంతో
రోగంతో కుమిలి కమిలి
పొగలింకిన వా చూపులు
పాతాళం నూతినుండి
వినపడ్డటు మసి గదిలో
ముమూర్షకంఠం జాలిగ
"మాలకొంప బాబా! మీ
పాదం తాకితె పాపం
వదలదు మాకే జన్మల
ఏనాటిదో పాపం మా
కీనాటికి తండ్రీ ఒక
శాపంలా సంఘానికి
అన్నానికి పిడికెడంత
కబళానికి దూరంగా"

(నిట్టూర్పులు గదినిండా
నిట్టూర్పులు రగిలించుక)

"కూలిలేక నను పెంచే
కూడులేక నాకోసం
ఈ నా ప్రాణం కోసం
పోక పోక రంగానికి
పోయినాడు మహారాజు
పోయిన దారే మళ్లీ
మళ్ల లేదు మహారాజు
నీడపట్టు పీడనీక
ఏలుకున్న మహారాజే
జాలి మరచిపోయాడో!"

"నా ప్రాణం నాముత్తెం
పాలులేక నీళ్లులేక
కదలదు నిన్నటి నుండీ
దేవుడికే జాలిలేదు"

"కనికరించు తండ్రీ నా
ప్రాణానికి బాధలేదు
గరిటెడు పాలే చాలును
కలకాలం మరచిపోను"

ఆరిపోయినది దీపం
నిశ్శబ్దం
బరువై బరువై కాటుక
చెరువై గదిలో చీకటి.





మీరు ప్రక్క పాపిడ తీసికొన్నను మధ్య పాపిడ తీసికొన్నను సేలాడు జడవేసికొన్నను జడవేసికొని చుట్టిముడుచుకొన్నను మరేవిధముగా నలంకరించుకొన్నను అందమును విస్తారమయిన కురులు ముఖ్య అవసరము. కేశవర్ధిని సమృద్ధిగా అందమైన కేశములను పెంచును. 9



సహజ సౌందర్యము దేవుని ప్రసాదము. అయితే కురులు అందమును కృషిచేసి మీరు కేశవర్ధిని వల్ల పొందవచ్చును.

చిన్నతనములోనే కేశముల ఆరోగ్యమునకు, కురుల అందమునకు కేశవర్ధినితో పునాది వేయుడు. కేశవర్ధినీ కటాక్షములచే పెంపొందని కేశములు లేవు. ఎట్టి కురుల నయినను వృద్ధిచేయును.

# కేశవర్ధిని

అందమైన కేశములను పెంచి వాటిని

గట్టిపర్చు కేశవర్ధిని కొనుడు

| | | |
|---|---|---|
| కేశవర్ధిని | ఆణాలు | 0-12-0 |
| కేశవర్ధిని షాంపూ | | 0-12-0 |
| కేశవర్ధిని క్రీం | | 1- 0-0 |

ప్యాకింగు పోస్టేజి అధికము.

వర్తకులందరివద్దను దొరుకును లేక

## సౌత్ యిండియా కెమికల్సు,

158, తిరువెంకటస్వామి రోడ్డు,

ఆర్. యస్. పురము — కోయంబత్తూరు.

గమనిక :— దీనినిపోలిన యితర యిమిటేషన్ నూనెలనుకొని మోసపోవద్దు. మీరు కొనుటకుముందు, దానిమీద, "కేశవర్ధిని" మరియు "సౌత్



# డోంగ్రేగారి

## బాలామృతము

బలహీనమైన బిడ్డలకు
పుష్టియును, బలమును
ఆరోగ్యము నిచ్చును

వేటూరి.

సుందరశాస్త్రిగారి

# సువర్ణ సుందరరసము

సర్వప్రమేహములకు సంజీవి.

గుణము ప్రత్యక్షము

అనుభవసిద్ధము. ఇంజెక్షన్లు అవసరం లేదు. ఎటువంటి ప్రమేహాలనైనా కుదుర్చును.

## 50 మాత్రలు రు. 5.

## ఆర్యరసాయనశాల, ముక్త్యాల.

# సుమిత్రా విలేఖలు. ౧

## విషువత్సంవత్సర ప్రార్థన

= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

కీర్తిశేషురాలగు బాణగిరి సుమిత్రాదేవి యొక్క యుత్తమశ్లోకుని యింటి ఆడుబిడ్డ. పాలప్రాయమందే (౧౯౩౨) ఒక సాధుశీలుడగు సంపన్నతరుణునితో వివాహమై, కొన్నాళ్లకే ఆమె తన కాపురమును చేరుకొనగల్గెను. కాని, ఏవో కారణములచే, భర్త తన్ను ద్వేషించు పరిస్థితు లేర్పడుటవలన, ఆ సువాసిని పుట్టినిల్లు చేరి వియోగక్లేశ మనుభవించవలసివచ్చినది. రెండుమూడేండ్లు బాధపడి దైవానుగ్రహవశమున ౧౯౩౮ లో భర్తకటాక్షమున కకస్మాత్తుగా పాత్రురాలగు భాగ్య మబ్బి, సరి పదినెలలకే బంగారుబొమ్మవంటి పుత్రికను కనగలిగెను. కాని, భార్యాభర్తల పరస్పరవియోగమునకు కారణభూతములగు పరిస్థితులు అప్పుడుకూడ అంతరించియుండనికారణమున నా పతివ్రతాతిలకము పుత్రికతోగూడ పుట్టినింటనే నిలిచి దుఃఖించుచుండినది. ఎంత ప్రార్థించినా భర్తకు కరుణ కలుగలేదు. కడచిన విషుసంవత్సరారంభమున భర్త రెండవ వివాహమునకు వధువును వెదకు సన్నాహముతో నుండగా, ఆకేలు తెలియని యాసువాసిని తన హృదయతాపమును భర్త కెరిగించుచు నూతనసంవత్సరపు కానుకగా వ్రాసి పంపిన లేఖ యిది. ఈమె యేపాఠశాలలో కాని, ఏగురువునొద్దకాని విద్యనేర్చినది కాదు. భర్తపై ఆమెకు గల ప్రేమ యనిర్వచనీయము. నిరుపమానమగు పతిభక్తి యామెది. అట్టి భర్త తన్ను నిరాదరించి ద్వేషించుటచే ఆమెకు కల్గిన దుఃఖమే, ఆ మనోయాతనయే ఆమెకు విద్యాగురువు. ఆ దుఃఖభారముచే నామెకు ఉన్మాదావస్థవంటి యుద్రేక మప్పుడప్పుడు వచ్చుచుండినది. అట్టి యావేళకాలములలో నామెకు తీవ్రభావములతోడి నిరర్గళమైన, నిసర్గమధురమైన కవిత్వధార యబ్బుచుండెడిది. రాల్గరగించుభావములతో నామె యనేకలేఖలు వ్రాసినది. లేఖలన్నియు చక్కని శైలితో, రమ్యములగు పద్యములతో నిండియుండును. సొంత పద్యములేకాక, ఇతరగ్రంథముల నుండి పద్యములు, శ్లోకములు ఆమె యథేచ్ఛముగా, సందర్భశుద్ధితో వాడినది. వ్యాకరణముకాని, సులక్షణసారముకాని వాసనజూడని యీ కవయిత్రి సహజపాండిత్య మత్యద్భుతము. అందందు నెరసు లనదగినవి కొన్ని కానరాగలవుకాని, అవి నిరర్గళభావప్రవాహములో నణగిపోగలవని సహృదయులగు పాఠకమహాశయులు కనుగొనగలరు. ఈలేఖలను ప్రకటించుట కనుమతించిన యీసువాసినిభర్తకు కృతజ్ఞుడను. —రా. గో. కృ.

గేయము : వందనములు గైకొండు నాథా,
వల్లభా ! మత్ప్రాణనాథా !
దీనకారుణ్యార్ద్ర శీతల
దృష్టి కన్గొనరే.

గీ. ప్రకృతి లక్ష్మీవిలాస పరంపరలకు,
నవనవోన్మేష శక్తిసంధాయకంబు;
విశ్వమానవ హృదయ సంప్రీతికరము;
వచ్చె నేఁ డిదె నూతనవత్సరాది.

శా. ఆసన్ గొల్పెడి నూత్నవర్ష మిది;
ఏ మాడించి పాడించునో ?
వేసం బెయ్యది వేసి మించునో ?
దురావేశంబు గల్పించునో ?
పీసం బాలి ( ? ) చికిత్సజేసి వను
నికి నుం జెసి, నా
దోసంబుల్ తెగద్రోసి కావ తరి
కాదో ? వల్లభా ! వేడితిన్.

నూతనంబగు భావముల్ మది
నూలు గొల్పుచు నేకమై,
నూతనం బగు సత్యరూఢిని
నొప్పుచుండి నిరంతముక్
ప్రేమ దయవాత్సల్యముల ని
క్కేకముగ జతగొల్పుచున్
నూతనాశలతో జరింపుడు
నూత్న వత్సరమందునన్.

గీ. పలుకకుండిన వచ్చి మెలగుచుండును చెంత,
పలుకరింపకుండ పలుకుచుండు;
నిశ్చయముగ చూడ నీతోడి లోకమే,
కాక, వేరికేమి కలదు నాకు?

గీ. తోడవు లిమ్మని ఎపుడు మిమ్మడుగలేదు,
జిలుగు వలిపెంబు లిమ్మని కలచలేదు,
దివ్యవస్తువు లీయ బాధించలేదు,
నాథ! ఒండేమి కోర, మీ కరుణదక్క.

ప్రకృతము మీ ఆరోగ్య మెట్లున్నదో యని ఎంతయు కుందుచున్నాను. తండ్రిగారి జాబునకు ప్రతిలేదు. మీ ఆరోగ్య విషయమై నామనసు ఎంతయు కలవరపడుచున్నది. కాన, దయచేసి మీ ఆరోగ్యము మీ తనయకైనను వ్రాసినచో నే నెంతయు ఆనందింతును. ఈ చిన్నది మిమ్ములను ఎంతయు తలంచుకొనుచు మాబావ "కింగీ, కింగీ" "బాబ్బా, బాబ్బా" అని మీ ఛాయాపటము ముందు వెళ్లి మమ్ములను చాల ఏడ్పించుచున్నది. మీకు దాని తలంపు లేకపోయినను ఈ అర్భకురాలు మాత్రము మిమ్మేమో తలంచుకొని మమ్ము వెతలబెట్టుచుండును.

ఈ కంద కుందు నైర్మల్యము ఏ తపస్సిద్ధుని కుండగలదు? మానవ జీవితమునకు నైర్మల్యముకదా ప్రధానము?

ఏలొకో నాకు జాబు వ్రాయవలయు నన్న చేతులు వణకుచున్నవి. కారణము నాకే ఎరుంగరాకున్నది.

సీ. మణిహేమ ఘటితభూషణ వితానములలో
తళుకు తళ్కని జీవకళలు దోచు,
శారీర సౌందర్య సౌకుమార్యములలో
వెలుగు జూపుచు జీవకళలు దోచు,
వచనామృతరసప్రవాహవీచికలలో
దొలికియాడుచు జీవకళలు దోచు,
కార్యసందోహసత్క్రమ విక్రమములలో
కలయ్రాకుచు జీవకళలు దోచు

గీ. నాంతరంగిక నైర్మల్యకాంతి యున్న
నన్నిటికి వెన్న గాదగు వన్నె దోచు
జీవితంబున కిదియ సంజీవిఫలము
పడయుండీ దీని, పూనికమై ప్రాణనాథ.

గీ. నిఖిలమహిమాలవాలంబు నిర్మలాత్మ
నిఖిలశక్తినిధానంబు నిర్మలాత్మ
నిఖిలవస్తుస్వరూపంబు నిర్మలాత్మ
నిరత మానందనిలయంబు నిర్మలాత్మ.

మీకు తెలియని దేమున్నది? నిర్మలత యుండుచోట ప్రేమోదయము తనంతటతానే యగు.

"పరమాత్మ! ప్రపంచమునందలి సమస్తవస్తువులను ప్రేమతో చూచెడి దృష్టిని నాకు ప్రసాదింపుము." (వేదము)

"ప్రేమ మనుష్యత్వమునకు నామాంతరము" (బుద్ధదేవుడు)

"ఈ ప్రపంచమున నొక్కటే శిక్షనభ్యసింపవలసియున్నది. అది ప్రేమ శిక్షయే" (రామతీర్థస్వామి)

"తృష్ణ రాక్షససంపత్తి; క్షమ మానవచిహ్నము; ప్రేమ దేవతాస్వభావము." (భర్తృహరి)

"ప్రేమకును, భోగవిలాసములకును స్వర్గపాతాళాంతరమున్నది." (రామకృష్ణపరమహంస)

"ప్రేమ మానవుని దౌర్బల్యము" (చాణక్యుడు)

"ప్రేమ పాపులనుసయితె నుద్ధరించును" (కబీర్‌దాసు)

"ప్రేమించువానికే దండించు నధికారమున్నది" (రవీంద్రనాథ)

"కవి కేవలముగా కలగనువాడు; అతని హృదయము లోకభావనాదర్పణము; అతని గీతములు ప్రపంచ ప్రహసన ప్రతిస్వనములు; అతని దుఃఖములు మనుష్యుల అశ్రువులు." (శ్రీమతి సరోజినీదేవి)

"మాటిమాటికి ప్రేమించువానికి ప్రేమ తెలియదు." (తులసీదాసు)

"ప్రేమ స్వర్గమునకు మార్గము." (టాలుస్టాయి)

"ప్రేమ ప్రపంచజ్యోతి." (క్రీస్తు)

"మీ రన్యోన్యముగ ప్రేమించుకొనుడనియే నా ఆనతి." (కణ్ ఫ్యూషియస్సు)

"సుందరవస్తువు శాశ్వతప్రసన్నతాసామగ్రి." (కీటు)

"పరమాత్మ పూజను కోరుట లేదు. ప్రేమను కోరుచున్నాడు." (దయానందసరస్వతి)

"తన సృష్టిని ప్రేమించువారిని పరమేశ్వరుడు ప్రేమించును." (షేక్స్పియరు)

"నాపుస్తకములు స్త్రీల నేత్రములు" (మూర్)

"పరమేశ్వరుడు ప్రేమ." (బ్రౌనింగు)

"ప్రేమ కన్నులతో కాక హృదయముతో చూచును. కావుననే ప్రేమదేవత గ్రుడ్డిది." (ఆస్కార్ వైల్డ్)

"నాకు నీయందు ప్రేమ యున్నది. నేను కోరుచుందునని మాత్రమే చెప్పగలను. రాత్రి నిదురించునదియు నిదియే. పగలు మేల్కొనునదియు నిదియే!" (కోలేశ్వర్)

"ప్రేమ మనుష్యుని దౌర్బల్యము, ఆయుధము అగును." (నిషీక్)

"ప్రేమ ఆత్మల వివాహము" (వాల్టేర్)

"పరులను ప్రేమించుట తన్ను ప్రేమించుకొనుటయే!" (ఎమర్సన్)

"ప్రేమ క్రీడావస్తువులతో క్రీడించును. ప్రేమదేవత బాలుడు." (ఫోర్డు)

"ప్రేమ జిహ్వాసేత్రములం దున్నది" (ఫ్లీచర్)

"దయ ద్వారము తెరచును. ప్రేమ లోపలికి ప్రవేశించును." ( ? ? ? )

"లోకమున నొక్కటియే ప్రేమముఖమున్నది." బైరన్)

"ప్రకటింపబడని ప్రేమయే అతిపవిత్రమైనది." (కార్లయిల్)

"ప్రేమ ఎల్లప్పుడు నశించదు. దాని పవిత్రకణములు ఎల్లప్పుడు ప్రకాశించుచుండును. ఇది స్వర్గమునుండి వచ్చును. మరల స్వర్గమునకే పోవును." (సౌదే)

"సామాన్యమందిరమును ఆనందమందిరముగా మార్చునది ప్రేమయే." (ఛాసర్)

"చల్లని జ్ఞానప్రకాశములలో ప్రేమౌషధి మొలకెత్తదు" (క్యాంటు)

"నిన్ను ద్వేషించువానినిసయితము నిర్మల హృదయముతో ప్రేమించుము. ప్రేమబలముముందు భౌతికబలము లొంగిపోవును. (గాంధీమహాత్ముడు)

గీ. ప్రేమయే శిఖరాస్థానసీమ లేలు
ప్రేమయే భువి మానవధామ మేలు,
ప్రేమయే దివి దేవతాధామ మేలు,
ప్రేమ స్వర్గంబు, స్వర్గమే ప్రేమ మరయ.

ఈ ప్రేమయే పలువిధములుగ పరిణమించుచుండుట సహజమేకదా?

గీ. తాను ప్రేమించినట్టి పదార్థమునకు
పరుల యాటంక మొదవిన పట్టులందు
నొడలు తెలియని క్రోధంబు పొడము; నదియ
రౌద్రరస మయ్యె-దాని కారణము ప్రేమ.

గీ. ప్రేమయే వస్తువుల నావరించియుండు
వాని కలిమి సుఖంబని, వాని లేమి
దుఃఖమని లోకు లనుభవింతురు నిజంబు
కాన, సుఖదుఃఖముల కధికారి ప్రేమ.

గీ. శిలకృతపాశబంధాల నేల నాథ
పట్టి దయలేక నను బాధపరతు రిటుల?
ముగ్ధకన్యాహృదంభోజ పుటములందు
అగ్ని రగిలించు టిది మీకు న్యాయమౌనె?

గీ. బాహ్యజగమున నా ప్రేమపాత్రులైన
బంధుమిత్రుల చెలుల సర్వము త్యజించి
మిమ్ము జేరితి ప్రేమ బిమ్మెడు నెడంద
తృప్తి నొందదో మీ ప్రేమతృష్ణ యింక?

గీ. హృదయమున నెన్నడైన మున్నెరుగనట్టు
మృదుమధురలజ్జ మీకయి వదలినాను
నా యమూల్యచిత్తంబు, శిలాయమాన
బోచుకొని గూడ నొక్కింత తుష్టిగనవు.

గీ. గాఢచిరసంగతి తను నైక్యంబుగన్న
విపులగర్వముగూడ నర్పింపవలెనె?
హృదయవేదన కన్నీరు వదలవలెనె?
ప్రేమకఠినాంతరంగ నా హృదయనాథ!

చ. జగ మొక నాటకంబట, రసజ్ఞుడు
తానట, మానవుం, డిసీ!
అగణితప్రేమభావ సముదంచిత నాట్య
కళావిలోల మా
ఖగమిథునంబు జంపి, తినికొని వసిం
పగబోలదొక్కొ? ఏ
మిగతి? రసార్ద్రమా హృదయమే యిటు
లెండుచు కొయ్యబారినన్!

నే నేమి చేయగలను? నా వ్రతఫల మెట్టిదో? నాకు ఈ తూరి జాబు వ్రాయ వలయు నన్న చాల నిరుత్సాహము, భయము కల్గుచున్నది. అయినను, ఆరోగ్య మెట్లున్నదో యను తొందరచే వ్రాయక తప్పినది కాదు.

సీ. విభ్రాంతిగనె నన్న వృత్తిమాత్రమె కాని
లోచనంబులు మిమ్మె చూచుచుండె,
మూగన్న పడెనన్న మాటమాత్రమె కాని
ధ్యానంబు మీపైన దవిలియుండె
కళతజారినదన్న యులుకు మాత్రమె కాని,
చిత్తంబు మీయందె హత్తియుండె,
పడియుండె ననియెడి భంగిమాత్రమె కాని,
తనువు మీయంఘ్రినే యొనసియుండె.

గీ. ప్రేమనిధిని మీకే సమర్పించుచుంటి
అఖిలమును మీరలే యని యనుటకంటె
విన్నవింపగ నాకేమి యున్న దింక,
నన్ను బ్రోవుడు దేవ, నా ప్రాణనాథ.

ఈ పరిస్థితి యున్నది. ఎవ రేమి చేయగలరు?

మంజరి—"పూర్వజన్మల నే పుణ్యదంపతుల
ఎడబాటు కల్గించి ఏడిపించితినో,

గేయము:—అది ఎదురుగొడుతాదిరా, దైవమా!
అనుభవిస్తున్నానురా"

గీ. శాంతి లభియింప కెన్నివత్సరము లయ్యె
నిద్ర లభియింప కెన్నియో నిశలు గడిచె
హాయి మది చోటుగానక మాయమయ్యె
కటకటా! ఇంక యేటికీ కటిక బ్రదుకు?

గీ. "సొగసుకాడ! మనంబున సొరగి సొరగి,
నీ కొరకు నింక నే మరణింపబోను,
నిన్నె తలచుచు చచ్చి వెండియును నీకె
చిక్కి వెతలను గుడిచి శోషింపనేల?" (రా. అ.కృ)

గీ. "కానివారి సిరుల గాంచుట, వైద్యుడు
లేని తెవులు, విభవహీనులగుచు
బంధుమధ్యమునను బ్రదుకుటవలె నీ వి
యోగదుఃఖ మెట్టులోర్తు దీని" (రా. కృ)

ఓర్వలేక చేయునదేమున్నది? అనుభవించియే తీరవలయు.

గీ. "సిగ్గు విడిచి, నడత చెడగొట్టుకొని, లోక
మెల్ల నపయశంబు నెత్తి చాటి
ఎవనికొరకు చెలియ యిట్లైతి, వాడె నా
పాలి కన్యుడైనవాడు నేడు." (రా. అ. కృ)

అనునట్లు మీరే అన్యులవలె నున్నప్పుడు నాకు "నా" అనువా రెవ్వరు స్వామీ! దయయుంపుడు.

గీ. "సొగసులీను దయితమొగమును చూచుట
అది అమూల్యసౌఖ్య మట్టులుండె
పొలతి యుండు పల్లెపొలిమేర జూచిన
చాలు, కన్నుదోయి చల్లబడును." (రా. అ. కృ)

అని, నేను అనుచున్నప్పుడు మీకు బాధగా నున్నను నాకేమో మీ చెరువుకట్టను[1] చూచినంతనే అర్ధాయాసము నివారణమైనట్లు తోచెడిని.

దైవచిత్రమునకు మీరుమాత్ర మేమి చేయగలరు? మనోవృత్తుల కధికారి యెవరు? మీకు ఆయాసముగ నున్నప్పుడు, వచ్చి మాత్ర మేమి చేయవలయునని సందేహముతో నున్నదానను. ఇచ్చట చాల బలవంతపరచుటచే నిలచియున్నాను. మీ సుఖానికి భంగము కల్గకూడదనియే కోరిక. ఎల్లప్పుడు పతిదేవుని శ్రేయస్సునే కోరుట భారతీయుల ఆచారమై యున్నదికదా? ఏలొకో నాకు చాల భయమగుచున్నది. చిరంజీవి రమాదేవి[2] ఎల్లప్పుడు మిమ్ము తలచుకొనుచుండును.

గీ. "ప్రేమ సర్వధనంబు, దరిద్రులకును
భాగ్యవంతులకును తుల్యభాగహార
పుత్రగాత్రపరిష్వంగమున జనించు
సుఖముకంటెను వేరొండు సుఖముగలదె."
(మృచ్ఛకటి)

మీకు తెలియని వేమున్నవి? అయితే, మీ ఆప్తబంధువులలో మమ్ము మరచిపోవుదురు. ఈ పసిబాల మీ కేమి అపకారము చేసినది? ముఖ్యము - మా ప్రాప్తి యిట్టిది. ప్రాప్తికి మించిన ఫలము వచ్చునా? రెండేండ్లుగా ఉపనయనమునకు[3] రావలయునని కోరినందులకు, తుదకు బంధువులలో ఈ పరాభవమా మాకు ప్రాప్తి?

ముఖ్యము- మిమ్మేమియు అనుకొనజాలను. పోయినతూరి లేఖలోనే "నాదు వ్రతఫలంబు." వ్రాసుకొనియుంటిని. మా యింటికి వచ్చిన, ఏమైనా మందువేసెదమను భావమున్నప్పుడు మీరుమాత్ర మేమి చేయగలరు?[4] వచ్చి తాంబూలము తీసుకొనివెళ్లియుండిన, ఇంతటి దుఃఖమునకు పాల్పడవలసియుండ లేదు.

"తొంగుండ మంచము దొరకక కృశియించు
బంటున కబ్బు ...

1. భర్తగ్రామమునకు చేరువగా మార్గమున నొక రమ్యమగు గొప్ప తటాక మున్నది.

2. ఇది యీ కవయిత్రికూతురు పేరు.

3. ఈ సువాసిని తమ్మని కంతకు ముందే ఉపనయనము జరిగినది. ఆ నెపముతోనైన భర్త రాలేదని ఆమెనిర్వేదము.

4. భర్త తన్ను ద్వేషించుటకు గల కారణములలో అతని కిట్టి యూహ వచ్చుట యొక్కటి యని ఆమెభావము.

అనునట్లు, అజ్ఞురాలిని కాన, కొంతెమ్మ కోరికలను కోరుకొనుచుందును. నాయోగ్యత ఎంతటిదని తెలిసికొనజాలకున్నాను. తప్పు పని—తెలిసినవారు చేసినను, తెలియని వారు చేసినను తప్పే యగునుగదా?

"సోమయాజిసుతుండు శునకంబు జంపిన
అది న్యాయపద్ధతి యనగదగునె?"

అని రామలింగేశుడు చెప్పినట్లు, ఎవరే కాని, తప్పుపని కావించిన తప్పేయగును.

"ప్రజ్ఞయా మానసం దుఃఖం
హన్యాత్ శారీర మౌషధైః"

అను ఆర్యస్మృతిని ఎన్నిమార్లు స్మరించుకొన్నను, భరింపజాలక బాధపడుచున్నాను.

స్వామీ! నేను అన్యురాలను గాను.

గీ. మిమ్ము మదిలోన స్మరియించునిమిషమందె
కుప్పలుగ తియ్యనగు నూహ లుప్పతిల్లు
జెలికి తెల్పుదమన్న తబ్బిబ్బులగును
శబ్దజాలవిజ్ఞానంబు —లకునికి.

గీ. మిమ్ము నెడబాసి ఎచ్చట నున్నగాని
మీదెసకె మానసపు వృత్తి మెలసియుండు
నెల్లపుడు నొక్కదిక్కే చూపించుచుండు
నావికుల యంత్రపుగ్ ము ల్లనంగ దేవ.

గీ. స్వామి! ఎటనున్న మీమీది తలపు వీడి
యుండనేరదు నిముసంబు నొండిమనసు
చెలగి సాయంతనపువేళ చెట్టునీడ
ఎంత సాగియు మూలంబు లెడలనట్లు.

గీ. కర్మబద్ధనయి, గతి కానరాక
ఎంత దూరముగా బడియున్నగాని
మీకు నన్ను బిగించి బంధించినట్టి
వలపుగొలుసులు తెగిపోక స్వామి, సాగె.

గీ. ప్రేమ నాయెడ నుంత చూపించ రనుచు
నాథ! నామాట కలలోన తలపరనుచు
తెలిసియును మిమ్మె పట్టుక, దేవురించు
నాకె, నను జూచి, యొకసారి నవ్వ గలరు.

గీ. ఎంత తేలికగా నన్ను నీసడించి
పైచినను నాకు మీమీది వలపు విడదు
కోపమును గల్గ దిది ఏమి గొప్పతనము
వెడలుమన, బోక ప్రేలాడు వెఱ్ఱితనము.

గీ. మిమ్ము ధ్యానించునంతటి నిశ్చలముగ
నీశ్వరునినైన మదిని చింతించునెడల
జేలనయినట్టి నామీద జాలికలిగి
అతడు నీపాటికి ప్రసన్ను డవును గాదె?

గీ. కనులు మూసిన, తెరచిన, కలలలోన
గాలిలోపల, గగనమార్గంబునందు
అంతటను మీరె ప్రత్యక్షమగుచు నాకు
మారుపని తోచనీయ, రేదారి, చెప్పుడు.

గీ. ఎన్నిసారులో మిము వేడుకొన్న నాకు
ఎంత కఠినాత్ములో, మీకె యెరుక కాని
వేడుచున్నాను, కడసారి, వినుడు నాదు
నిశ్చయం, బింక మీరు మన్నింపకున్న
దిక్కులను మీదు పేరు ప్రతిధ్వనింప
ఎచటనైనను, మీపైన గూర్చినట్టి
ప్రణయగీతాలు గుహలందు పాడుకొనుచు
దినములను బుచ్చి విడుతు నాదేహ మచట.

స్వామీ!!

నెలానరనుండి ఆరోగ్య మెంతమాత్రము బాగలేక బాధపడుచున్నాను. మీకొరకయే పిచ్చిదానివలె అన్నియు వ్రాసుకొనుచున్నాను. అరతులము బియ్యమును కూడా అన్నకోశమునకు భరించు శక్తి లేకున్నది. చాలాదినములు నానుండి తొందర కలుగబోదు. నాకు అంత్యకాలము సమీ

పించినది. ఎక్కువ వ్రాయజాల. ఏమి వ్రాసిన ఏమి ముప్పు వాటిల్లునో యని నా గుండె చాల చెదరిపోయినది. మి మ్మింత దయాశూన్యులని నేను కలలోనైనా తలచి యుండ లేదు. నాకర్మ మిట్లున్నది. "కాలోహి దురతిక్రమః." భగవత్స్వరూపమగు కాలము గడవ నెవరితరము? నే జేసిన పాప మెవ్వ రనుభవింతురు?

"కన్యాపితృత్వం దఃఖాయ." తండ్రి గారు మీరు రాకపోవుటచే ఎంతయు ఖిన్నులైయున్నారు. అయితే, వారి కోర్కె తీర్చుటకై మీరు వత్తురా? కల్ల! కొండంత ఆశతో నా అల్లుడు వచ్చునని యుబ్బి నాల్గు భుజములతో నున్నందుకు కావలసినదే వారికి శాస్తి! పిల్లలందరు, మా బావ వచ్చును, మా బావ వచ్చునని, ఉత్సాహము మీర, "వస్తాడే మా బావ" పాటలు పాడుచు, మీ తనయకూడా, బావ వచ్చునని, కొత్త అంగీ తెచ్చునని, స్టేషనుకు వచ్చి నందుకు శాస్తి! ఒక అరగంటలో అందరి కన్నీటి కాల్వలు పారజేసినది.

నా విషయము విడిచిపెట్టుడు. రెండు మార్లు నా సహోదరుడు మీ గ్రామమునకు వచ్చి మిమ్ము వేడుకొన్నందులకు ఫలవంత మైనది. నిర్వాహము లేక ఇంటిలో చేసి నలుగురిలో ఎంతయు అవమానపడవలసి వచ్చి తుదకు తండ్రిగా రెంతయు చిన్న బోయిరి.

ఉ. ఎప్పుడు వచ్చు బావ, ఇక
యెప్పుడు వచ్చును బావ యంచు, నిం
కెప్పుడు వచ్చు, వారి కెదురేగి
యొసంగుదు స్వాగతంబు, నా
కెప్పుడు వీనులంబడునొ యింపగు
నాథుని వార్త లెల్ల, నే
నెప్పుడొ యుబ్బిపోదు, నను నిట్టి
తలంపుల కిట్టివా గతుల్?

ఇట్టి ఆశ కిట్టివే గతులు. ఏలనో నా కల మాడకున్నది. మీకును భగవంతు డిట్లే చేయుగాక! ఇంతకన్న మిమ్మేమియు నన జాలను. మహారాజగు సత్రాజిత్తునకే, సత్యకే తప్పినది కాదు. ఇక మావంటి హత భాగ్యులమాట యేమి?

"మణిని కూతునిచ్చి మాధవుపదములు
పట్టుకొంటినేని బ్రతుకగలను
సంతసించు నతడు, సదుపాయ మగు నిది
సత్య! ఇతరవృత్తి చక్కబడదు."

అని సత్రాజిత్తు వాపోయినాడు. మీ కును భగవంతు డీ యనుభవము నొసంగు గాత యని నా జనకుని దీవన!

ఈ జాబు వ్రాయుటచే నాకు ప్రతి వచ్చును, నేను ఆనందింతును అని కాదు. ...ని కాన, లభించినను, లభించక పోయినను, నా కర్తవ్య మనుకొంటిని. లభిం చిన భాగ్యమని తలంతును. లభించకున్న

"ఏమీ లేనమ్మకు ఏడు పేళ్ళంగారము."

అను సామెత ననుసరింతును. లోక ములో చేసిన పనులన్నియు ఫలవంతము లగునా? కర్మ మన అధీనము; ఫలము దైవాధీనము.

స్వామీ! ఎక్కువ తెలుపవలసిన దేమున్నది? శ్రీ కృష్ణపరమాత్మ ఆజ్ఞ:—

"కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన."

శ్రీ కృష్ణపరమాత్ముడు "న మే భక్తః ప్రణశ్యతి." అని పలుమారు చెప్పియున్నాడు. దాని వెంటనే "ప్రతిజానీహి" అనికూడ చెప్పియున్నాడు. నమ్మినవారి నతడు కష్టములపాలు చేయడని నా గట్టి నమ్మకము. నా సుఖదుఃఖము లతనివే. ప్రార్థన సమయములో కూడ నేను,

"తను నిన్నదో,
జీవన నిన్నదో,
అనుదిన దొళుపడువ
సుఖదుఃఖ నిన్నదయ్యా!"

అనియే అతని కర్పింతును.

"అనన్యా శ్చింతయంతో మాం
ఏ జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహామ్యహం."

అతడే నా సుఖదుఃఖములకు బాధ్యుడు. కర్మ చేయుటమాత్రమే నా అవశ్యకర్తవ్యము.

ముఖ్యము, ఒక కోరిక. ఇంకనైనను నా యందు క్రోధమును విడిచి ప్రసన్నులగుదురుగాక. నా యందును ఎన్నియో తప్పులు జరిగిపోయినవి. స్వామీ! ఐతే, నా యట్టి వివేకశూన్యురాలివి తప్పులు దొరకుట వింతయా?

"వాక్య మప్రతిరూపంతు న చిత్రం స్త్రీషుమైథిలీ!"

అను రామానుజుల వాక్యము కొంచెము తలంచుకొన్నచో, మీకే నా యందు కరుణ కల్గును. మీ మిత్రులగు శర్మగారు రచించిన "పర్ణకుటి"[5] యను అమూల్యగ్రంథములో "అహింసయ అవతార" యను భాగమును చూచియుందురని నమ్మినాను. నాకు బుద్ధులు కరపవచ్చితివా యని రోషమూనకుడు.

ఉ. హేతువులేని నవ్వుల నొకించుక
చూపుచు, లేతదంతముల్
వాతెర చింద పల్కుచును
స్పష్టముకాని మనోజ్ఞ వాక్కులన్
భూతలధూళి దేహమున
బూయుచు మైలయొనర్చు పుత్రులన్
ప్రీతిని ధన్యులెత్తి తొడ
మీదను జేర్చి సుఖింతు రెంతయున్.

ఇట్టి ధన్యత మీకును భగవంతుడొసంగియున్నాడు. వ్యర్థపుచ్చకుందురుగాక! మీ కూతురు అన్ని మాటలు నిరాఘాటముగ మాటలాడుచుండును. పాటలు, పద్యములు చెప్పును. దినమునకు పదిసార్లు "అమ్మా! పైసా ఇమ్మని ప్రాణముతీయుచుండును. నేను మీ యూరికి వచ్చిన, నానుండి మీకు తొందరకల్గును; మనస్తాపములకు కారణమగును; అని రాక మానివేసితిని. ఇచ్చట చాల బలవంతపరచుటచే, వచ్చుటకు వీలులేకున్నది. మీరు చాలా చిక్కిపోయినారని, నావంటి గయ్యాళిభార్యను పొందినారని, మరియు చాల సాధువులని తండ్రిగారి అభిప్రాయముండుటచే, నన్ను పంపకయున్నారు. అయితే, ఒకటి వ్రాయకతీరదు. మీరును, మొదటివలెనే, అప్పుడప్పుడు వచ్చిపోవునట్లయిన, తప్పక యీపూరనే స్థిరముగ ఉండదలచితిని. ఇది నా త్రికరణశుద్ధిగ చేసుకొన్న నిశ్చయము.

5. "పర్ణకుటి" యనునది శ్రీయుత సిద్ధంపల్లి కృష్ణశర్మగారు కర్ణాటకభాషలో వ్రాసిన గ్రంథము. ఆధునికకర్ణాటకవాఙ్మయకర్తలలో శ్రీ శర్మగారు ప్రసిద్ధులు.

అట్లుకాక, మీ దర్శనము లేకయే, ఇచ్చట పడియుండవలయునన్న తలం పున్నచో, అట్లుండుట అసంభవమని తోచెడిని. విరోధముగనైన మిమ్ము చూచుచుండిన, అంతయే తృప్తి. మిమ్ములను చూడజాలక మాత్ర మీ నిర్భాగ్య యుండజాలదు.

ఎక్కువ వ్రాయవలయునన్న చేతు లాడవు. ఈ జాబు చూచినంత నే ప్రతివ్రాయ ప్రార్థన.

గీ. నిజము మీనోట వినుటకై నెమ్మనంబు
తత్తరం బందుచున్నది. తగునె యిట్లు ?
సతి "సుమిత్ర"యొ కాదొకో చెప్పరాద
నాధ! నే నైపజాల నీసందియంబు.

క. కల్లలకు భ్రమిసి, మహిలో
వల్లభులగు పతుల నమ్మి వలచిన యిల్లాం
డ్రెల్లి దముగారె ? కటకట !
చెల్లనుచు నింత చుల్కనేయందగునే.

లోకములో భార్యల నేడ్పించు మగలు మాత్ర మేమి అనుభవించు చున్నా రో, ఎరుంగజాలను. ఇట్లు వ్రాసితినని రోషమూనకుము. జ్ఞాపకార్థము వ్రాసితిని.

గీ. ప్రణయమాత్రకలన బంధింపదగుగాక
పువ్వువంటి యిగురుబోడిమనసు
కడక బల్మి నేలబడజేసి తా నేమి
సౌఖ్య మనుభవింపఁ జాలు భర్త ?

మన్నింపక తీరదు.

చ. ప్రబలుడ ; ఏలుకోగలను బల్మిని ;
నాదగు చేతిలోని దీ
యబల ; ఇదేమి చేయగల ; దంచు
ననాదరబుద్ధి జూచెదో ?
అబలయు ప్రేమ దక్కి యసహాయత
తెంపు వహించెనేనియుఁ
ప్రబల యగుఁన్ జుమీ ! ప్రణయ
భంగపు సంగతి కింతులోర్తురే ?

అనునట్లు, మీకు దీనినుండి యే మాత్రము సుఖ ముండదని నా యూహా. మన్నింతురుగాక ! కమలాపురములోనే, "ఆర్తవిన్నపము"లో అన్నియు తెల్పుకొనియుంటిని. అయితే, ఈ నిర్భాగ్యకు ప్రతివచ్చునా ?

ముఖ్యము, ప్రాప్తి యిట్టిది. వచ్చినను రాకపోయినను, కష్టమైనను, సుఖమైన మార్గము లేదుగదా ? స్వామీ !

"ఎవని వదలిన జీవంబు నవసిచను నా
అతని నపరాధి యయ్యు నోదార్పవలయు
ఊరుగాలుచు పొలివోవుచున్న గాని
అగ్గినొల్లనివా డెవ్వ డతివ చెపుమ ?"

ముఖ్యవిషయమై యున్నది. ఇంకనైనా గడచిన దినములను మరచి నూతన శక మారంభింపవలయు నని వేడుచున్నాను.

గీ. ఉత్సవంబులలోన సంవత్సరాది
సకలజనులకు సంతోషజనకమయ్యు
అధికసంతాపకారణ మయ్యె నాకు
స్మృతికి వచ్చుట జేసి మీతలపుగూర్చి.

గీ. సకలజనులును తమ దినచర్యలెల్ల
నరసి శోధించు సంవత్సరాదినాడు
నాదు దినచర్య పరిశోధనంబుసేయ
అన్నిపుటలను శోకంబె ఆక్రమించె.

గీ. తావకవియోగశస్త్రఘాతంబుచేత
గంటుపడియున్న నాగుండె గాయ మింక
కుదురుపోవక లోలోన కుళ్లి కుళ్లి
అలయుచున్నది నానాట నెలలువారి.

గీ. చైత్రసఖు డంచు మాధవప్రియు డంచు
కవులు కీర్తించుచుందురు కాముగూర్చి
చైత్రముపువున మాధవోత్సవము వేళ
కాము డీర్ష్యను ; కటకటా ! కాలమహిమ.

గీ. దుఃఖమా ! నాదు కూర్మినాథుండు నిన్ను
తనకు మారుగ జూచుకొమ్మనుచు నాకు
నప్పగించెను ; కావున నందుకొంటి !
ప్రేమ మీరగ నిను బెంచి పెద్దసేతు !
ప్రణయమా ! నన్ను నీ వింక బాసిపొమ్ము
మరణమా ! నీవె నాపాలి శరణమగుము.

గీ. అక్కరమున కొక కన్నీటి చుక్కగార
వ్రాయుచుంటిని మీ పేర పద్దియములు ;
ఎంత వ్రాసిన పద్యంబు లంతె మొంద
విమరబారదు కన్నీటియేటిజాలు.

గీ. నీవియోగవ్యథాంబుధి నిస్తరింప
కడగి కబ్బంబు తెప్పగా గైకొనంగ
పైని తేలించుటకుమారు లోనికీడ్చి
ముప్పతిప్పల బెట్టి నన్ ముంచుచుండె.

ముఖ్యము, ఒకపూట వచ్చిపోవలయు నని కోరుచున్నాను. సాహసించి వ్రాసినందులకై మన్నింతురుగాక. ఈ విషుసంవత్సర మెట్లు విషమించునో, దైవ మెరుగు.

నాథా ! చాలదినములు మిమ్ము చూడక యుండజాలను. ఇప్పటికే, నా పని ముగిసి పోయినది. మీ విషయములో మాత్రము, ఎంత మార్చుకొనవలయునన్నను, సాధ్యము కాకయున్నది. ఇందుపైన, మీ యిష్టము ; నా అదృష్టము.

సీ. కలగన్న యపుడైన మెలకువయందైన
పొడగాంచుచుందు మీ ముద్దుమోము
మౌనంబునందైన మాటలయందైన
తలపోయుచుందు మీ చెలిమితీరు
కష్టంబునందైన కల్యాణమందైన
కాంక్షించుచుందు మీ కరుణబడయ
విలయాగ్ని యందైన మలయాగ్ని యందైన
విహరింతు మీఛాయ వెంబడించి

గీ. నాదు ప్రేమరాశి, నాపాలి దైవమా!
నాదు వ్రతఫలంబ, నా ధనంబ !
నన్ను విడువనీ వదెంత యత్నించిన
నిన్నుమాత్ర మేను నిజము విడువ.

గీ. మధురతమగీత సాహితీమహితమైన
జీవితేశ్వర భవదీయ దివ్యరూప
దర్శనం బిచ్చి మీ నిత్యదాస్య మొసగు
మనుటకంటె నా కన్యకామ్యంబు లేదు.

ఈ జాబుకు ప్రతి తప్పక వ్రాయవలయును. లేనిపట్ల నేను రావలసివచ్చును. ఈ అభాగిని మిమ్ము గాంచక మనజాలదు.

గీ. ధ్యాననిష్ఠాగరిష్ఠనిర్భాగ్యరాశి
అర మొగిడ్చిన కన్నుల కరవు దీర
చెవుల చవు లూర చిత్తంపు చింత జార
ఇచటి కేతెంచి నను బ్రదికింపవోయి.

"అణుమాత్ర మిదం సహేత వోఢుం
నహి విశ్వంభర మధ్య మామితీవ
మన సోఢ్యవరుహ్య తస్య దృష్టేః
పురతః ప్రాదురభూ త్స్వమాన్ పురాణః".
(భారత చంపు)

"బోద్ధారో మత్సరగ్రస్తాః
ప్రభవ స్స్మయ దూషితాః
అబోధోపహతా శ్చాన్యే
జీర్ణమంగే సుభాషితం" (భర్తృహరి)

పరిస్థితి ఇట్లున్నది. ఎన్ని వ్రాసినను చర్వితచర్వణమే యగును. మీకు తెలియని దేమున్నది ? ఈ జాబునకు తప్పక ప్రతి వ్రాయగోరినాను. మీరు వచ్చునదియు, లేనిదియు తెల్పగోరితిని. మీ ప్రతికి నిరీక్షించుచుందునని మీ రూహించుకోగలరని నా యూహ.

ఇట్లు
మీ యొల్లని సతి,
సుమిత్ర.

# చతురంగయోధులు

[కథానిక]

= శ్రీ క్రొవ్విడి లింగరాజు

వాజీదాలీషారాజ్యం. లక్నో నగరం పేద సాద అనే వివక్షత లేకుండా భోగవిలాసాల్లో మునిగి తేలుతోంది. ఆటపాటల్లో కొందరూ, నల్లమందు గంజాయి మొదలైన నిషాపదార్థాలతో కొందరూ ఆనందంగా కాలక్షేపం చేస్తూన్నారు. జీవితంలో ప్రతిరంగంలోనూ భోగం, విలాసం ఉట్టిపడుతున్నాయి. రాజకీయలోకంలో, సాహిత్యప్రపంచంలో, సాంఘిక వ్యవస్థలో, ఉద్యోగసద్యోగాల్లో, ఆహారవిహారాల్లో అన్నింటిలోనూ భోగపరాయణత్వం ప్రత్యక్షం. ప్రభుత్వోద్యోగులు విషయలోలురు. కవులు ప్రేమవిరహాలమీద తమ కవితాప్రభావాన్ని విజృంభింపజేశారు. జీవితావసరాలను సృష్టించే కమ్మరికుమ్మరివగైరా పారిశ్రామికులు అత్తరు, పన్నీరు, సురమా, బుక్కా, చందనం, గంధం వగైరా సుగంధద్రవ్యాలు తయారు చేయడంలో నిమగ్నులైనారు. అందరి కళ్లకూ భోగవిలాసం అనే మబ్బు కమ్మేసింది. లోకం ఏమయిపోయినా వీళ్ల కేమీ నిమిత్తంలేదు. కోడిపందేలు, డేగపందేలు, జూదాలు అవిచ్ఛిన్నంగా నడుస్తున్నాయి. కొన్నిచోట్లకొన్నిచోట్ల చతురంగమహాసంగ్రామాలు. ఒక్కటేమిటి ? పాదుషా మొదలు ఫకీరువరకూ మూడు పువ్వులూ ఆరుకాయలూగా ఉన్నారు. ఎంతవరకంటే ? ఫకీరు కొక పైసా దొరికితే తిండిసామగ్రి కొనుక్కునేందుకుబదులు, నల్లమందో భంగో సేవించే స్థితిలో ఉంది. చతురంగంపాచికలు ఆడడంవల్ల మనుష్యుల బుద్ధి వికసిస్తుందనీ, కఠినసమస్యలను పరిష్కరించే సూక్ష్మాలు స్ఫురిస్తాయనీ వాదిస్తూఉండేవారు జనం. (అలాంటి సాంప్రదాయికులు ఇప్పుడూ ఉన్నారనుకోండి).

అలాంటి స్థితిలో మిర్జా సజ్జాదాలీ, మీర్ రోశన్ ఆలీ ఇద్దరూ తమ బుద్ధిని రాత్రింబగళ్లూ ఇలా వికసింప జేశారంటే ఆశ్చర్య మేముంది? ఇద్దరికీ పెద్దలబాపతు జాగీర్లున్నాయి. జీవనోపాధికి తడుము కోవాలసిన అగత్యమేమీ లేదు. ఇంట్లో ఊరికేకూచుని చేసే దేముంది? ఈ మిత్రుల దినచర్య ఏమంటే, ప్రొద్దున్నే లేచి అల్పాహారం చిత్తగించడం, సావట్లో తివాచీ పరచడం, చతురంగంపావు లమర్చుకోవడం, అక్కడనుంచి యుద్ధాని కుపక్రమించడం, ఎత్తుపై ఎత్తులు వేయడం! ఆ పైని రెండు ఝాములు కానివ్వండి, మూడుఝాములు కానివ్వండి, సాయంకాలం కానివ్వండి వాళ్ల కేమీ లక్ష్యమన్నమాట లేదు. వంటయిందని ఇంట్లోంచి కబుర్లు వస్తూనే ఉండేవి. "వెళ్లు. వస్తున్నా. పీట వెయ్యమను" అంటూ జవాబులు చెప్తూనే ఉండేవాళ్లు. చివరకు ఆ వంటవాడికి ప్రాణం విసిగి భోజనంకూడా చావిట్లోకే తెచ్చిపెట్టేవాడు. స్నేహితులిద్దరూ రెండుపనులూ కలిపే కానిస్తుండేవాళ్లు.

మిర్జాసజ్జాదాలీ ఇంట్లో ఎవరూ పెద్దవాళ్లు లేరు. అందుచేత ఆయన సావిట్లోనే ఈ యుద్ధం సాగుతూ ఉండేది. ఇంట్లోవాళ్లకుమాత్రం సుతలాం ఇష్టముండేది కాదు. వాళ్లకన్నమాటేమిటి, ఇరుగు పొరుగు నౌఖర్లు చాకర్లు,యావన్మందీకూడచాలా హేళనగామాట లాడుతూ ఉండేవాళ్లు. "గొప్ప ఆటరా బాబూ! కొంప గుండంచేసేస్తుంది. ఈ వ్యసనంలో తగుల్కోకుండా దేముడు రక్షించాలి. కాని లేకపోతే ఎందుకూ పనికిరాకుండాపోతారు. ఇదొక పెద్ద తెగులు" అనుకుంటూ ఉండేవాళ్లు. మిర్జాబేగం తన భర్తను చివాట్లు

పెట్టడానికేమైనా సావకాశం దొరుకుతుందా అని చూస్తూఉండేది. కాని అవకాశం దొరికేది కాదు. ఆమె లోపల పడుండేది. బయట ఆట జరుగుతూనే ఉండేది. రాత్రి ఆమె నిద్రపోయాక మిర్జా లోపల ప్రవేశించేవాడు. బేగం తన కోపాన్ని అప్పుడప్పుడు నౌకర్ల మీద తీర్చుకొనేది.

"ఏం! తాంబూలం కావాలంటున్నారా ఓహో! వచ్చి తీసుకెళ్లమని చెప్పు. భోజనానికే తీరుబడి లేకుండా ఉందేం? భోజనం తీసుకెళ్లి నెత్తినెయ్యండి. తింటే తింటారు, లేకపోతే కుక్కల కెయ్యండి" అంటూ విసుక్కునేది. కాని ముఖాముఖి కొచ్చేసరికి జావ అయిపోయేది. నోరు పెగిలేదికాదు. ఆమెకు నిజానికి మీర్ సాహెబుపైన వచ్చినంత కోపం తన భర్తమీద వచ్చేది కాదు. మిర్జాజీ భార్యదగ్గర తన నిర్దోషిత్వాన్ని స్థిరపరచుకోడానికి దోషం అంతా మీర్ సాహెబునెత్తిన పారేసేవాడుకాబోలు!

ఒకరోజున బేగంసాహెబాకు తలనొప్పి లంకించుకుంది. ఆమె దాసీని పిలిచి "సాహెబుగారినిలోపలి కోసారి రమ్మని చెప్పు. వైద్యుడిదగ్గర కెళ్లి కాస్త మందు పట్టుకురావాలి. త్వరగా వెళ్లు"అంటూ పంపింది. తీరా దాసీమనిషి వెళ్లి చెప్పేసరికి మిర్జా "వెళ్లు. వస్తున్నానని చెప్పు"అన్నాడు. బేగంసాహెబాది అసలే కోపస్వభావం. తనకు తలనొప్పిగా ఉంటే భర్త చతురంగమాడుతూ కూచోడమా అనే అహంకారంవల్ల కోపం మరీ ఎక్కువైంది. దాసీతో "పో. మళ్లీ వెళ్లి ఆయనగారికి తీరిక లేకపోతే నేనే వైద్యుడిదగ్గర కెడుతున్నానని చెప్పు"అని సందేశం పంపింది.

మిర్జా మంచి రసకందాయంలో ఉన్నాడు. రెండేరెండెత్తుల్లో మీర్ సాహెబుఆట కట్టేటట్టుంది. తెగ విసుక్కుంటూ "ఏం! అంత ప్రాణం కసిట్టిందా ఏమిటి? ఇంకేం తరువాయిలేదూ?" అన్నాడు.

మీర్ సాహెబు — ఏమిటయ్యా! లోపలి కోసారి వెళ్లిరాకూడదూ! ఆడవాళ్లతో వ్యాపారం చాలా సున్నితం సుమా!

మిర్జా—చిత్తం! అల్లాగే! వెళ్లకేం! రెండెత్తుల్లో మీ ఆట కట్టు.

మీర్—అయ్యా! ఆ కబుర్ల కేంలెండి? ముందు మీజంతువుల్ని కాసుకోండి, తర్వాత ఆటకడుదురు గాని.

మిర్జా- ఎందుకూ? ఇదిగో కట్టేసే వెడతాను.

మీర్—మీరు లోపలి కెళ్లిరండి. అంత వరకూ నే నాడను.

మిర్జా—వెడతానండీ. తలనొప్పికేమిటి పెద్ద మందు? నాప్రాణం విసిగించడాని కేదో వంక గాని.

మీర్— అరే, ఏమవనీ? ఆవిడసంగతి కనుక్కు తీరాలి.

మిర్జా—అల్లాగే! కానియ్యండి. ఈ ఎత్తె

మీర్—వల్లకాదు.మీరు లోపలికెళ్లండి.ఆమె సంగతి కనుక్కొస్తేకాని నేను మొహరామీద చెయ్యి వెయ్యను.

మిర్జా సాహెబు విధిలేక లోపలి కెళ్లేడు. బేగం సాహెబా మొగం చిట్లించుకుంది. మూలుగుతూ "దిక్కుమాలిన చతురంగమంటే అంత వ్యసనం మీకు. ఇంట్లోవాళ్లు ఛస్తున్నాసరే ఆటలోంచి లేవాలనే బుద్ధి తోచనేతోచదు. మీలాంటివాళ్ళు ప్రపంచంలో ఎవరైనా ఉన్నారా అంట" అంది.

మిర్జా—ఏం చెప్పను? మీర్ సాహెబు ఎంత చెప్పినా వినడాయె. అతిప్రయత్నంమీద ఆయన్ని వదిలించుకొచ్చాను.

బేగం-అవును. ఆయనకేమీ పనీపాటా లేదు. అంతా తనలాగే అనుకుంటాడు. ఆయనకుమాత్రం పిల్లా జల్లా లేరూ? వాళ్ల నేమైనా వదిలిపెట్టేడా?|

మిర్జా—ఆయనకుమహావ్యసనం. ఆయ నిక్కడికొస్తే నేనూ విధిలేక ఆడవలసివస్తోంది.

బేగం—ఏం? ఆడనని మొహంమీద చెప్పెయ్యకూడదూ?

-సరిసరి! పెద్దమనిషి. అన్నివిధాలా. వయస్సులో, హోదాలో, అన్నింటిలోనూ నాకన్న బెత్తె డెక్కువవాడుకాని తక్కువవాడుకాడు.

బేగం—అయితే ఆయనకు తగిన శాస్తి నేనే చేస్తాను. కోపం వస్తే రానియ్యండి, ఎవరికిభయం? ఏం? మన్నేమైనా పెట్టిపోషిస్తున్నాడా? ఒసే దాసీ! సావట్లో చదరంగంపావు లిల్లా పట్టుకురా! మీర్‌సాహేబుతో అయ్య ఇంక ఆటకు రారనీ, తమ రిని శలవుతీసుకోమన్నారనీ చెప్పు.

మిర్జా—ఏయ్, ఏయ్, వద్దుసుమా! అల్లాంటి పొరపాటు చెయ్యకుసుమీ. ఆయన్ని అవమానంగాని చేస్తావా ఏమిటి? దాసీ, ఆగు. ఎక్కడికి వెడుతున్నావు?

బేగం—ఏం? దాన్ని వెళ్లనియ్యరా ఏమిటి? మీరు దానికి అడ్డొస్తే నన్ను చంపుకుతిన్నంత ఒట్టే .........అయితే, కానివ్వండి. దాన్ని అడ్డుకోస్తేరు కాని నాకడ్డురండి చూద్దాం.

ఇల్లా అంటూనే రివ్వుమని ఆగ్రహంతో బేగం సాహేబా సావట్లో కెళ్లింది. మిర్జా తెల్లమొగం వేశాడు. బీబీ కాళ్లా వేళ్లా పడ్డాడు. "ఇదిగో, నా మాట వినదూ! నువ్వక్కడి కెడితే హుస్సేన్‌మీద ఒట్టు. నా మీద ఒట్టు" అంటూ బ్రతిమాలేడు. కాని బేగం వినిపించుకోలేదు. సావడిగుమ్మందాకా చరచర వెళ్లింది. కాని సరాసరి పరాయిమొగవాడి ఎదుట పడడానికి కాస్త సంకోచించింది. సావట్లోకి తొంగి చూచింది. అదృష్టవశాత్తూ సావట్లో ఎవ్వరూ లేరు. మీర్‌సాహేబు పావులు అటూ ఇటూ పడేసి బయటికి వేంచేసి తన నిర్దోషిత్వాన్ని స్థిరపరచుకునేందుకా అన్నట్లు వీధిగుమ్మంలో పచారుచేస్తున్నాడు.

ఇంకేముంది? బేగం చెంగుమని సావట్లో కొచ్చింది. పావులు విరజిమ్మేసి నాలిగింటిని వీధిలో పారేసింది. లోపల్నించి గభాలున తలుపేసి గొళ్లెం వేసేసింది. మీర్‌సాహేబు వాకట్లో నుంచుని పావులు బయటపడడం చూచాడు. గాజుల గలగల విన్నాడు. సరే, బేగంసాహేబా అలిగిందని గ్రహించాడు. కిక్కురుమనకుండా ఇంటికి దారితీశాడు.

"చాలాతప్పుసుమా"అన్నాడు మిర్జా భార్యతో.

"తప్పా? ఈసారి ఇక్కడికి రానియ్యండి. చెపాను ఆయనపని. నిలబడ్డపాటుగా గెంటేస్తాను... ...మీరు చతురంగం ఆడుతూ కూచోండి; నేను ఇంట్లో పొయ్యిదగ్గర చాకిరీతో తల్లబద్దలుకొట్టుకుంటూ ఉంటాను. ఏం? ఇప్పుడైనా వైద్యుడిదగ్గరకి తీసుకెడ్తారా లేదా? ఇంకా తలనొప్పిబాధగానే ఉంది."

మిర్జా ఇంట్లోంచి బయలుదేరేడు. సరాసరి వైద్యుడింటి కెళ్లడానికి బదులు మీర్‌సాహేబింటి కెళ్లేడు. జరిగిన యావత్తు కథా వినిపించేడు.

మీర్—పావు లెప్పుడు వీధిలో పడ్డాయో అప్పుడే గ్రహించాను. అందుచేతే వెంటనే పలాయనం చిత్తగించాను. చాలా కోపధారిలా కనిపిస్తుంది. అయితే మీరు ఆమెను నెత్తికెక్కించుకున్నారు. అది అట్టే మంచిది కాదు. బయట మీరేం చేస్తే ఆవిడ కెందుకూ? ఇంట్లో ఏర్పాట్లు చూడడం ఆమెపని. కాని మిగతావిషయాల్లో ఆమె కేమిసంబంధం?

మిర్జా—ఆగొడవల్లా వదిలెయ్యండి. ముందు క ం? మన సమావేశం ఎక్కడ?

మీర్—దానికేముంది బ్రహ్మాండం! ఇదిగో పెద్ద లోగిలి. సరే. ఇక్కడే వేద్దాం.

మిర్జా—కాని బేగంసాహేబాకు సమాధానం చెప్పడం కష్టమే! కొంపలో పడుంటేనే ఇంత జరిగిందే. ఇక ఇక్కడ మనం గ్రంథం సాగిస్తే బ్రతకనిస్తుందా?

మీర్—ఏమిటండీ మరీ! అరచుకోనియ్యండి. నాలుగురోజులు రుసరుసమంటుంది; అయిదోరోజున ఆమే సర్దుకుంటుంది. మీరుమాత్రం కాస్త నిదానించండి. అంతే.

—

మీర్‌సాహేబుబేగంకు సాహేబు కొంపకు దూరంగా ఉండడమే ఇష్టం. దాని కేవో కొన్ని కారణా లున్నాయి. అందుచేతనే ఆమె ఎప్పుడూ ఆయనచతురంగవ్యసనాన్ని గురించి అంత అడిగేది కాదు. ఇంటికి బాగా ఆలస్యంగా వచ్చినప్పుడు మాత్రం కొత్త పల్చపల్చగా అంటించేది. ఆకారణం చేత మీర్‌సాహేబు తన ఇల్లాలు మహా వినయశీల, గంభీర అనే భ్రమలో పడుండేవాడు. కాని రాత్రిం బవళ్లూ సావట్లో తివాచీ పరచి చతురంగం ప్రారం భించేసరికి బేగంసాహేబాకు కష్టం కలగడం ప్రారంభ మైంది. ఆమెస్వేచ్ఛకు అడ్డంకలిగింది.

నౌఖర్లు చాకర్లుకూడా గుసగుసలాడడం ప్రారం భించారు. ఇంతవరకూ పనీ పాటా లేకుండా ఈగలు తోలుకుంటూ ఒకచోట పడుండేవాళ్ళు. కొంపలో కెవరొచ్చినా ఎవరు వెళ్లినా వాళ్ల కేగొడవా పట్టేది కాదు. ఇప్పుడు ఎనిమిది ఝాములూ ఒకటే హైరాను. తాంబూలం తెమ్మని ఒకసారీ, మిఠాయి పట్టుకురమ్మని ఇంకోసారీ ఏదో ఎప్పుడూ ఒక్కటే పని. హుక్కా సంగతి చెప్పనక్కరేలేదు. ప్రేమ పీడితుల హృదయా ల్లాగ రగుల్తూ ఉండాలసిందే. బేగం సాహేబాదగ్గర నౌఖర్లు గోలపెట్టడం ప్రారంభించారు:

“అమ్మగారూ! అయ్యగారి చతురంగం మా ప్రాణాల కొచ్చింది. పగలల్లా అటూ ఇటూ పరుగు లెత్తేసరికి మాకాళ్ళు బొబ్బలెక్కిపోతున్నాయి. ఒళ్లు హూనం అయిపోతోంది. ఇదేమి ఆటమ్మా! ప్రొద్దున్న కూచుంటే సాయంత్రమైనా కదలరాయె! ఏదో మనోల్లాసంకోసం రోజు కోగంటో అరగంటో ఎవరైనా ఏదైనా ఆడుకోవడం కద్దు కాని రాత్రిం బగళ్లూ ఆడేఆట ఇదేమిటి? కానియ్యండి; మేము ఫిర్యాదుకోసం చెప్పడం లేదు. తమ నౌఖర్లం. తమ రేమి చెయ్యమంటే అది చేతులుకట్టుకుచేస్తాం. కాని ఈఆటమాత్రం కొంపకు ముప్పుతెస్తుంది. ఈ వ్యసనం లో పడ్డవాళ్లు అయిపూ మచ్చా లేకుండా పోతారు. ప్రమాదం తప్పదు. ఒకళ్లను చూచి ఒకళ్లు చివరకు పేటపేటంతా ఈ గుండంలో పడిపోతారు. ఏలినవారి ఉప్పు తింటున్నాం కనుక ఇంతవరకూ చెప్పుకోవలసి వచ్చింది. తమరి కీర్తికి కలిగే కళంకాన్ని విని మనస్సు పట్టలేకపోయాం. తర్వాత మీ ఇష్టం.”

“అవును, నేనూ చూస్తూనే ఉన్నాను. నాకూ ఇష్టంలేదు. కాని ఏమిటి చెయ్యడం? నేను కాదు ఎవరు చెప్పినా ఆయన వినడు.”

ఆపేటలో ఇద్దరుముగ్గురు పాతకాలపువాళ్లుండే వాళ్లు. వాళ్లు తమలో “ఇప్పుడేమీ లక్ష్యం ఉండదు. తర్వాత తెలుస్తుంది. మన ధనికుల అవస్థ ఇల్లా ఉంటే మన దేశాన్ని దేవుడు రక్షించాలి, అంతే. మన రాజ్యమే ఈ చతురంగానికి ఎప్పుడో బలిఅయిపో తుంది.” అనుకునేవాళ్లు.

రాజ్యంలో గగ్గోలు పుట్టింది. పట్టపగలు దోపిళ్లు ప్రారంభమైనాయి. ప్రజల గోడు ఆలించే దిక్కూ, పాలించే దిక్కూ లేదు. గ్రామాల్లోని సర్వ సంపత్తినీ లక్నోకు లాక్కురావడం, ఇక్కడ దాన్నంతా వేశ్యలకూ, త్రాగుడు మొదలైన వ్యసనా లకూ సమర్పించడం జరుగుతోంది. ఇంగ్లీషుకంపెనీ కివ్వవలసిన ఋణం రోజురోజూ పాపం పెరిగినట్లు పెరిగిపోతోంది. రాజరికం సరియైన బందోబస్తులో లేకపోవడంచేత పన్నులు బకాయీలుపడిపోయినాయి. కంపెనీతాలూకు రెసిడెంటు తరుచు మందలించడం ఆరంభించాడు. కాని విలాససాగరంలో మునగానాం తేలానాంగా ఉన్న లక్నోప్రజలకు చీమకుట్టడం లేదు.

మీర్‌సాహేబుసావట్లో నెలలతరబడి చతు రంగం సాగుతూనే ఉంది. కొత్తనడకలు, వింతయెత్తులు, చిత్రమైన మొహరింపులు, అభేద్యమైన వ్యూహాలు వీటిలో నిపుణులైనారు స్నేహితు లిద్దరూను. అప్పు డప్పుడు ఆటమధ్య మాటా మాటా వచ్చి పొరపొచ్చాలు పొరపొచ్చాలు ప్రజ్వరిల్లి చివరికి ఛీ అంటే ఛీ, తూ అంటే తూ అనుకోవడందాకా వస్తూఉండేది. కాని





# పిలువని బంధువులు

వారి ఆగమనం కొరకు సన్నాహం చేసి ఎదురు చూస్తోన్న బంధువుల కంటె అనుకోకుండావచ్చే చుట్టాలకి ఎప్పుడూ ఎక్కువ స్వాగతమే.

మీ గృహాలలోకాని, వ్యాపార స్థలాలలోకాని, వేసవికాలంలోకాని, శీతకాలంలోకాని మీకొరకై వచ్చిన వారికి మీరు సామాన్యంగా చేసే ఆదరం స్వాగత పూర్వకంగా ఓ కప్పు స్వచ్ఛమైన టీ (తేనీరు) ఇవ్వడమే.

భారతదేశమందు అన్ని ఊళ్లలోనూ డిపోలనుండి **మా** సేల్స్‌మెన్ వాడుకగా బ్రూక్‌బాండ్ టీ సరఫరా చేస్తున్నారు. మీరు ఎక్కడవున్నా సరే. మీ ఆహార స్థలానికి ఇది మా తోటలనుండి కోయబడినట్టి స్వచ్ఛస్థితిలో చేరుతుంది.



తోటనుండి పాత్రకు
నిత్యమూ స్వచ్ఛస్థితిలో

# బ్రూక్ బాండ్

## రెండు ఆకులు - ఒక మొగ్గ.

వెంటనే రాజీపడిపోయి సర్దుకునేవారు. ఒక్కొక్కప్పుడు బలం విరజిమ్మేసి లేచిపోవడంకూడా తటస్థించేది. కాని నిద్రతో ఆ మాలిన్యాన్ని మరచిపోతూ ఉండేవారు. తెల్లవారడంతోటే మళ్లీ మీర్‌సాహేబు సావట్లో మిత్రులిద్దరూ చతురంగసన్నాహంలో పడుండేవాళ్లు.

ఒకనాడు స్నేహితులిద్దరూ మాంచి ఎత్తులో నిమగ్నులై ఉండగా, పాదుషాసైనికోద్యోగి గుర్రం మీదనుంచి గుమ్మంలో దిగేడు. దిగుతూనే "మీర్ సాహేబుగారున్నారా?" అని అడిగేడు. సాహేబుకు ప్రాణాలు ఎగిరిపోయాయి. ఏమికొంపమునకొచ్చిందో అని కంగారుపడడం మొదలెట్టేడు. ఎన్ని విధాల ఆలోచించినా కారణం ఆనలేదు. తలుపు గడియవేసుంది. నౌఖరుతో "ఇంట్లో లేడని చెప్పు" అని చెప్పాడు.

సిపా—ఇంట్లో లేకపోతే ఎక్కడున్నారు?

నౌ—ఆసంగతి నాకు తెలియదు. అయినా తమరొచ్చిన పని శెలవిస్తారా?

సిపా—పని నీకు చెప్పేదేమిటి? మీర్ సాహేబును నిలుచున్నపళంగా తీసుకురమ్మని పాదుషావారి ఆజ్ఞ. సైన్యంలోకి మనుష్యుల్ని చేర్పించాలి. జాగీర్దారంటే వేళాకోళమా? యుద్ధంలో ముందుకు దూకాలి. అప్పుడు తెలుస్తుంది అయ్యగారి

నౌ—చిత్తం. తమరు దయచెయ్యండి అయ్యగారితో మనవిచేస్తాను.

సిపా—మనవిచేయడాని కేమీ లేదు. రేపు నేను మళ్లీ వస్తాను. ఖుద్దున తీసుకురమ్మని పాదుషావారి హుకుం.

సిపాయి వెళ్లిపోయినాడు. మీర్‌సాహేబు గుండెల్లో దడదడ ప్రారంభమైంది. "ఏమిటి కర్తవ్యం" అన్నాడు మిర్జాతో.

మిర్జా—నాక్కూడా పిలుపొచ్చిందా కొంప మునిగిందన్నమాటే.

మీర్—దౌర్భాగ్యం! మళ్లీ రేపు వస్తానంటూ పోయాడే వీడు?

మిర్జా—ముప్పే. సందేహమేమిటి?...యుద్ధంలోకి మం కాలసొస్తే చచ్చే చావే!

మీర్—ఉందిలే దీనికి ఒక యుక్తి. ఇంట్లో మనం దొరికితేకదా వాడు తీసుకెళ్లడం? రేపటినుంచి గోమతిఒడ్డున పాడుకొంపల్లో ఒకదానిలో చీకిడి పరుద్దాం. అక్కడికి ఎవ్వరి కబురూ అందదు. సిపాయి వస్తాడు; వెడతాడు. అంతే.

మిర్జా—బలే బాగా తోచింది ఊహ. అదే యుక్తి. మరొకటి కనుపించడం లేదు.

ఆ వచ్చిన రౌతుతో మీర్‌సాహేబుబేగం "బాగా దొడ్డెత్తించావుకాదూ" అంది.

"ఆహా! ఇల్లాంటి మూర్ఖులను నూరుమందిని చిటికెనవ్రేలిమీద ఆడించగలను. వీళ్ల తెలివితేటలు, ధైర్యం చతురంగంలో ఉపయోగపడుతున్నాయి. ఇక పొరపాటునకూడా కొంపలో ఉండరు" అంటూ వెళ్లిపోయాడు సిపాయి.

మర్నాడు భాయీలిద్దరూ వెలుగాలు దిగా లేసుకుని గుమ్మంలో నిలబడ్డారు. ఒక చిన్న కంబళీ చంకనెట్టుకున్నారు. పాన్‌దాన్ చేత్తో పుచ్చుకొని గోమతి ఒడ్డున పాడడిన మసీదుకు ప్రయాణమైనారు. దారిలో పొగాకు, గంజాయి వగైరాలు సమకూర్చుకుని మసీదుకు చేరుకున్నారు. కంబళీ పరచి చతురంగాని కుపక్రమించారు. అంతే. ఇక వాళ్లకూ, బయటి ప్రపంచానికీ సంబంధమే లేదు. రాజు, త్రోసి రాజు, కట్టు మొదలైనవేవో రెండుమూడు మాటలు తప్ప మారుగొడవే లేదు. యోగీశ్వరేశ్వరులు సమాధిలోనైనా ఇంత ఏకాగ్రంగా ఉండలేరు. రెండుఝాములు తిరిగి కాస్త ఆకలైతే దగ్గరలో ఉన్న ముసలమ్మ రొట్టెల దుకాణంలో కాస్త మంచిమాట చేసుకుని తిరిగి యుద్ధరంగంలో పడేవాళ్లు. తరుచు ఆ భోజనం ధ్యాసకూడా ఉండేదికాదు.

దేశంలోని రాజకీయ వ్యవహారాలు భయంకరావస్థలో పడిపోతున్నాయి. నగరంలో గలభా హెచ్చుయిపోయింది. కంపెనీసేనలు లక్నోమీదికి పొచ్చుకొస్తున్నాయి. పిల్లా మేకలతో సహా జనం గ్రామాలకు పారిపోతున్నారు. కాని మన చతురంగ యోధులకిద్దరకూ చీమ చిటుకు వడం లేదు. ఇంట్లోంచి వచ్చేటప్పుడు పాదుషాతాలూకు ఉద్యోగస్థులకండ్లబడకుండా దొంగల్లాగ సందుల్లో గొందుల్లో పడి మెల్లగా మసీదు చేరుకునేవాళ్లు. సాలుకు వేలకొద్దీ ఆదాయాన్ని యిచ్చే జాగీర్లను ఊరికే కూచుని జీర్ణం చేసుకోవాలని వాళ్ల సంకల్పం.

ఒక్కరోజున ఆ పాడుమసీదులో కూచుని చతురంగం ఆడుతున్నారు మిత్రులు. మిర్జాఆట కొంచెం లీతుగా ఉంది. మీర్‌సాహెబు రాజుమీద రాజు చెపుతూ డేకిస్తున్నాడు. ఇంతలో కంపెనీ సేనలు లక్నోమీద కొస్తున్నాయి.

మీర్—అరే బాబా! ఇంగ్లీషుసేన లొచ్చి పడుతున్నాయే!

మిర్జా—రానియ్యండి! రాజుని తప్పించుకోండి ముందు. ఇదిగో రాజు.

మీర్—కొంచెం ఉండవయ్యా! ఇదిగో ఈమూల కొచ్చేయి సేనలు.

మిర్జా—తొందరేముంది! ఇదిగో శాహ!

మీర్—ఫిరంగులుకూడా ఉన్నాయే. ఎంత లేదన్నా అయిదు వేలమంది ఉంటారు. మంచి జవానులే. మనుష్యుల వైఖరి చూస్తేనే హడలెత్తుతోంది.

మిర్జా—ఈ వంకల కేమిలెండి! ఈ డొంక తిరుగుడు కబుర్లు మరెవరితోనైనా చెప్పండి. ఇదిగో రాజు.

మీర్—మీరు చాలా చిత్రమైన మనుష్యులండీ! అక్కడేమో పట్టణంమీద ముప్పొచ్చిపడుతోంది. ఇక్కడ మీకు రాజుతప్ప మరో గొడవ లేదు ...కొంచెం ఈ సంగతికూడా ఆలోచించండి. నగరం ముట్టడైపోతే కొంపకు చేరుకోవడ మెల్లాగ?

మిర్జా—ఇంటి కెళ్లే వేళ కానియ్యండి. ఆలోచిద్దాం. ఇది రాజు! దెబ్బతో ఆట కట్టు.

సైన్యం పదిగంట లయ్యేసరికి వెళ్లిపోయింది. మన మిత్రులు కొత్తఎత్తు ప్రారంభించారు.

మిర్జా—ఇవ్వేళ భోజనం ఎల్లాగు?

మీర్—ఉపవాసమే. మీ కేమైనా ఆకలిగా ఉందా?

మిర్జా —అది కాదు. ఊళ్లో ఏమవుతుందో మరి.

మీర్—ఊళ్లో ఏమవుతుంది? ఏమీ కాదు. అంతా భోజనం చేసి విశ్రాంతిగా మంచాలమీద దొర్లుతుంటారు. నవాబుగారు కేళీమందిరంలో ఉండి ఉంటారు.

చతురంగం ఎత్తుమీద ఎత్తేసేసరికి మూడుగంట లయింది. మిర్జాజీఆట నీరసంలో పడిపోయింది. నాలుగుగంటలు కొడుతుండేటప్పటికి ఇంగ్లీషుసేనలు తిరిగొచ్చేస్తున్నాయి. అదే కోలాహలం వినిపించింది. వజీదాలీషా పట్టుబడ్డాడు. కంపెనీసేన లాయన్ని ఎక్కడకో తీసుకుపోతున్నారు. నగరంలో ఏవిధమైన ఆందోళనా, పోరాటం కనబడడం లేదు. ఒక్క రక్తపుచుక్క నేలబడలేదు. ఇంతవరకూ ఏ స్వతంత్రరాజుయొక్క పతనంకూడా ఇంత రక్తపాత రహితంగా జరిగిఉండలేదు. ఇందుకు కారణం ముక్కోటిదేవతలూ హర్షించే అహింసాదీక్ష కాదు. కేవలంపిరికితనం. కత్తిలేని పిరికితనం. అయోధ్యవంటి విశాలదేశానికి నవాబుగానున్నవాడిని ఖైదుచేసి పట్టుకుపోతుంటే 'కిం'అనేవాడు లేడు. లక్నో సుఖంగా భోగనిద్రలో పడుంది. రాజకీయపతనానికి ఇంతకన్న అధోగతి ఉండదు.

మిర్జా—ఏమండోయి, నవాబుగారిని శత్రువులు ఖైదీగా పట్టుకుపోతున్నారు.

మీర్—పట్టుకెళ్లనివ్వండి... ఇదిగో రాజు.

మిర్జా—ఏమిటండీ! కొంచెం నిదానించండి. మన స్నిక్కడ నిలువడం లేదు. పాపం! నవాబు గొల్లున గోలపెట్టి ఉంటాడు.

మీర్—ఏడ్చేఉండాలి! ఈ భోగం ఎక్కడెక్కడనుంచి వస్తుంది?......ఇదిగో రాజు.

మిర్జా—ఎవడికీ రోజులన్నీ ఒక్కగతిగా వెళ్లవుకదా!......దిక్కుమాలిన జీవితం.

మీర్—అంతే. అవును...ఈసారి కాసుకోండి రాజు! ఇంకో ఎత్తులో ఆటకట్టు.

మిర్జా—ఓయి నీరాజు దొంగలుదోలా! నీవెంత కఠినుడ వయ్యా! అలాంటి ఘోరం చూస్తుంటే దుఃఖం రావడం లేదూ? అయ్యో! పాపం! వజీరాలీ!

మీర్—అయ్యా! ముందు మీపాదుషాను రక్షించుకోండి, తర్వాత ఆపాదుషాగతి ఆలోచిద్దురుగాని... ఇదిగో రాజు...ఆటకట్టు.

నవాబును పట్టుకుని సేన కళ్లముందరనుంచి వెళ్లిపోయింది. మిర్జా మళ్లీ బలం అమర్చేడు. ఓటమి మనస్సును కుమిలించేస్తోంది.

"సరే రండి. నవాబుపరాజయానికి ఒక్క ఏడుపు ఏడ్చేశాంగా?" అనేశాడు. మిర్జారాజభక్తి తన పరాజయంలో లీనమైపోయింది. తన ఓటమికి ప్రతీకారం చేయాలనే దృఢసంకల్పంలో పడ్డాడు.

## ౪

సాయంకాలమైంది. ఆ పాడుగడ్డల్లో నక్కలు కూయడం ఆరంభించాయి. గబ్బిలాలు తమతమ గూళ్లల్లో చేరుకుంటున్నాయి. ఇద్దరు చతురంగ యోధులున్నూ అతిపట్టుదలతో ఆడుతున్నారు. ఒకళ్ల రక్తం ఒకళ్లు త్రాగడానికి సిద్ధంగా ఉన్నారా అనేటంత పట్టుదలగా కూచున్నారు. మిర్జాజీ వరుసగా మూడాటలు ఓడిపోయాడు. నాల్గవ ఎత్తువైఖరికూడా బాగా లేదు. అనేకసార్లు నిలద్రొక్కుకుని తప్పకుండా గెలిచితీరాలనే దీక్షతో ఆడుతున్నాడు. కాని ప్రతిసారీ ఏదో విఘాతం వచ్చిపడుతోంది. ఆటబిగి తప్పిపోతోంది. ఓడిపోయినప్పుడల్లా కసితీర్చుకోవాలనే అభిలాషకూడా ఎక్కువైపోతోంది. మీర్‌సాహేబు విజయగర్వంతో కూనిరాగాలు తీస్తున్నాడు. మహాభాగ్యం సిద్ధించినట్లు సంతోషిస్తూ చిటికెలేస్తున్నాడు. ఆ చిటికెలు వింటూంటే మిర్జాఒళ్లు మండిపోతోంది. పరాజయంవల్ల కలుగుతుండే గుండెభివానాన్ని కనుపించకుండా చెయ్యడానికి ఎన్నివిధాల ప్రయత్నం చెయ్యాలో అన్నివిధాలా చేశాడు. కాని బాజీబలం తగ్గినకొద్దీ ధైర్యం సడలిపోతూవచ్చింది. చివరికి మాటా మాటాదాకా వచ్చింది.

"ఏమండోయి. వేసినెత్తు తియ్యకండి మరి... మొదటో ఎత్తు వేశారు. మళ్లీ తీసుకుంటారేం? వెయ్యదలచుకున్న ఎత్తొక్కసారే వేసెయ్యండి...... జంతువుమీద చెయ్యల్లా పెట్టుకునికూర్చుంటే ఏమిటర్థం? మొహరామీద చెయి తియ్యండి. ఎత్తు తోచకపోతే తోచినతర్వాతే మొహరామీద చెయ్యి వెయ్యండి. ఒక్కొక్కఎత్తేనేసరికి అరగంట అవుతోంది. అది ఆటసబబుకాదు. ఎత్తు కయిదునిముషాలకన్న ఎక్కువయితే ఓడిపోయినట్లే......మళ్లీ ఎత్తు మారుస్తున్నారు. ముందాజంతువు నక్కడ పెట్టండి."

మీర్‌సాహేబుమంత్రి పోతోంది...... "నేనింకా ఎత్తువెయ్యందే" అన్నాడు.

మిర్జా—అబ్బే...! ఎత్తు వేశారు. ముందు జంతువు నక్కడ పెట్టండి...ఆ ఇంట్లోనే...

మీర్—ఆ ఇంట్లో ఎందుకు పెట్టాలి? జంతువుమీద చెయ్యి నేను తియ్యందే?

మిర్జా—చెయ్యి మీరు ఎప్పుడూ తియ్యరు. ఎంత ప్రళయ మొచ్చినాసరే. ఇక ఆట సాగేదేమిటి? మంత్రి పోతోంది. అందుచేత ఈమోసం చేస్తున్నారు.

మీర్—ఏమండోయి, మాటలు సరిగా రానియ్యండి. మోసం మీది. జయాపజయాలు దైవాధీనం అన్నారు. మోసంవల్ల ఎవరూ గెలవరు.

మిర్జా—అయితే ఈ ఆట మీరోడిపోయినట్లే.

మీర్—నేనెందు కోడిపోయాను?

మిర్జా—అయితే మీరు జంతువును ఏ యింట్లోంచి తీశారో ఆయింట్లో పెట్టండి.

మీర్—అక్కడెందుకు పెట్టాలి? పెట్టను.

మిర్జా- -ఎందుకు పెట్టరు? పెట్టితీరాలి.

తగాదా పెరిగిపోయింది. ఎవరి పట్టు వారిదే. ఉభయులూ దిగలేదు. అప్రస్తుత ప్రసంగాలు ఆరంభమైనాయి

మిర్జా -ఎవడికైనా పెద్ద తెప్పవైనా చతురంగం మొహం ఎరిగుంటే ఆటసాంప్రదాయాలు తెలుస్తాయి. గడ్డికోసుకు బ్రతికినవాళ్లు చతురంగం మొహమే మెరుగుదురు? జమీందారైతే నేమి? జాగీరుంటే నేమి? ఘామేదా ఎక్కడనుంచి వస్తుంది?

మీర్—ఏమిటీ? మీ బాబు గడ్డికోసుకు బ్రతికేడేమో? మా ఇంట్లో తరతరాలుగా ఆడుతున్నాం చతురంగం.

మిర్జా—వెళ్లవయ్యా! చెప్పేవు కబుర్లు. గాజీయుద్దీన్ హైదర్ దగ్గర వంటచేసుకుని కాలక్షేపం చేశారు. ఇప్పుడు పెద్ద జమీందారులైపోయారు. జమీందారులవడం అంటే అల్లాటప్పా వ్యవహారం కాదు.

మీర్—ఎందుకు మీ పెద్దల ముఖాని కల్లా మసిపూసుకుంటారు. మీవాళ్లు వంటలు చేసేరేమో కాని మావాళ్లెప్పుడూ పాదుషాసహపంక్తి భోజనం చేస్తూనేవచ్చారు.

మిర్జా—వెళ్లవయ్యా, ఆత్మస్తుతి కాయకోతలు కోయకు. గొప్పకబుర్లు చెపుతున్నావే!

మీర్—కొంచెం నోరు సంబాళించుకోండి. మాటలు జాగ్రత్తగా రానివ్వండి. లేకపోతే బాగా జరుగదు. గుస్సైరచేస్తే గ్రుడ్లు తోడేస్తాను! నామర్దా మాటలు సహించలేను. ఎవరైనా సరే. నాలుక తోడేస్తాను ......ఏమనుకున్నావో తడాఖా!

మిర్జా -నా తడాఖా చూస్తారా ఏమిటి? అయితే రండి. అయినా పైసా తేలిపోవాలి.

మీర్—ఈకబుర్లకు జాలైపోయేవా ళ్లెవ్వరూ లేరు ఇక్కడ.

స్నేహితు లిద్దరూ కత్తులు తీశారు. అది నవాబుల కాలం. తల్వార్లు, పేష్‌కబ్జు, కటార్లూ మనుష్యుల వంటిమీద ఉండేవి. ఇద్దరూ అవటానికి భోగపరాయణులే కాని పిరికివాళ్లుమాత్రం కారు. పాదుషాకోసం చావడ మెందుకనుకున్నారు కాని తమ వ్యక్తిపౌరుషాన్ని ప్రదర్శించడానికి మాత్రం సంకోచించలేదు. ఇద్దరూ కత్తులు దూసి ఒకళ్లమీద ఒకళ్లు దూకేరు. కత్తులు ఝణఝణలాడేయి. 'టప్'మని శబ్దం అయింది. ఇద్దరూ వ్రేట్లు తిని క్రింద పడ్డారు. గిలగిల కొట్టుకుని ప్రాణాలు వదిలేరు.

పాదుషా ప్రాణాలు పోతుంటే ఇద్దరి కళ్లనుంచీ ఒక్క కన్నీటిబిందువైనా రాలలేదు. కాని చతురంగంలో మంత్రిప్రాణంకోసం తమ ప్రాణాలను అర్పించేశారు!

చీకటి కమ్ముకుపోయింది. చతురంగం పావులు అమర్చిన వమర్చినట్లుగానే ఉన్నాయి. ఈ వీరుల కోసం ఏడుస్తున్నారా అన్నట్లు చతురంగంలోని రాజులు తమ తమ సింహాసనాలమీద కూచునే

అంతా నిశ్శబ్దమైపోయింది. ఆ శిథిలాల్లో పడిపోయిన గోడలు, విరిగిన బురుజులు, కూలిపోయిన లాజులు ఆ శవాలను చూస్తూ తలలు వంచుకున్నాయి.

('ప్రేమచందు' నుండి)





వీరభద్రస్వామి దేవాలయముతో పునీతమైన లేపాక్షి గ్రామ దృశ్యము. (Courtesy ; Archæological Survey of India.)

# పాక్షిలోని రాయలనాటి చిత్రశాల

పాక్షియనునది అనంతపురము జిల్లాలో హిందూపురమునకు తొమ్మిదిమైళ్లదూరమున నున్న ఒక కుగ్రామము

అందున్న వీరభద్రస్వామి దేవాలయము నేడు చివికి జీర్ణించిపోయి, గబ్బిలపుగూళ్లతో గబ్బుకొట్టుచున్నప్పటికిని, దాని ప్రాచీనచరిత్రను బట్టియు, అందలి శిల్ప, చిత్రకళాసౌందర్య సౌభాగ్యములను బట్టియు సౌందర్యోపాసకులకును, కళాభిమానులకును ఆదరపాత్రమై బహుప్రసిద్ధిగాంచియున్నది.

ఆ దేవాలయమును కట్టించిన ధర్మాత్ముడు క్కిసెట్టి కొడుకు విరుపణ్ణ. అతడు విజయనగర సామ్రాజ్యము నేలిన శ్రీకృష్ణదేవరాయల కోశాధిపతి. ఈ నిర్మాణములో ఇతనికి ఇతని సోదరుడైన వీరణ్ణతోడ్పాటుకూడ లభ్యమైనది.

ఆరోజులలోనే ఒకనాడు విరుపణ్ణకు ఆ దరిదాపులలో ఎక్కడనో ఒకచోట తలవని తలంపుగా ఒకవీరభద్రవిగ్రహము దొరకెనట. దైవికముగాదొరకిన ఆవిగ్రహమునకు ఎట్లయిన నొక ఆలయమును కట్టింపవలెనని విరుపణ్ణ గట్టిగా నిశ్చయించుకొనెను. అంతకుముందు అక్కడ కూర్మశైలముమీద (తాబేటిఆకారముతోనున్న రాతిమీద) 'చిన్నచిన్నగుళ్లు చిల్లరదేవుళ్లు' మాత్రమే ఉండినవి. వానిలో ముఖ్యమైనది పాపనాశేశ్వరాలయమను ఒక చిన్న పాటి ఆలయము. ఈసంకల్పము కలిగినతోడనే, విరుపణ్ణ, రాజుగారు

గ్రామమునలేని సంగుచూచుకొని, బొక్కసములోని ధనమును వెచ్చించి, తాను గాంచుచు వచ్చిన కలల ప్రకారముగానే ఈ వీరభద్రునికి పాపనాశేశ్వర సన్నిధానములోనే అదే ఆవరణలోనే ఒక దివ్య సుందర దేవాలయమును కట్టించి "అమ్మయ్య! నేటికి నాజన్మ తరించినది. కృతార్థుడనైతి" నని సంతోషించెనట.

శిల్పసౌభాగ్యములోను, వాస్తు సంప్రదాయ సంనిధానములోను ఈ దేవాలయము అన్నిందాలా సంపూర్ణమై, అపూర్వమై వెలసినది. యజ్ఞశాలత్రముగా మంటపము, మహామంటపము, కల్యాణమంటపము మొదలయిన సర్వలక్షణములతో శోభాయమానమై వెలిగినది.

ఈ దేవాలయములో కెల్ల మిక్కిలి అందమైనది మహామంటపము. దానిని కట్టిన శిల్పిచాతుర్యము చెప్ప తరముగాదు. అది 66 స్తంభముల బ్రహ్మాండమంటపము. వానిలో రెండు చాల వింతగొలుపునవి. అడుగు భాగమున ఒకవూలమాత్రమే నేలనానియున్న ఆకంబముల సన్నివేశములోని భావమేమో తెలియరాకున్నది. స్తంభము లన్నింటిమీదను మనోహరములగు గాయన గాయనీమణుల కల్పనా చిత్రములు చెక్కబడియున్నవి.

ఈ మండపములో నిలుచుకొని తలయెత్తి పైకి చూచితిమేని మిద్దెకు వేసియుండు బండలమీద రంగు రంగుల బొమ్మలు రంగుమీరియుండుట గోచరించును. రామాయణకథలు, భారతకథలు, ఐతిహాసికకథలు, పురాణకథలు ఇత్యాదిగా ఎన్నియోకథలు వానియందు చిత్రింపబడియున్నవి.

రాయలనాటి చిత్రకళా ప్రశస్తికి ఈ చిత్రములు కొన్ని మచ్చుముక్కలుగా వెలయుచున్నవి.

ఈ చిత్రములు తయారుచేయించిన మహానుభావుడుకూడ విరుపణ్ణయే.

ఇంతకళాభిమానమును, ఇంత దైవభక్తిని చూపినందుకు అతనికి ముట్టిన ప్రతిఫలమేమో తెలియునా? బొక్కసములోని రొక్కము తన యిష్టానుసారము వాడుకొన్నందుకు అతని కన్నులు పొడిచివేయవలయునని రాజుగారి ఆజ్ఞయైనది. అయనశాసనము చండశాసనము. ఈ సంగతి చెవినిబడగానే విరుపణ్ణ ఈషణ్మాత్రమైనను జడియక "ఇంతేకదా! ఈ మాత్రమునకు ఇతరులేల నా కన్నులను పొడవవలెను? వారికెందుకు వృథా శ్రమ? నేనే నా కన్నులను పొడుచుకొన్న తీరిపోవునుకదా!" అని తన కన్నులను తానే పొడుచుకొనెను. అంతటి ఆత్మాభిమాని అయన!

ఇది జరిగిన మరి కొంతకాలమునకే విరుపణ్ణ ఇహలోకమునుగూడ వీడిపోయెను. ఈ మండపమునకు ఇంకను ఎన్నో వన్నెలు చిన్నెలు తీర్పనెంచియుండిన ఆయన్న నిర్యాణముతో ఆ పని అంతతోనే ఆగిపోయెను.

ఈ వీరభద్రస్వామి ఆలయమునకు చేరువనే అదే ఆవరణలోనే రామాలయముకూడ ఒకటి నెలకొనియున్నది. లేపాక్షి రామాయణమనెడి యక్షగానమును ఈ గ్రామపు కవులే రచించినారు.

ఈ యూరికి తూర్పున ఒక ఫర్లాంగు దూరములో నున్న రాతిబసవణ్ణ విగ్రహము మిక్కిలి మెచ్చుకోదగియున్నది. ఇంత పెద్దనంది విగ్రహము దక్షిణదేశములో ఇంకెక్కడనులేదు. దానియెత్తు 14 అడుగుల 10 అంగుళములు; పొడవు 27 అడుగుల 4 అంగుళములు; వెడల్పు 23 అడుగుల 7 అంగుళములు.

లేపాక్షి దేవాలయములోని ఈ చిత్రకళాప్రభావమును వర్ణించుట మాటలతో పనికాదు. చక్కని ఎరుపు, నీలము, పసుపు పచ్చ, ఆకుపచ్చ, నలుపు, తెలుపు లుపయోగించి ఈ అద్భుత చిత్రములు గీయబడినవి. పరిస్ఫుట రేఖల తీర్పునకు భారతదేశము పేరుగాంచినది లేపాక్షి చిత్రములు ఆ ప్రతిష్ఠను నిల్పినవి. పెంచినవన్నను తప్పులేదు. శివ, వీరభద్ర, విష్ణ్వాలయములు మూటికిని సమానమైన ముఖమండపము పైకప్పు లో పలి భా గ మున మహాభారత, రామాయణాది పౌరాణిక గాథల నెక్కుడుగ

వ్రాపినను వీరభద్రదేవాలయపు గోడలమీదను, శివాలయపు అర్ధమండపమునను శివకథలు అచ్చెరువు గొల్పునట్లు చిత్రింపబడియున్నవి. పార్వతీ పరిణయము, పార్వతీపరమేశ్వరుల పరస్పరానురాగ క్రీడలు, త్రిపురసంహారము, శివతాండవములోని ఆఖ్యాయికలును ఈచిత్రములకు వస్తువులయినవి. గౌరీప్రసాద శివుడను చిత్రమున పద్మములు, మీనములతో జటాజూటమునుండి ప్రవహించు గంగను మరుగుపరుప జూచుచు శివుడు పార్వతి చిబుకముపై చేయిడి బుజ్జగించుట, ఖండితానన పార్వతి ప్రణయకోపమున మోముద్రిప్పుట, ఆదంపతుల కండ్లతీరు, ముఖములసౌరు చూపరులను ముగ్ధులను గావించును. పరిణయమునకు ముందు పార్వతియలంకారము, పార్వతీపరమేశ్వరులు చదరంగమాడుట స్వభావప్రతిబింబములై యొప్పుచున్నవి. శివుడు అంధకాసురసంహారమొనర్చుచోట ముఖమున శాంతి, కరమున శూలము పెట్టి రుద్రుని నిర్లిప్త ధర్మపరతను చాటించినారు. కృష్ణుని వేణుగానము గోపికలను సమ్మోహితలను జేసినట్లు శివుని భిక్షాటనము ఋషిపత్నులను సమ్మోహితలను గావించుట కమ్మగా జూపినారు. వృషభారూఢశివుడు, నటేశుని ఆనందతాండవము, శివానుగ్రహము, దక్షిణామూర్తి మున్నగు నితరచిత్రములు కూడ చిత్రకారుల చిత్రకళావైదగ్ధ్యమును వేనోళ్ల చాటుచున్నవి. వారి వైదగ్ధ్యమును గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు మొదలైనవారు బాగుగా ప్రస్తుతించియున్నారు.

కళాఖండములైన ఈ చిత్రములు ఆదరించి, ఆలించి, పాలించు దిక్కులేక, వాననీటి జల్లులతోను, మట్టిమశాణములతోను రూపుమాసిపోవుచున్నవి. కళాకేంద్రముగా వెలుగొందవలసిన ఈచిత్రశాల ఇట్లు రూపరిపోవుచుండుట మిక్కిలి శోచింపదగినది.



మనుచోళ చరిత్రలోని గో, గోవత్స ఆఖ్యానమునందలి ఒక దృశ్యము (నాట్య మండపములోకప్పులోని వర్ణచిత్రములలో నొకదాని ప్రతికృతి)

—Courtesy ; Archæological Survey of India.

# కలగూరగంప

## మహాత్మునితో ఒకరోజు

ఇప్పుడు మన మహాత్ముడు ౭౬ ఏళ్ల వృద్ధు. అయినప్పటికీ ౭౬ ఏళ్ల వృద్ధుకి మించిన పనిచేస్తాడు, ఒక్కరోజైనా తప్పకుండా. అతని ఆరోగ్యానికి మాత్రం సామాన్యంగా భంగంకలగదు. అందులో వున్న రహస్య మేమిటంటే, తను చేసిన పని పద్ధతి తప్పకుండా సక్రమంగా చేసుకునిపోతాడు రోజూ. ఆరోజు పూర్తిఅయేసరికి చేయవలసిన పనికూడ గమ్మత్తుగా పూర్తయిపోతుంది. మహాత్ముడు చేయవలసిన పనులన్నీ సరిగ్గా క్రమపద్ధతిలో జరిగేటట్టు వెయ్యికళ్లతో చూసే వాచీ ఒకటి మహాత్ముడిదగ్గ రుంది. అదెప్పుడూ మహాత్ముడి దగ్గరే వుంటుంది.

ఒకమాఋ ప్రఖ్యాత అమెరికా జర్నలిస్టు లూయీఫిషర్ మహాత్ముణ్ణి చూడడానికి వచ్చాడు. తనతో అతను మాట్లాడ్డానికి ఒక గంటకాలం నిర్ణయించాడు మహాత్ముడు. సరిగ్గా ఆనిర్ణయించిన గంట దాటిపోగానే ఫిషర్‌కి తన వాచీ చూపేడు. "నా జీవితంలో ఇంతవరకూ, ఒక్క సేవాగ్రాంలోతప్పితే ఇంకెక్కడా నాకు వాచీ అలా చూపించలే"దని తన పుస్తకంలో రాసుకున్నాడు లూయీఫిషర్ తర్వాత.



"ప్రఖ్యాత అమెరికా జర్నలిస్టు లూయీఫిషర్ మహాత్ముణ్ణి చూడడానికి వచ్చాడు."

'ఏకొచ్చినా మన మేలుకొఅకే'అన్న తత్వం మహాత్ముడిది. ఎన్ని అడ్డు వచ్చినా మనసులో వున్న కోరిక పూర్తిగా నెరవేరే వరకు వూరుకునే రకం కాదు. ఇంకా ఒక అర్ధ శతాబ్దంవరకూ తన దగ్గరికి మృత్యువు సమీపించలేదని ఎన్నిసార్లు మహాత్ముడు స్పష్టంగా అనలేదు? మహాత్ముడు మానవాతీతుడు.

మహాత్ముడు మంచి చమత్కారికూడ. ఒక నాడు ఒక కోపిష్టివిలేఖరి, "మీలో ఏకోశాన్నైనా హాస్యరసం వుందా?" అని మోటుగా ప్రశ్నించేసరికి, "నాలోనే హాస్యరసం

లేకపోతే నీలాంటి కోపిష్ఠి మనుషులతో ఇన్నాళ్లూ ఎలా నెగ్గుకొనివచ్చా ననుకున్నావు ?" అని చమత్కారంగా తిరుగు ప్రశ్న వేశాడు.

మహాత్ముడెప్పుడూ వెచ్చటి నీటిలో స్నానం చేస్తాడు. సబ్బు అవసరమేలేదు. నిమ్మరసం, నూనె కలిపి బాగా శరీరానికి మొదట రాసుకుంటాడు, తర్వాత స్నానం చేస్తూన్నప్పుడు మరోమాటు ఒక ముతకగుడ్డతో శరీరాన్ని రుద్దుకుంటాడు. అంతే! స్నానం అయేసరికి శరీరం పరిశుభ్రంగా వుంటుంది.

గడ్డం తనే సేఫ్టీ రేజర్‌తో గీసుకుంటాడు, అద్దం అవసరం లేకుండానే. అందుకే అప్పుడప్పుడూ అక్కడక్కడా కొన్ని వెంట్రుకసమూహాలు మృత్యువు వాతపడకుండా తప్పించుకుంటుంటాయి మళ్లీ వచ్చే క్షవరంవరకు. ఆశ్రమవాసులలో ఒకరు తలని క్షవరం చేస్తారు.



"ప్రార్థనలుజరిగాక మహాత్ముడు సంతకం అయిదురూపాయిలచొప్పున కొన్ని సంతకాలుచేస్తాడు."

మహాత్ముడు రోజూ చేసే పనులలో ముఖ్యమైనవి ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం; దేశదేశాలనుంచి అనేకమంది వస్తూంటారు దర్శనానికి–వారికి తగిన సలహాల నివ్వడం, వార్తాపత్రికలు చదవగా వినడం. వచ్చిన జాబులకి జబాబులు చాలామటుకు మహాత్ముడి కార్యదర్శిగారే రాస్తారు. ముఖ్యమైనవిమాత్రం మహాత్ముడు విని వాటికి ఏ విధంగా జబాబులు రాయాలో చెప్తూంటాడు. తోడి స్నేహితులకి, తనకి తెలిసిన రోగిష్ఠులకి తనే స్వంతంగా అప్పుడప్పుడూ జాబులు రాస్తూంటాడు. చాలామటుకు హిందీలోనే రాస్తాడు. అవతలవారికి గుజరాతీ వస్తే గుజరాతీలో రాస్తాడు. అత్యంత అవసరం వస్తేనే తప్ప ఇంగ్లీషులో రాయడు. అతనికి రోజూ రకరకాలైన వుత్తరాలు ప్రపంచపు మూలమూలలనుంచి వస్తూంటాయి.

ఆ వుత్తరాలతోపాటు పుస్తకాలు కూడా వస్తూంటాయి. అభిమానంచాత ఒకప్పుడు, అభిప్రాయం కోసం ఒకప్పుడు ఆ గ్రంథకర్తలు తమ పుస్తకాలని మహాత్మునికి పంపుతూంటారు.

ఎంతో ఎక్కువ జబ్బు చేస్తేనే తప్ప ప్రాతఃకాల సంధ్యానడకలు మానడు. మహాత్ముడు నడకకి వెళ్లేటప్పుడు ఒకరిద్దరు ఆశ్రమవాసులు వెంట వుంటారు. మహాత్ముణ్ణి కుటీరంలో వుండగా దర్శించే భాగ్యం చాలామందికి కలగదు. అందుకని అతను నడకకని వెళ్లేటప్పుడు కళ్లారా చూడ్డానికి ఇంతకన్నా మంచి సమయం దొరకదని చాలామంది ఆయనతో నడకకి వెళ్తారు.

ప్రార్థనాసమయం ఎప్పుడొస్తుందా అని చాలామంది ఆతృతగా ఎదురుచూస్తూంటారు. ఆసమయంలో మహాత్ముని దర్శనమేకాకుండా "మహాత్మాగాంధీ

గారితో సమంగా ప్రార్థనచేసే గొప్ప అవకాశం” కలుగుతుందని చాలామంది ప్రార్థనకి రోజూ వస్తుంటారు.

ప్రార్థనలు జరిగాక మహాత్ముడు సంతకం అయిదురూపాయలచొప్పున కొన్ని సంతకాలు చేస్తాడు. తమ పుస్తకాలమీద మహాత్ముని సంతకం చూసి మురిసేవా రెందరో వుంటారు. సంతకాలవల్ల వసూలైన సొమ్ము ‘హరిజననిధి’కి వెళ్తుంది. పధ్నాలుగు భాషలలో చక్కగా సంతకం చేయగలడు మహాత్ముడు.

ఒక బల్ల, దానిమీద ఒక సన్ననిచాప-వీటి మీద మహాత్ముడు హాయిగా నిద్రపోతాడు. ఇంతకు పూర్వం ఇవికాక మూడుదిండ్లుకూడ వుపయోగించేవాడు. కాని అవి యిప్పుడు లేవు. కోరి తీసేశాడు. వైద్యసలహా ననుసరించి రాత్రి ఎనిమిదిగంటలకాలం నిద్రపోతాడు. ఒక అరగంటనుంచి గంటవఱకు పగటి వేళ విశ్రాంతి తీసుకుంటాడు. పూర్వం ఇరవై నాలుగుగంటలలో ఒక్క ఆరుగంటలకాలం మాత్రం విశ్రాంతి తీసుకునేవాడు.

మహాత్మునికి పళ్లు లేవు. బోసినోరు. తినేటప్పుడు కృత్రిమదంతాలతో తింటాడు. మితంగానూ, అతిజాగ్రత్తగాను వుంటాడు ఆహారవిషయంలో. తెల్లవారుఝాము నడకకి పోయేముందు ౧౬ అవున్సుల బత్తాయి నారింజరసం, ఒక టీచెమ్చాడుఅల్లంమురబ్బా, ఒక అవున్సు బెల్లం తీసుకుంటాడు రోజూ. అతను చేసే భోజనంలో ఆరునుంచి ఎనిమిది అవున్సుల వుడికిన కూరలు, రెండవున్సుల పచ్చికూరలు ముఖ్యంగా వుంటాయి. ఉప్పు నిషేధం. ఇవి కాక గోధుమనూక, మేకపాలతో ప్రత్యేకంగా తయారు చేసిన రొట్టె ఒకటి రెండవున్సులగి తింటాడు. కొన్నేళ్లకిందట జంతుసంబంధమైన ఆహారాన్ని ముట్టుకోనని ఒక నియమం పెట్టుకున్నాడు గాని అతని అనారోగ్య కారణంగా మేకపాలు తీసుకోక తప్పిందికాదు.

ఆశ్రమవాసులు మాత్రం గోధుమ, బియ్యం’ ఉప్పు, ఉల్లిపాయలతో సహా కూరలు తింటారు.

మహాత్ముడు జీతం యిచ్చి నౌకర్లని పెట్టుకోలేదు. అతనికి అనవసరం. అక్కర్లేదు కూడ. తాను








స్వయంగా చేసుకోలేని పనులు ఆశ్రమవాసులే అతి సంతోషంగా చేస్తారు. పెద్దమనుషులు, పత్రికా విలేకర్ల రాకపోకల విషయం శ్రీ ప్యారీలాల్ గారు స్వంతంగా చూసుకుంటారు. శ్రీ కానూగాంధీగారు మహాత్ముణ్ణి వెయ్యికళ్ల చూస్తూంటారు. పైగా ప్రార్థన విషయంలో చాలాసహాయం చేస్తారు. శ్రీమతి డాక్టర్ సుశీలానాయర్ మహాత్ముని ఆరోగ్య విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటుంది. ఆమె సేవాగ్రామంలో ఒక చిన్న శాల నడుపుతూంది.

“మహాత్మునికి వైద్యం చేయడం చాలా కష్టమైన పని. ఇష్టంవుంటే వైద్యసలహాలని తు. చ. తప్పకుండా పాటిస్తాడు. గాని ఆ ‘ఇష్టం వుండడం’అనేది చాలా అరుదు”అని ఆమె చెప్తూంటుంది.

ఈవిధంగా మహాత్ముడు ఎక్కడుంటే అక్కడ నిత్యం విధిగా జరుగుతూంటుంది. [“హిందూస్థాన్ స్టాండర్డు”చదివి]

జి. వి. యల్. యస్. స్వామి.



# విమర్శనము



## శ్రీ వ్యాస-పాణినిభావనిర్ణయః

కర్త: మహామహోపాధ్యాయ, వ్యాకరణం, శ్రీసుబ్రహ్మణ్యం సేతు మాధవాచార్యులుగారు. ప్రకాశకులు: ఆర్. రామసూరిశర్మగారు, ఎస్. వి. ఎస్. కాలేజి, తిరుపతి. డెమ్మీ ౮+౨౦+౨౦౮ పుటలు (దేవనాగరి) వెల రు 3 లు.

వ్యాసుడే మహార్షి తాను వేదాంతసూత్రములను విరచించెనో చెప్పజాలముగాని, ఈ గ్రంథమునకున్న భాష్యములు మరేసూత్రగ్రంథమునకును లేవు. భారతదేశమునందలి ప్రతిమతమువారును వ్యాసుడు తమ మతస్థుడే యని నిరూపింప శ్రమపడిరి; శ్రమపడుచున్నారు గూడ.

ద్వైతాద్వైతవిశిష్టాద్వైత సిద్ధాంతపరములగు భాష్యగ్రంథములను విడచినను, వ్యాసుడు తమ మతమునకు చెందినవాడే యని నిరూపింప త్రిమతములవారు రచించిన గ్రంథములు కొల్లలుగ నున్నవి. ఇటీవలనే కాశీనుండి శ్రీ చిద్ఘనానందపురిస్వామివారు విరచించిన 'బాదరాయణవ్యాస సమ్మత బ్రహ్మసూత్రభాష్య నిర్ణయః' అను అద్వైతమతపరమగు రచన ప్రకాశితమైనది. దానికి ప్రతియోగియనునట్లు ప్రస్తుతము తిరుపతినుండి ఈ గ్రంథము వెలువడినది.

రచయితయొక్క తండ్రి మహామహోపాధ్యాయులు; రచయితకూడ మహామహోపాధ్యాయులే యగుట గమనింపదగు విషయము. అత్యంతము సుబోధమగు భాషలో పాణినిసూత్రములయందు అచ్చటచ్చట గానవచ్చు అంశములను పరిగ్రహించియు, సుతదకూలములగు వ్యాససూత్రాంశములను పరిగ్రహించియు ద్వైతమతమే సమంజసమని నిరూపింప ప్రయత్నించిరి. ఇందు మహామహోపాధ్యాయులు ప్రదర్శించిన ధీశక్తియును, అవలంబించిన ప్రణాళికయును ఆశ్చర్యమును కలిగించుచు శ్రీవారి మేధాసంపత్తిని ప్రకటించుచున్నవి. ప్రతిప్రకరణాంతమున, ఆయాప్రకరణముల సారాంశమును దెల్పెడు సంగ్రహశ్లోకము లున్నవి.

ఈ గ్రంథమును ద్వైతలోకము పూజ్యముగ భావించి సమాదరించు ననుటకు సందేహములేదు. ఇప్పటికిని సంస్కృతమున చక్కని వచనగ్రంథములు—దేశభాషలలో వ్రాయునట్లే—విరచింపగల్గు శక్తి గల పండితు లుండుట మన యదృష్టము. ద్వైతేతరులుగూడ ఈ గ్రంథమును పఠించి శ్రీ సేతు మాధవాచార్యులవారి పరిశ్రమను సార్థకమొనర్తురుగాక!

కాని, గ్రంథముయొక్క ఆద్యంతములయందుండిన నీటగు అచ్చు గ్రంథముయొక్క మధ్యభాగమున చెడిపోయినది. ఇది పఠితలకు శ్రమదాయకముగ నుండునేమో యని భయపడుచున్నాము

శ్రీ నిర్వికల్పానందస్వామి.

## పరివర్తనం

రచయిత: గోపీచంద్ గారు. ధర రూపాయి. ప్రతులకు జాకోబిన్ పబ్లిషర్స్-తెనాలికి వ్రాయాలి.

రాజారావు అనే అతను పక్కా సౌందర్య పిపాసి. అతని ఊహలూ, చేష్టలూకూడా సున్నితమైనవి. భావనాజగత్తులోనే సదా నివసించేవాడు. ధనవంతుడు. వ్యక్తిత్వం కలవాడు. వ్యక్తిత్వవాదికూడానేమో. తోటలో ఉంటాడు. అతనికి భార్య పోయింది. ఆ పోయిన భార్యను ఆరాధించటంలో నేలవిడిచిన సాములాగవుతూంది అతని జీవితం. అతని లోకంలోనే అతను ఉండి, తదితరులకు అతను చిత్రమైన వ్యథను కలిగించుతాడు. అతని అక్కగారు తమ్ముణ్ణి చూడవచ్చి యిల్లంతా సంబాళిస్తుంది. తమ్ముణ్ణి లోకంలో పడేయాలని చాలా తాపత్రయం పడుతుంది. 'శాంత' అనే పిల్లను రప్పిస్తుంది. తాను జీవితాన్నుంచి తప్పుకు తిరుగుతున్నానని రాజారావుకు తెలిసేవరకూ ఆమె ఎంత సున్నితంగా, సునూక్ష్మం

గానో వ్యవహరిస్తుంది. రాజారావు లోకంలో, నలుగుర్లో పడతాడు. ఇదీ కథ.

ఈ చిన్న నవలలో రచయిత కొన్ని విషయాలను గురిచూచాడు. భావనాజగత్తులోనే విహరించే ప్రాణులు జీవితాన్నుంచి తప్పుకుంటున్నారనీ, నలుగురికీ సంఘానికీ పనికిరాకుండాపోతున్నారనీ, అక్కడా వారు పీసుఖాన్నీ పొందుకోటం లేదనీను. వీరిని లోకంలో పడేయాలిసిన అవసరం ఎంతైనా ఉందనీను. ఎవరో వొక శ్రద్ధాళువులు వొచ్చి తీరికగా చెయిచేసుకుంటేతప్ప వీరు మన లోకంలోకి రారనీను. వీటిని తన పనివాడితనంతో రచయిత చదువరికి నేర్పుగా చెప్తాడు.

రచనావిధానంలో ఈ రచయితకు ప్రత్యేకత ఉన్నది. అతిస్తిమితంగా, తేలికగా చెప్తాడు. గజిబిజిగా చెప్పడు. చెప్పడంలో ఉన్న అమితమైన కాపీసంకల్ల, మరి యిక్కడ యింకొంచెం చెబితే బాగుండేది అనిపిస్తుంది. అయితే అది రచనావిధానంలోని సుగుణమేమో.

జ. రు.

## ఆధునికప్రపంచచరిత్ర

రచయిత: డాక్టరు పి. శ్రీనివాసాచార్యులుగారు, యం. ఏ., పి. హెచ్. డి. (లండను), ప్రిన్సిపాలు, యస్. ఆర్. ఆర్. కాలేజి, బెజవాడ. ప్రకాశకులు: రావుబ్రదర్స్, తెనాలి అండ్ మదరాసు. వెల రూ. ౧-౪-౦.

క్రీ. శ. ౧౪౯౨లో అమెరికాదేశమును కనుగొన్న నాటినుండి మొన్న ౧౯౪౦ వరకుగల ఆధునిక ప్రపంచచరిత్ర యంతయు ఈగ్రంథములో తేటతెలుగున కరతలామలకముగా నిరూపింపబడియున్నది. నేటి యస్. యస్. యల్. సి. విద్యార్థులను దృష్టిలో పెట్టుకొని వ్రాయబడియున్న ఈ పుస్తకము వారికి చాల ఉపయోగకారిగా నున్నదనుటకు సందియమెంతమాత్రమును లేదు. రచనకు తోడు చిత్రములు, కూర్పు తీర్పులుకూడ అందముగానున్నవి.

---

## ఉపయుక్త విద్య

రచయిత: యల్లాపంతుల జగన్నాథంగారు, బి. ఏ. ప్రాప్తిస్థానము: వెంకట్రామా అండ్ కో., బెజవాడ. వెల ౨ అణాలు.

హిందువుల కాదర్శరూపమైన విద్యావిధానమును సూచించు చిన్నగ్రంథము. ప్రాచీన భారతీయ విద్యావిధానమే ప్రశస్తమైనదని గ్రంథకర్తగారి వాదము; దానిని నిరూపించుటకే ఈ ప్రయత్నము.

## ఆంధ్రజ్యోతి
### (గాంధీజీ జన్మదినసంచిక)

గాంధీమహాత్ముని జీవితచరిత్రలోని వివిధవిషయములు వివిధాకరములనుండి సంగృహీతములయినవి మాత్రమే కాక శ్రీ వేలూరు శివరామశాస్త్రిగారు మొదలైన పెద్దలు రచించిన ప్రత్యేకవ్యాసములుకూడ ఈ సంచిక నలంకరించియున్నవి. వెల ౬ అణాలు. ప్రాప్తిస్థానము. ౪౩ ఆచారప్పన్ వీథి, మద్రాసు.

# గ్రంథస్వీకారము

---

## నాలుగు నాటికలు

కర్త: మారేమండ రామారావుగారు. ప్రకాశకులు: వెంకటరామా అండ్ కో., ఏలూరు. వెల రూపాయ.

## Astrological Self-instructor

పదవ ముద్రణ. రచయిత: ప్రొఫెసరు బి. సూర్యనారాయణరావుగారు, బి. ఏ. ప్రకాశకులు: అస్ట్రలాజికల్ ఆఫీసు, బసవనగుడి, బెంగుళూరు. వెల ౪ రూపాయలు.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.

# ఇండియన్ టీలలో అత్యుత్తమమైనది






చక్కని రుచి, ఘుమ ఘుమలాడే సువాసన, నేత్ర పర్వంగావుండే రంగు, తక్కువధర, వీటి అన్నింటి నిబట్టి లిప్టన్స్ టీ గర్ల్ మిగతా వాటిని తలదన్ని అత్యధిక గౌరవాన్ని తెచ్చుకున్నది.

## లిప్టన్స్ టీ గర్ల్

మృదు మధురమైన ఇండియన్ డస్ట్

LTK 84 G

Regd. No. M. 1856. 8th OCTOBER 1945.